


# దీని నిజానిజాలు తెల్సుకోండి

- ★ బాన్‌ది అసలైన కాఫీ రుచి, సువాసన
- ★ బాన్ 100% పరిశుద్ధమైంది. గొప్ప కాఫీ సారం. 50గ్రా.ల టిన్నుకు 30 కప్పు లవుతాయి — అంటే ఓ కప్పు 10 పైసలు!
- ★ బాన్ భారత దేశంలోని అత్యంత అధునాతన ఇన్‌స్టెంట్ కాఫీ ఫ్యాక్టరీలో తయారైంది.

అందుకే క్రొత్తగా కాఫీ త్రాగేవారిలో చాలా మంది బాన్ కావాలంటున్నారు. ఇప్పుడు తెల్సుకోండి! బాన్ కమ్మదనం అమోఘం. రుచి అద్భుతం. చెప్పలేం. నేడే త్రాగి చూడండి! ఇప్పుడే త్రాగండి!

# బాన్

## ఇన్‌స్టెంట్ కాఫీ

బాన్ రుచి అద్భుతం!

బ్రూక్ బాండ్ జాగ్రత్తగా నేర్పుతో తయారు చేసింది

Bensons 975B/10/TEL

తప్పక
చూడండి!

STUDIO: ERANKI



హైదరాబాద్ మూవీస్ చిత్రం.....

# అర్ధరాత్రి

నిర్మాత: P. గంగాధరరావు

దర్శకత్వం: సాంబశివరావు

JOTHEE

నవనవోన్మేషమైన
ప్రణయానికి,
సునిశితమైన కొత్తతరహా
శృంగారానికి
మంగళహారతి పట్టిన
చిత్రం....

[శ్రీ]మములో 'ఉత్తమ' తొలగించి 'అభిమానా' చేర్చిన 'ఫిలిం బాలట్' జయప్రదమగునని నా చిన్న సలహా. (దయచేసి సదుదుద్దేశ్యంతో ఈ ఉత్తరమును ప్రచురిస్తారని ఆశిస్తున్నా.)

సి. హెచ్. రామారావు, (కాకినాడ)

## కథలు

మా అభిమాన పత్రికలో (తేదీ 18—4—69) 'స్నేహలత' కథ మమ్మెంతో ఆకర్షించినది. నేడు స్నేహానికి గల విలువలను, ఆత్మీయతను రాధ, సుశీల పాత్రల ద్వారా కడురమ్యంగా చిత్రించిన కథా రచయిత్రి ఎం. రాజేశ్వరి గార్కి మా ప్రత్యేక అభివందనలు తెలుపగోరుచున్నాము.!!

కుమారి అనూరాధ, రామ్మోహన్, (హైదరాబాద్)

* * *

'కథ మాత్రం కాదు' కథ చాల బాగుంది కథ కంటే హెడ్డింగ్ నాకెంతో నచ్చింది.

కోనూరు రమణారావు, (అనకాపల్లి)

## సీరియల్

వెందుకండీ! ఈమధ్య కథల్లో క్రిస్టియన్స్‌ని సాధ్యమైనంతవరకూ 'అదోలా' చిత్రీకరిస్తున్నారు? కొద్ది రోజుల క్రితమే పత్రికలో ప్రచురింపబడిన ఇల్లిందల సరస్వతిగారి 'జీవితవలయాలు' ప్రస్తుతం ప్రచురింపబడుతూన్న వెంకటరమణ గారి నవలలోనూ ఇలా చేయడం జరిగింది. వక్రబుద్ధత, నీతి—ఆయా మనుష్యుల స్వభావాన్నీ, వాతావరణాన్నీ కొన్నిసార్లు పరిస్థితులను బట్టి ఉంటుంది, కానీ కులాన్ని బట్టి కాదు. వెంకటరమణ గారు కులాంతర వివాహానికి 'మేరీ'నే ఎన్నుకోవాల్సిన అవసరం లేదు. మాంసం తినే బ్రాహ్మణేతరులు ఎవరైనా కులాంతర వివాహానికిందే లెక్క. అలాంటి పాత్రను ఎన్నుకోకూడదు— అని కాదుగాని 'క్రిస్టియన్' అనగానే కథలోని పాత్రలు అదోలా, అయిపోవడం—ప్చ్—బావుండలేదు.

ఇక సరస్వతి గారి విషయం — ఆవిడ లాంటి పెద్ద రచయిత్రులే ఇటువంటి కులాంతరభేదాల్ని కల్పించే సంఘటనలు (ప్రోత్సహిస్తున్నట్లు వ్రాయడం చాలా విచారకరం.

నాకు జ్ఞాపకమున్న ఉదాహరణలు మాత్రమే రాశాను. ఇలాటివి చూస్తే ఇంకా ఎన్నో!

ముడే విజయకుమారి, (హైదరాబాదు)

## వ్యాసాలు

18—4—69 వార పత్రికలో ప్రచురించిన 'నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య ఏమిటి?' అనే శీర్షిక చదివాను. దానిలో కానులకిచ్చే విలువ కన్నెలకివ్వలేని యీ చదువుకున్న నాగరికతా సమాజాన్ని వుద్ధరించడానికి మరో గురజాడ, మరో వీరేశలింగం ఉద్భవించవలసి వుంటుందేమో! అంతవరకు ఈ యిరుసు క్రింద ఈ కన్నెలు నలిగిపోవలసుంటుందేమో!' అని మన్నెం శారదగారు వ్రాసారు. కాని అది సమంజసముగ లేదు. ఈ రోజులలో ప్రతి స్త్రీ తనకు కాబోయే భర్త డాక్టరుకానీ, ఇంజనీరుగాని, కలెక్టరు. వి అయి వుండవలెనని అనుకుంటారు, అదే విధముగ వారి తల్లిదండ్రులు కూడా అదే విధంగా అనుకుంటారు, ప్రయత్నిస్తారు. అందువలననే వారంతా తమ చదువుకు అయ్యే ఖర్చు కనీసం 25 వేల రూపాయలున్నా రావలెననికోర్తారు. కట్నం అనే సమస్య ప్రతి స్త్రీకి వుంటుంది కాని ఆ స్త్రీయే తనకు తను తల్లిదండ్రులిచ్చే డబ్బుతోనే అంటే 25వేల రూపాయలు యిచ్చి, ఏ డాక్టరునో, ఏ ఇంజనీరునో, ఏ కలెక్టరునో వివాహము చేసుకొనే దానికన్న డబ్బు తనపేర వేసుకొని ఏ గుమస్తానో, యే టీచర్నో వివాహము చేసుకొని ఏ చింతా లేకుండా కాలం గడపడం బాగుంటుంది. అంతేకాకుండా తనకు కాబోయే భర్త కనీసం బి.ఏ. అయినా చదివితే బాగుంటుంది అంటే. వారికి కట్నాలు సమస్య తప్పదు. పెళ్ళి జరుగదు. అందుచేత ప్రతి స్త్రీ ముందుకువచ్చి కట్నం సమస్య తీర్చగలరని భావిస్తున్నాను.

యం. వి. వి. మురళీకృష్ణారావు, (సీతాంపేట)

## గమనిక

ఈ సంచికలోని 30వ పేజీలో 'ఏదిసత్యం? ఏదసత్యం?' సీరియల్ చివర 'ఇంకా ఉంది' అని ఉండాలి. పాఠకులు గమనించకోరుతున్నాము. సం॥ ●




# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 2—5—'69
శ్రీ సౌమ్యనామ సం॥ వైశాఖమాసం పౌర్ణమి
సంపుటము : 61 సంచిక : 36

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
'బంగారుపంజరం'లో వాణిశ్రీ.

చివరి అట్టమీది చిత్రం :
'భలేఅబ్బాయిలు'లో రేణుక.



అభివృద్ధి కావాలంటే ఈ తేడా పోవాలి
అభివృద్ధిలో వున్న రాష్ట్రాలు
వెనుకబడిన రాష్ట్రాలు
మనిషిలో మనిషి
కంట్రోళ్లకు నిజలింగప్ప విముఖత
కంట్రోళ్లు మంచివి
కంట్రోళ్లు చెడ్డవి
కాంగ్రెసు అధ్యక్షుడు
నిజలింగప్ప
కాంగ్రెసును ఓడిస్తాను
ఈ కాలుతోటా!
అంతః కలహాలు!
కాంగ్రెసును తుడిచిపెట్టాలని కమ్యూనిస్టుపార్టీ ఆశ
ఇది ఆత్మహత్యా
డూబ్చెక్
డూబ్చెక్ పదవీచ్యుతి
BOMMEN

# ప. బెంగాల్ సంఘటనల విషయంలో ప్రధాని మౌనం!

బెంగాల్ యునయ్టెడ్ ఫ్రంట్ ప్రభుత్వం, తెలంగాణా ఆందోళన కేంద్ర ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టేశాయి. ఈ వారం న్యూఢిల్లీ పెద్ద గందరగోళంలో మునిగి పోయింది.

'సర్వమానవ సమానత్వానికి నేను ఒప్పుకునేది లేదు.' అని పూరీ శంకరాచార్యుల వారు నడుం కట్టి, పురాణాలని అసరా చేసుకుని ఛీష్మించుకు కూర్చున్నారు. శంకరాచార్యుల వారికి అస్పృశ్యత అంటే ఏమిటో తెలియాలంటే, ఆయన ఒకసారి దక్షిణాఫ్రికా వెళ్లి రావడం మంచిది. శ్రీవారు చేసిన పరిశీలనలు కొన్ని జన సంఘం వారిని కొంచెం ఇబ్బంది పెట్టి వుండాలి. తత్ఫలితంగా ఆయనగారి గోవధ నిషేధ సంఘ సమావేశానికి ప్రచారం లేకుండా పోయింది. ఈ ఉద్యమాన్ని తిరిగి లేవదియ్యాలనుకున్నారు గాని, అది నెరవేర లేదు

ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ తెలంగాణా సమస్యని తీర్చడానికి ఒక బృహత్పథకాన్ని తయారుచేశారు. ఆమె భారతదేశం మీద కమ్యూనిస్టు ఛాలెంజిని ఎదుర్కొంటూ వస్తున్నారు. ఆమె ప్రభుత్వానికీ, ఆమెకీ ఈ ఛాలెంజి మింగుడు పడనంతటి సమస్యగా తయారయి, అన్ని సమస్యలకంటే ఎక్కువ బాధిస్తున్నది. అయినా ఆమె ఈ విషయాన్ని తీవ్రమైనదిగా తీసుకుంటున్నట్టు కనిపించడం లేదు...

ప్రధాన మంత్రిగారి ఈ అవస్థ వర్ణనాతీతం. రబీంద్ర సరోవర్ స్టేడియం 'స్కాండల్' విషయంలో ఇది రుజువవుతునే వున్నది. అనేకమందిసాటి స్త్రీలు చెప్పరాని విధంగా హింసింప బడినప్పుడు ఆమె భావాలు ఎలావున్నాయో ఎవరికీ అర్థం కాలేదు!

ఆ సరోవర ప్రాంతంలో గూండాలు వీరవిహారం చేశారని, అందులో ముఖ్యంగా నష్టపడినవారు స్త్రీలని, రిపోర్టువల్ల తెలియవస్తున్నది. స్టేడియంలో జరిగిన ఒక **ఉత్సవానికి—నగరంనుంచి** నగర ప్రాంతాలనుంచి వచ్చిన జనానికి - జరిగిన పరాభవం ఇది!

పోలీసులు లాఠీచార్జి చేశారు. 'టీర్ గాస్ షెల్స్' ద్వారా భయపెట్టారు. చివరికి నాలుగు రౌండ్లు కాల్పులుకూడా జరిపారు. విద్రోహులు కార్లను, బస్సులను, రెండు పోలబూత్‌లను తగలబెట్టినప్పుడు; పోలీసులపై రాళ్లు రువ్వినప్పుడు ఈ పని తప్పనిసరి అయిపోయింది.

స్త్రీలు ఈ అలజడిలో ఎంతో నష్టపోయారు. నగలు వాణ్యాలు పోగొట్టుకున్నారు. ఈ విషయాన్ని ఏ పత్రికా ప్రచారం చెయ్యలేకపోయింది. దౌర్జన్యకారులు స్ట్రీట్ లైట్లను పోగొట్టి, ఇళ్లల్లోకూడా లైట్లు వెయ్యనివ్వకుండా నిర్బంధపెట్టి ఆ ప్రాంతమంతా చీకటిమయం చేశారు.

ఈ చీకట్లో ఎన్నయినా దురాగతాలు జరిగిపోయాయి. దౌర్జన్యకారులు కత్తులు కఠార్లతో దిరిగినట్టు ఆ ప్రాంతీయులు చెబుతున్నారు. ఎవరికన్నా ఆశ్రయం ఇచ్చినట్లయితే, యిచ్చిన వాళ్లని శిక్షిస్తామని బెదిరించారట!

విశాలమైన ఈ ప్రాంతమంతా శాంతిభద్రతలు లేకుండా అలాగూండాల చేతుల్లో నలిగిపోయింది. చాల ప్రాంతాల్లో పోలీసుల అజే అసలు తెలియలేదు! ఉత్సవానికి హాజరయిన మంత్రి పుంగవుల కుటుంబాలకి, తదితర ప్రముఖ వ్యక్తుల కుటుంబాలకి రక్షణగా పోలీసు దళమంతా నియోగింప బడిందని ఒక వార్త!

చెరువులో అనేకమంది 'కళేబరాలు' లభించాయి. వీరంతా దారుణకాండకి గురి అయినవారే. గొడవ జరుగుతుండగా భయపడి తప్పించుకోవటానికన్నా దూకివుండాలి, లేదా బలవంతంగా తోసివేయబడిఅన్నా వుండాలి. చిరిగిన చీరలు, పీలికలు కొద్దిరోజుల్లో మరిన్ని దారుణ సత్యాలని బహిర్గతపర్చాయి.

సుమారు రెండువందల మందిని పోలీసులు అరెస్టు చేశారు. మరికొంత మందిని మరో విధంగా శిక్షించారు. అయితే పోలీసు రిపోర్టులో స్త్రీలు ఎలా హింసింప బడిందీ లేదు. అసలు వారి ప్రస్తావనే లేదు. ఇదే విచిత్రం!

ఈ ఉత్సవానికి సంబంధించిన కార్యక్రమంలో ఒక మంత్రివర్యులు ఉత్సాహంగా పాల్గొన్నారని తెలియవస్తున్నది. కలకత్తాలో వారంవారం ఏదోఒక ఘోరం జరగడం రివాజే. ఈ సంఘటనని కూడా అందులో కలిపేసి చేతులు దులిపేసుకోవాలని చూస్తున్నారు. అందుకే అసలు కారణాలు బయటికి రానివ్వడంలేదు.

ఈ సంఘటన జరిగిన రెండురోజులకి ఛీఫ్ మినిస్టరు జ్యోతిబాసుగారికి మెలుకువ వచ్చింది. వెంటనే లేచి ఆయన ఒక ప్రకటన ఇచ్చారు. 'ఇలాంటి దుస్సంఘటనలకి కారణం యువకులు. వారిని ఉత్సవాల్లో పాల్గొనకుండా సంరక్షకులు జాగ్రత్తపడితే ఈ విధమైన అల్లర్లు జరగవు.' ఇదీ వారి ప్రకటనలోని సారాంశం!

పిల్లలూ, స్త్రీలూ బలహీనులని అందరికీ తెలిసిన సత్యం. ఈ బలహీనులకి పశ్చిమబెంగాల్ ఇచ్చే రక్షణ ఇంత పకడ్బందీగా వుంది! శ్రీమతి గాంధీగారు కూడా ఒకతల్లే. ఆమె ఈ విషయాన్ని సక్రమంగా పరిశీలిస్తే—అన్యాయానికి కించపడకపోరు. దుర్మార్గానికి బలైపోయిన ప్రజలమీద సానుభూతి చూపించకపోదు.

ఒకసారి చవాన్‌గారు, 'పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ప్రజల రక్షణకోసం ఎక్కువ శ్రద్ధ తీసుకుంటున్నట్టులేదు' అన్నారు. అప్పుడు బెంగాల్ మంత్రి ముఖర్జీగారు 'చవాన్‌గారు చెప్పేదేమిటీ ? ఆయనకి రక్తంలో స్నానం చెయ్యాలని కోరికగా వుందా ?' అని ఎదురుసవాల్ చేశారు. ఇదీ పరిస్థితి. దీని అర్థం ఎవరికి వారే ఆలోచించుకోవాలి!

బెంగాల్ బంద్‌ని ఎవరయినా శిరసావహించకపోతే ఎవరిరక్తంలో వాళ్లు స్నానం చేస్తారు. అన్నట్టుగానే ఈ వర్గం పని చేసింది. అంతకు అంతా ప్రజలు అనుభవించనూ అనుభవించారు.

పి. యస్. పి. నాయకుడు హెమ్‌బారువా గారి మాటలు ఈ సందర్భంలో వినతగినవి: 'పశ్చిమ బెంగల్‌లో జరిగిన సంఘటనని చూస్తే అది మూకుమ్మడి ప్రతిఘటనగా కనిపిస్తున్నది. కేంద్ర ప్రమేయాన్ని పైదాలగచేయడానికి రాష్ట్ర ప్రభుత్వం కుట్ర'— అని ఆయన అన్నారు.

క్రితం, కేరళలో జరిగిన అల్లర్లలోను, ఇప్పుడు బాహాటంగా పశ్చిమ బెంగాల్ ఎదుర్కొన్న సంఘటనలోను శ్రీమతి ఇందిరాగాంధీ మౌనం వహించారు. ఇది చెబితే నమ్మకూడని విషయంగా వుంటుందిగాని, కొన్ని కమ్యూనిస్టు పత్రికలు ఇందిగాంధీ విధానాలను సమర్థిస్తున్నాయి ఫలితంగా, జరగబోయే విషయం అంత శ్రేయోదాయకమనిపించదు. ఒకవేళ ఆమె పదవినుంచి తప్పుకుంటే స్వంత పార్టీ నొకదాన్ని సరికొత్తగా లేవదీయవచ్చు. (పండిట్ మోతీలాల్‌గారు ఒకప్పుడు అవలంబించిన పద్ధతే ఇది) ఒకవేళ ఇలాంటిదేదైనా నిజంగా జరిగితే, అది దేశం మంచికోసం వినియోగపడితే ఆనందించ వలసిన విషయమే! ఒకసారి కాంగ్రెసులోని కమ్యూనిస్టువర్గం కాంగ్రెసు పార్టీని సమూలంగా నాశనం చెయ్యాలని కంకణం కట్టుకున్నారు. అయితే వారి పథకం కొంతవరకు మాత్రమే నెరవేరింది' ఆ 'కొందరూ' తప్పుకున్నారు. నికార్సయిన కాంగ్రెసుపార్టీ మిగిలి ఏకీభావాన్ని సమృద్ధిగా కూర్చుకోగలిగింది. ఇది ఒకనాటి కథ.

శ్రీమతి గాంధీ తనకు తను తప్పుకుంటే అది వేరు. ఆమెను తప్పించడానికి ప్రయత్నం చేస్తే అది వేరు, అవుతుంది. కమ్యూనిస్టులు ఏమేమో అనుకుంటున్నారుగాని, ఆమెను తప్పించడం అంత తేలికయిన వ్యవహారంకాదు. శ్రీమతి గాంధీ బేఫికరుగా 1972 వరకు పదవి నిర్వహిస్తారు. అనుమానంలేదు. 1972 తర్వాత ఏమవుతుంది? అన్నది మనం చెప్పలేం.

పశ్చిమ బెంగల్‌లో జరుగుతున్న దుస్సంఘటనలకి శ్రీమతి గాంధీ నోరు విప్పరు. ఆమెను పూర్తిగా అర్థం చేసుకున్న చవాన్, సర్దార్ స్వరణ్ సింగ్‌గార్లు రంగంలోకి దూరకలేరు ఇదీ సమస్య.

'జాతీయ అభివృద్ధి సంఘ సమావేశాలకి బెంగాల్ మంత్రులు కొందరు ఢిల్లీకి వస్తారు అప్పుడు బెంగాల్ పరిస్థితిపై కొంత చర్చ జరిగేందుకు అవకాశం లేక పోలేదు. కాని, ఈ మంత్రివర్యులు అవులిస్తే పేగులు లెక్కపెట్టేంత తెలివైనవారు. శ్రీమతి గాంధీకి ఆమె సీనియర్ మంత్రులమధ్యవున్న అంతః కలహాలని అర్థం చేసుకుని ముందు ముందు తమ వ్యవహారాలని చాకచక్యంగా నిర్వహించుకోలేక పోతారా అనే మీమాంసకూడా వుంది. శ్రీమతి గాంధీ మవునాన్నివారు అర్థం చేసుకోగలరు. ఆమె విధానాలని పసిగట్టగలరు కమ్యూనిస్టు నాయకుడు డాంగేగారు చవాన్‌గార్ని పదవిచ్యుతుడ్ని చెయ్యమని ఒకప్పుడు డిమాండ్ చేశారుకూడా. తక్కిన బెంగాల్ మంత్రులు దానిని బలపర్చడానికి అవకాశం లేకపోలేదు.

ఇది శ్రీమతి గాంధీ వ్యక్తిగత యిష్టా

( 64వ పేజీ చూడండి)

ఆటలు

## జూనియర్‌లపద్ధ చందాలు!

ఆల్ ఇండియా లాన్ టెన్నిస్ ఎసోసియేషన్ వారు జూనియర్లని బాగా తరిఫీదు చేస్తున్నారు. ఇది సంతోషింపతగ్గ విషయం. వారిని అభినందించాలి. ఆర్. కృష్ణన్ కన్నా పెద్ద పేరు సంపాదించుకున్న భారతీయ ఆటగాడు (టెన్నిస్‌లో) లేడు. అయినా ఈ మధ్య వ్యాపారంలో మునిగి ఉండటం చేత అతను డేవిస్ కప్ మాచ్‌లలో తప్ప ఆడటం లేదు. ఇక ప్రేమ్‌జిత్‌లాల్, జయదీప్ ముఖర్జీలు ఆరోగ్య కారణాల వల్ల ఆడటం లేదు. వీరందరి బదులలా ఆడే ఆటగాళ్ళని ఇప్పటి నుంచే తయారు చెయ్యాలి. ఎస్. పి. మిశ్రా కొన్ని సంవత్సరాల క్రితం బాగా పయికి వచ్చాడు. ఎసోసియేషన్‌లో రాజకీయాల వల్ల అతని కీర్తి మరుగున పడింది. ఇప్పుడు మళ్ళీ టీమ్‌లో ఉన్నాడు. మంచిదే!

పోయిన ఏడు మన జూనియర్ ఆటగాళ్ల చేత సిలోన్ సీనియర్స్‌తో డబుల్స్ ఆడించారు. ఇది ప్రమాదకరం అన్నారు కొందరు. చివరికి జూనియర్సే గెలిచారు....

ఈ ఏడాది మళ్లీ రెండుసార్లు ఆడి ఒకసారి (డబుల్స్‌లో) ఓడిపోయి భారతదేశం సిలోన్‌కన్నా ముందంజ వెయ్యకుండా సమానంగా ఉండి పోవటానికి కారకులు అయ్యారు. సింగిల్స్ గెలవటం చేత 'టయ్' అయింది.)

త్వరలోనే ఒక భారత జూనియర్ టీమ్ విదేశాలకి వెడుతుంది. ఈ జట్టులో ఆడే వారిని అక్తార్, జి. వసంత్‌లు కోచ్ చేస్తారు. ఇంతదాకా బాగానే ఉంది. కాని ఏ ప్రాంతం నుంచి ఎన్నిక అయ్యే జూనియర్ ఆ ప్రాంతం నుంచి రు. 3000 చందాగా ఇవ్వాలి, అని ఆల్ ఇండియా లాన్ టెన్నిస్ ఎసోసియేషన్ అంటోంది. ఇది సబబుగా లేదు. ఈ ఎసోసియేషన్ దగ్గిర చాలా డబ్బు ఉంది. రాష్ట్రాల ఎసోసియేషన్ల వద్ద అంత ఉండదు. అదీకాక వారి కర్చులు వారికి ఉంటాయి— తరిఫీదు కార్యక్రమాలు, విదేశ క్రీడాకారులు వచ్చి ఆడినప్పుడు అయ్యే కర్చులు వగయిరా....

జూనియర్ల పర్యటన దుబారా కర్చు కింద రాదు. నేటి జూనియర్ ఆటగాళ్లే రేపటి సీనియర్‌లు అవుతారు.

ఇక ఆడకుండా 'పరిపాలకులు'గా పర్యటన చేసే వారి సంగతి ఏమిటి? మానేజర్లుగా, 'ఆడని కాప్టెన్'లుగా వెడతారే! (కొన్ని సంవత్సరాల క్రితం ఒక ఆటగాడి భార్య కూడా వెళ్లింది.)

ఈసారి మదరాసు తరఫున ఇద్దరు ఎన్నిక కావచ్చు. వారికి 6000 రూపాయలు ఎవరు భరిస్తారు? ఈ రాష్ట్రం ఎసోసియేషన్ అంత సంపన్నమయినది కాదుకదా?

*　　　　*

మదరాసు ఎమ్. సి. సి. టోర్నమెంటులో పి. ఎమ్. బాలసుబ్రమణ్యం సెమీఫయినల్సులో గవుర్ మిశ్రాని, ఫయినల్సులో విజయ్ అమృతరాజ్‌ని ఓడించి 'విన్నర్' అయ్యాడు. డబుల్స్‌లో ఆనంద్, విజయ్ అమృతరాజ్‌లు గెలిచారు—రవీ వెంకటేష్, గవుర్ మిశ్రాలని ఓడించారు. బొబ్బిలి 'కుమారి రాణి' ఆడవారి పోటీలో గెలిచారు.

—కె. ఎస్. నరసింహన్



# ది ట్రోల్      గార్త్ బొమ్మలకథ




—ప్రేమా.... ఈ వయస్సులోనా! వీడొక వెర్రి ముసలివాడనుకున్నావా ఏమిటి?

—ఎప్పుడు మాత్రం అనుకోలేదు ప్రొఫ్? నీకు మాత్రం తెలీదూ?

—కాని, మారియన్ ఫార్టెస్క్యూని ప్రేమించినందుకు కాదు..... బున్సెన్ బర్నర్ల కన్నా ఆమె నయం కదూ?

—ఆ! నీకూ ఆమె అంటే ఇష్టం అన్నమాట....

—త్వరలో ఆమెని నన్ను పెళ్లి చేసుకోమని అడగబోతున్నాను.....

—సవ్యంగానే ఉంది! ఈ ఇంట్లో నా సగం వాటాని పెళ్లి కానుకగా ఇస్తాను.....




—అబ్బే! అదేం కుదరదు... నువ్వు వెళ్లటానికి వీలు లేదు. మారియన్ నన్ను పెళ్లి చేసుకోటానికి ఇష్టపడినా ఇల్లు అందరికీ సరిపోతుందిలే!

—అదీకాక, ఆమె బాధ పడుతుంది.... నిన్ను తరిమేసి నట్లంటందనుకుంటుంది. .....

— ఫరవాలేదు. మరీ దగ్గరగా ఉండటంకన్నా దగ్గరగా ఉంటానంతే......

.... సరేకాని, కాస్త నిశ్శబ్దం! ఏదో బ్రహ్మాండమయిన విషయం కనిపెడుతున్నానేమో.....




(మారియన్ ఫార్టెస్క్యూ ఇంటి వద్ద విందు. చక్కటి వేసవి దినం.....)

— చంద్రాతో ఇంకొంచెం కోడికూర తీసుకు రమ్మని చెప్పనా గార్త్? ఎదిగే పిల్లాడివి బాగా తినద్దూ!

— సారీ [illegible]

—గార్త్.... ప్లీస్....

—ఆ! అంత రహస్య మేమీ కాదులే బెర్టీ..... చెప్తే తప్పేముందీ? నేను కొంచెం తికమక మనిషిని!

—ఎవరయినా ఉంటే ఏమీ తినలేను, గార్త్! ఒంటరిగా మాత్రమే తినగలను.... ఈ వింతని 'భూత వైద్యు'లెవరూ మార్చలేదు....

— నా ఆటోగ్రాఫ్ కావాలా?










(వెనుక తోటలో చిన్నవాగు. దానిలో చేపలు.....)

—బెర్టీ, అతను నిద్ర పోతున్నాడు.... భలే మోసగాడు!

—ష్! చేపలని చక్కిలి గింత పెట్టి పట్టు కోటం చూశావా ఎప్పుడయినా? కొంచెం మాట్లాడ కుండా ఉండు డియర్!

—అద్గదీ! ఇక మాట్లాడవచ్చు మారియన్! క్షమాపణ కోరుకుంటే చాలు.....

—ముసలిదానిలాగ వాగినందుకు క్షమాపణ చెప్పుకోనా ?

—ఎప్పటికీ జరగని పని! అయినా ఇది న్యాయం కాదు! చేపకన్నా నువ్వే పెద్ద!

—అన్యాయమే! తిరిగి నీటిలో పడేస్తాను.....!










— మాడమ్ అలిసి పోయుంటారు....?

— అవునా, అవును చంద్రా!

—సరే గుడ్‌బయ్ అనుకుందాము... కులాసాగా గడిచింది కదూ, మారియన్! రేపు టెలిఫోన్ చేస్తాను.

— అలాగే.... నేను చెప్పినదాన్ని గురించి ఆలో చించు బెర్టీ ....

(— 'అది' ఏమయియుంటుంది? అలిసట ఏమిటి? చాలా సరదాగా ఉంటేనూ, ఆ చంద్రావచ్చి కలగ చేసుకునేదాకా?)










—ఆ డ్రయివర్, బట్లర్ మనిషి వాలకం నాకేమి నచ్చలేదు ప్రొఫ్.... మారియన్‌ని ఆజ్ఞాపిస్తున్న ట్లుంటే వాకు!

— ఊం! అంటే, అతనికి మారియన్ పట్ల శ్రద్ధ ఎక్కువ, ఆమె ప్రాణం కాపాడాడని ఆమె కొంచెం ఊరుకుంటుంది.....

— ప్రాణమా? అదెలా?

— విమానం కూలింది. అప్పుడే ఆమె భర్త పోయాడు.... అదొక వింత కథ, కదిల్చేసే కథ....

(ఇంకా ఉంది)




మృగాంకదత్తునికి గుణాకరుడు అన కథ ఇలా వినిపించాడు:

దేవ, నాగశాపంతో ఆ దినం మనమంతా మూర్ఛపోయాము. తర్వాత కొంతసేకపటికి తేరుకున్నాను. మీరెవరూ కనిపించనేలేదు. వింధ్యాటవిలో తిరుగుతూ అలసిపోయి, వింధ్యవాసినీదేవి ఆలయం చేరుకున్నాను.

ఆలయం భయంకరంగా ఉంది. ఎక్కడచూచినా తెగిన దున్నపోతుల తలలు, వెంట్రుకలు, పేడ పడి అసహ్యంగా వుంది. ద్వారంలో వీరుల తెగిన తలలు దండలుగా వేలాడుతున్నాయి. కాకులు, గద్దలు తక్కిన పక్షులు ఎగురుతున్నాయి. దానిని చూడగా కాలుని క్రీడాంగణం వలె, రక్తం అంతటా పారుతున్నందున ఎర్రని రంగుతో మెరిసే సాయంకాలం మేఘంలాగ కనిపించింది. బలులు చంపి తెచ్చిన శవాలు కట్టెలుగా పడివున్నాయి. అవి మరణించడం వల్ల మిడిగుడ్లతో కాళరాత్రి బొమ్మడి వలె భయం గొలుపుతువున్నాయి. బలిచేయబడిన జంతువుల ఎముకల గుంపులు, మహామారి గుంపుల వికటాట్టహాసంలాగ ఎటుచూసినా తెల్లగా అగపడేట్టు చేస్తున్నాయి.

ఆ వింధ్యవాసిని దుర్గాదేవి మందిరం ప్రవేశించి వాతలను నరికివేసుకొని ఆత్మహత్య చేసుకుందామనుకుని కత్తి ఎత్తాను. నన్ను ఆ సమయంలో ఒకవృద్ధ తపస్విని చూచింది. ఆమె పూసుకున్న భస్మంలాగ మెడలో అక్షమాలిక తెల్లగా మెరుస్తూ వుంది. రాగమనే కలంకమయిన తనబుద్ధే సాకారంగా వచ్చిందా, అన్నట్టు వుంది. ఆమె, దయతో నన్ను ఆత్మహత్య ప్రయత్నం నుంచి మాన్పించింది, నా సుదీర్ఘ కథను శ్రద్ధతో విన్నది. నాకు ఇలా హితవు చెప్పింది.

'నాయనా, దుఃఖపడకు. తప్పక శుభాలు పొందుతావు. ధైర్యంముఖ్యం. ధైర్యం లేనివానికి చదువు, కులం, సిరి, ఏదీ శోభించదు. యుద్ధంలో దెబ్బతిన్న ఏనుగు మీది మదజల సిక్తమయిన డిండిమం శోభిస్తుందా? ఈ ప్రపంచం పెద్ద అడవి వంటిది. జనం అడవిలో తిరుగుతున్న తుమ్మెదలు వంటివారు. కనుక తిరుగుతూ తిరుగుతూ ఎప్పుడో కలుసుకుంటారు. ఒక ఉదంతం చెబుతాను విను:—

'పూర్వం పంచాల దేశంలో ఉదయతుంగుడనే రాజు వుండేవాడు. అతనికీర్తి చంద్రుడనే ఒకే ఒక తెల్ల గొడుగులాగ అయింది. అతనికి కమలాక్షుడనే ప్రతీహారుడు వుండేవాడు. అతడు రాజు సిరిని రక్షించే పరిఘాచలం. మంత్రులలో ఉత్తముడు. నయవిశారదుడు. అతనికి వినీతమతి అనే కుమారుడు ఉండేవాడు. అతడు తన పేరుకు తగినట్టివాడు. వంశముక్తామణివంటి అతని కాంతి కాంతలకు విభూషణ ప్రాయంగా వుండేది.

'అతడు ఒకసారి తన కీర్తివంటి తెల్లని చంద్ర కాంతితో వెలిగిపోయే రాత్రి నగర సమీపంలో ధనుర్ధారి అయి తిరుగుతూండగా, ఏడుపు వినిపించింది, అతడు అక్కడికి వెళ్ళాడు. ఒక చెట్టు కింద ఒక వనిత కూర్చొనివుంది. ఆమె కన్నులు కమలాలలాగ వున్నాయి, ఆమె ఏనుగులాగ పారవేసిన కమలవనం సిరిలాగ విషణ్ణురాలయి వుంది.

'ఆ వనితను వినీతమతి అడిగాడు, తన్వీ! నీ దుఃఖానికి కారణం ఏమిటి?— అని. ఆమె తన పలువరుస కాంతులతో వేయి వెన్నెలలు కల్పిస్తూ, ఇలా అన్నది: వీరుడా, నేను నాగేంద్రుని కుమార్తెను. నా పేరు విజయవతి. నా తండ్రి పేరు గంధమాలి. నా తండ్రి చేసిన లోపంవల్ల నాగరాజు వాసుకి నా

**తండ్రిని శపించాడు; కాలజిహ్వుడనే యక్షరాజుకు** పూవులు మోసే బానిసీడు అయిపోమ్మని.

'ఆ కాలజిహ్వుని సోదరుడు విద్యుజ్జిహ్వుడనే వాడు మహావీర్యవంతుడు. యక్షపతి ఏ కారణం వల్లనో అతనిని ప్రియురాలితోపాటు చక్రవాకపక్షివై పొమ్మని శపించాడు. కాలజిహ్వునికి తన సోదరుడు విద్యుజ్జిహ్వునిపై ప్రేమ ఎక్కువ. అందువల్ల అతడు ఆ సరోవరతీరంలోనే నివసించ సాగినాడు. నా తండ్రి అక్కడికి, పోతరించిన అతనికి పూవులు మోసుకొని పోయి సమర్పిస్తున్నాడు.

'ఈ బాధ చూడలేక నేను గౌరీదేవిని నియమంతో పూజించాను. ఆమె ప్రసన్నురాలై శాపాంతం ఇలా చెప్పింది. అమ్మాయీ, వినీతమతిఅనే ప్రతీహార పుత్రుడు ఆ యక్షుణ్ని జయించాడా, నీ తండ్రికి శాప విమోచనం అవుతుంది—అని. ఆ విజయం కోసం దేవి ఒక ఉత్తమమైన గుర్రాన్ని, శ్రేష్ఠమైన ఖడ్గాన్ని ప్రసాదించింది.'

వినీతమతి ఆ నాగకన్య కథ విన్నాడు. ఆమె నుంచి ఆ ఖడ్గం, గుర్రం స్వీకరించాడు. ఆమె చెప్పిన నులువులతో యుద్ధంలో కాలజిహ్వ యక్షుణ్ని గెలిచాడు. ఆ యక్షుణ్ని చంపివేసేవాడే, కాని, దయదలచి ప్రాణాలతో వదిలి పెట్టాడు. దానికి యక్షుడు కృతజ్ఞుడై ఈతి బాధలు తొలగించే ఒక రత్నాల ఉంగరాన్ని వినీతమతికి సమర్పించుకొన్నాడు.

గంధమాలి శాప విముక్తి పొంది, తన కుమార్తె విజయవతిని వినీతమతికి ఇచ్చివేశాడు. భార్యతో పాటు తన యిల్లు చేరుకున్నాడు. ఉదయం కాగానే, రాజు అనుమతి, తండ్రి అనుమతి పొంది, ఆమెను వివాహం చేసుకొన్నాడు వినీతమతి.

ఉదయతుంగ మహారాజుకు ఒక కుమార్తె వుంది. ఆమె సకల విద్యా కోవిదురాలు. ఆమె పేరు ఉదయవతి. 'ఎవరు నన్ను విద్యలలో, వాదంలో జయిస్తాడో అతన్ని చేపడుతాను' అని గర్వంతో ప్రతిజ్ఞ చేసింది. ఆమెతో వాదానికి అసంఖ్యాకంగా వాదిగణం వచ్చి, ఆమెతో వాదించి పరాస్తమై పోయేది. వినీతమతి తండ్రి ఆజ్ఞతో ఆమెతో దీర్ఘవాదం చేసి, ఆమెను జయించాడు. మహారాజు కుమార్తె మాట ప్రకారం ఆమెను వినీతమతి కిచ్చి పెళ్లి చేశాడు. ఆడలేడి పిల్ల కన్నుల వంటి లోల లలిత ఆయత లోచనాలు గల ఉదయవతిని వినీతమతి, స్మరనరేంద్రుని యువ్వరాజ్యం లాగ పొందాడు.

ఒకమారు వినీతమతి జూదం ఆడుతూ, దానిలో నిమగ్నుడై వున్నాడు. అప్పుడొక బ్రాహ్మణుడు వచ్చి తనకు భోజనం పెట్టించమని కోరాడు. వినీతమతి తన బానిసతో, 'ఈ బ్రాహ్మణునికి భోజనం పెట్టించు' అని వుత్తరువు చేశాడు. ఆ బానిసీడు ఆ బ్రాహ్మణునికి ఒక పాత్ర నిండ ఇసుక నింపి, గుడ్డ కప్పి, ఇచ్చాడు. అహా! నృపచేటకులు వేప విత్తులాగ చేదయిన వారు సుమా!

కొంత కాలానికి రాజు వృద్ధుడయాడు. పుత్రులు లేనందున తన కుమార్తె భర్త అయిన వినీతమతికే పట్టం కట్టి, తలమీద గుగ్గిలం ముట్టించుకొని ఉత్తమ గతి పొందాడు. వినీతమతి విశాలమయిన **రాజ్యం పొంది, ధర్మ విధితో, విబుధులను అరాధిస్తూ, ప్రజారంజకుడుగా పాలించాడు.**

ఒకమారు వినీతమతి ఆస్థానానికి ఒక బౌద్ధ భిక్షువు వచ్చాడు. అతడు గొప్ప తెలివి గలవాడు. వాదులనే ఏనుగులను చెండాడే సింహం వంటివాడు. పేరు రత్నచంద్రమతి. అతడు వినీతమతితో ఒక నియమంపై వాదం ఏర్పాటు చేసుకొన్నాడు—ఓడిపోతే బౌద్ధమతం స్వీకరించాలి— అని.

వినీతమతి పద్దెనిమిది దినాలు అతనితో వాదించి చివరకు ఓడిపోయాడు. పందెం ప్రకారం అతని నుంచి బౌద్ధమత దీక్ష స్వీకరించాడు. సంపదకు మనోహర పుణ్యఫలమయిన విహారం నిర్మించాడు. అక్కడ లోకనాథ సుగతుణ్ని ప్రతిష్ఠించాడు. భిక్షు సంఘాలు అనేకం ఆ విహారంలో విహరించాయి.

రత్న చంద్రమతి మాటమీద అతడు ఇతరులకు సౌగత మతోపదేశం చేయాలనే తలంపుతో విధి పూర్వకంగా స్వప్నసాధనయోగం ఆచరించాడు.

ఒకమారు అతనికి ఒక స్వప్నం వచ్చింది. దానిలో మండుతున్న ఒక ఇసుక దిబ్బ కనిపించింది. అది ప్రేత భూమిలో వుంది. భయంకరులయిన దండధరులు అతనితో 'ఈ ఇసుక తిను' అని ఆజ్ఞాపించినట్లు విన్నాడు. 'రాజా నీవు ఒకప్పుడు జూదమాడుతూ, ఆకలిగొన్న బ్రాహ్మణునికి ఇసుక నింపిన పాత్ర దాన మిచ్చావు, దాని ఫల సంచయమే ఈ ఇసుక దిబ్బ. దీనికి నిష్కృతి యేమంటే, పది కోట్ల బంగారు నాణేలు దానమిస్తే, ఆ పాపం పోతుంది' అని దండధరు లన్నారు.

రాజుకు మెలకువ వచ్చింది. ఉదయం స్వప్న వృత్తాంతం గురువుకు విన్నవించాడు. ఆయన ఆదేశం ప్రకారం పదికోట్ల బంగారు నాణేలు దాన మిచ్చాడు. మళ్లీ స్వప్న సాధనం చేశాడు. మళ్లీ ఆ స్వప్నమే వచ్చింది. భయంతో అతని గుండె అదరిపోయింది. 'రాజా నీ దానం పుచ్చుకొన్న ఒక బ్రాహ్మణునిదొంగలు కొట్టి బంగారు దోచుకొన్నారు. నీవు వారికి రక్షణ ఇవ్వలేదు. అందువల్ల నీ దానం నిష్ఫల మయింది. కనుక మరి పదికోట్ల బంగారు నాణేలు దానం చేయి' అని దండపాణులు అన్నారు. వినీతమతి అలాగే చేసి, పాపం పోగొట్టుకొన్నాడు.

తర్వాత భిక్షువు రత్న చంద్రమతి రాజుకు బుద్ధుని వివిధ జన్మ కథలను చెప్పాడు. 'నరేంద్ర దాన మనేది వీరులకు వుత్సాహం కలిగించేది. సత్పురుషులకు నిర్ధకరం. ఒక గాథ చెబుతాను విను:—

'కృపానిధి అయిన బోధిసత్త్వుడు ఒకానొక జన్మలో వరాహమయి పుట్టాడు. ఒక సింహ మప్పుడు ఆకలి గొని వచ్చింది. అది బోధిసత్త్వుని దానశీలాన్ని పరీక్షించడానికి వచ్చిన ధర్మం. బోధిసత్త్వుడు తనను దానికి ఆహారంగా సమర్పించుకొన్నాడు. మహారాజా, ఈ ప్రాణాలు విలాసంగా వీచే గాలికి ఎగిరిపడే నీటి తరంగాలలాగ చంచల మయినవి. ప్రేమగలవారి ప్రాణాలను ఇలాటి ప్రాణాలతో రక్షించడమనేది పుణ్యవంతులకే దక్కుతుంది.'

ఇలాటి బౌద్ధ సంబంధమయిన కథలు విని వినీతమతి ఆర్యులకు జంగమ కల్పవృక్షం వంటి వాడయ్యాడు.

ఒకమారు ఆ దానశీలుని వద్దకు ఒక బ్రాహ్మణుడు వచ్చి ఈతి బాధానివారణమయిన రత్నాంగుళీయకం దాన మడిగాడు. **వినీతమతి సత్త్వవంతుడు. రత్నాలు కోరేవారికి సంపూర్ణంచరితాముడు.** అతడు తన రత్నాంగుళీయాన్ని ఆ యాచకునికి ఇచ్చి వేశాడు. తర్వాత ఒకరాజ పుత్రుడు వచ్చి తన వంశ శత్రువులను జయించడానికి గౌరీదత్తమయిన ఖడ్గం, గుర్రం ఇమ్మని కోరాడు. వినీతమతి వాటినీ దానం చేశాడు. ఆ ఖడ్గాశ్వాలతో ఆ రాజపుత్రుడు తన శత్రువు రాజ్యం జయించాడు. రాజ్యం కోల్పోయిన రాజు వినీతమతి వద్దకు వచ్చి, 'రాజా, నీ ఖడ్గంవల్లనే నా రాజ్యం కోల్పోయాను.' అన్నాడు. కరుణాసింధువయిన వినీతమతి వాడికి తన రాజ్యం ఇచ్చివేశాడు.

రాజ్యంలేని వినీతమతి భార్యతోపాటు బయలుదేరి ఒక ఘోరమైన అడవి చేరాడు. ఆ అడవి అతని పుణ్యావృతల వల నందనవనంలాగ అయింది.

ఒకనాడు వినీతమతి అడవిలో తిరుగుతుండగా, చావడానికి ప్రయత్నిస్తున్న ఒక యువకుడు కనిపించాడు. వెంటనే వినీతమతి వాడివద్దకుపోయి, అతని ప్రయత్నం మాన్పించి, మరణించదలచుకొనడానికి కారణ మేమిటని ప్రశ్నించాడు. ఆ యువకుడు ఇలా చెప్పాడు:—

''నాపేరు సోమక్రముడు. నా తండ్రిపేరు నాగశూరుడు. నేను పుట్టగానే యోగులు నేను దొంగను అవుతానని నా తండ్రికి చెప్పారట. నా తండ్రి నన్ను దొంగగా కాక గొప్పవాడిని చేద్దామని, వాత్సల్యంతో నన్ను గొప్ప విద్యావంతునిగా చేశాడు. విద్యమానవులకు సమోహాతిమిరం పోగొట్టడానికి సహజమైన దీపం.

'అయినా నేను దుష్టుల సహవాసంతో దొంగనయాను. లలాట పట్టంపై వ్రాసిన వ్రాతను ఎవరు మార్చగలరు? నా సంగతి రాజుకు తెలిసింది. తక్షణం నన్ను బంధించాడు. కాని, అకస్మాత్తుగా ఒక ఏనుగు మదమెక్కి నగరంలో విచ్చలవిడిగా తిరుగసాగింది. ఆ కోలాహలంలో నేను తప్పించుకొన్నాను. ఆ కోలాహలంలో జనం చిందరవందరగా పరుగెత్తారు. ఆ కోలాహలం నుంచి బైటపడగా, నా తలిదండ్రులు నా దుఃఖంతో మరణించారని విన్నాను. నేను కూడా తలిదండ్రుల మరణ దుఃఖంతో చావడం మేలని ఇక్కడికి వచ్చాను. వనలక్ష్మి నన్ను చూచి దయతో 'పుత్రా, వినీతమతి మహారాజు నివాసం వల్ల పుణ్యవంతమయింది. ఈ అడవి. నీవు ఇక్కడికి రావడంతో నీ పాపాలు క్షీణించాయి. అందువల్ల వెళ్లు. ఆయన వద్ద పాన మితలు విను.' అన్నది. నీవు నాకు దర్శన మిచ్చావు. ఆమె చెప్పిన రాజర్షివి నీవే. అందువల్ల, భగవాన్, నాకు నమ్మికే పారమితను తెలుపు.'

వినీతమతి ఆ యువకుని వృత్తాంతం విన్నాడు. కృపాసింధువు. అతనిని తన ఆశ్రమానికి పిలుచుకొని పోయాడు. అక్కడ జ్ఞానలోచనంతో సకలం చూచిన ఆ రాజర్షి ఇలా అన్నాడు.

'పుత్రా, ప్రాణులకు తత్త్వ విచారమే సన్మార్గ దర్శకము. కాని, ఆ తత్త్వ విచారం మోహాగావృతులయిన మానవులకు స్ఫురించదు. దీనికొక దృష్టాంతం చెబుతాను.

'పూర్వం పాంచాల దేశంలో దేవభూతి అనే బ్రాహ్మణుడు వుండేవాడు. అతని భార్యపేరు **భోగదత్త. ఆమె, చాల ధర్మపరాయణ. ఒకనాడు**

## ...[illegible]

ఆమె భర్త స్నానానికి వెళ్ళాడు. కూరలు తీసికొని వద్దామని తోటకు వెళ్ళింది. ఒక చాకలి తమ కూరగాయల తోటలోకి తన గాడిదను తోలి మేపుతూ వుండడం చూచింది. ఆమె ఆ గాడిదను ఒక దుడ్డు కర్ర తీసుకొని, అదలించింది. ఆ గాడిద బెదిరిపోయి, పరిగెత్తిపోయి, ఒక గుంటలో పడింది దానితో దాని కాలు ఫెటీమని విరిగింది.

'చాకలి, తన గాడిద కాలు విరిగి కుంటిదికావడం చూచాడు. కోపంతో ఆమెను పిడికిలితో గుద్ది, దుడ్డుకర్రతో బాదాడు. ఆమె గర్భిణి. ఆ దెబ్బలకు ఆమె గర్భంలోని పిండం పగిలి రక్తంతోపాటు కిందపడింది.

'బ్రాహ్మణుడు స్నానం చేసి తిరిగి వచ్చాడు రజకుని దుండగం చూచాడు. నగరాధిపతి వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నాడు. అతడు చాకలిని పిలిపించాడు. ఇద్దరూ తమ తమ జల్పం (వాఙ్మూలాలు) ఇచ్చారు. అవి విని నగరాధీశుడు చాలసేపు ఆలోచించి ఇలా తీర్పు చెప్పాడు:— బ్రాహ్మణి ఏమో గాడిద కాలు విరుగ గొట్టింది. రజకుడు ఆమెకు గర్భస్రావం కలిగేట్లు చేశాడు. అందువల్ల న్యాయమేమిటంటే, గాడిద కాలు బాగయ్యేవరకు బ్రాహ్మణుడు చాకలి గుడ్డలు మోయాలి. బ్రాహ్మణికి చాకలి గర్భం కలిగించాలి.

నగరాధిపతి న్యాయం వినగానే బ్రాహ్మణుడు భార్యతో సహా విషం తాగి ప్రాణాలు వదిలాడు. ఈ వార్త రాజుకు తెలిసింది. రాజు ఆ బుద్ధిలేని నగరాధీశుణ్ణి బంధించి శిక్షించాడు.

"కుమారా, ఈవిధంగా దుర్వినీతులు సమున్నత మార్గంలోను గోతిలో పడుతారు. అందువల్ల తత్వ విచార దృష్టితో పారమితా కథను విను. దాని వల్ల బుద్ధి నిర్మల మవుతుంది. సంసార వాసనలు తొలగుతాయి. మరొక గాథ చెబుతాను విను.

"పూర్వం కురుక్షేత్రంలో మలయ ప్రభుడనే రాజు వుండేవాడు. అతనికి ఇందు ప్రభుడనే కుమారుడు వుండేవాడు. అతడు త్యాగానికి సముద్రం వంటివాడు. ఒకమారు అతని రాజ్యంలో కరువు ఏర్పడింది. అతడు తన తపస్సుతోను, సత్య గుణంతోను ఇంద్రుణ్ణి సంతోషపెట్టాడు. ఇంద్రుడు సంతోషించి వరము కోరుకోమన్నాడు. రాజకుమారుడు తాను కల్పవృక్షమై ప్రజల కష్టాలు తీర్చాలని కోరుకొన్నాడు. ఇంద్రుని వరంవల్ల అతడు కల్పవృక్షమై, సకలాశలను పూరించేవాడయాడు. చివరకు అతని మాహాత్మ్యం వల్ల కురుక్షేత్ర నివాసులందరూ బొందెతో స్వర్గానికి వెళ్ళారు. ఆ కల్పవృక్షం అన్ని సిద్ధులకూ కారణమయింది. కల్పవృక్షంగా మారి చిరకాలం దానంచేసిన ఆ దానశీలుని కీర్తి పతాకే సుమా ఈ ఆకాశగంగ.

'దానమనేది తాపాలను పోగొట్టే అమృత మేఘం. అజ్ఞాన తిమిరాన్ని పోగొట్టే సూర్యుని వంటిది. ఈ ప్రపంచంలో శుభసంపదలకు నిదానం."

(ఇంకా ఉంది)

# జి-11 గల సింథాల్
# యిప్పుడు
# ఎక్కువ సువాసన
# సమృద్ధియైన నురుగును యిస్తుంది.




## మీకు లాభసాటిగా ఉండేలా
## రెండు సైజులలో లభిస్తోంది

ఈ క్రొత్త, మధ్య రకపు సింథాల్
మీకు కొనగలిగే ధరలో లభిస్తోంది.
ఈ సబ్బులో ఒక ధర తప్ప
తక్కినవన్నీ ఎక్కువే.
ఎక్కువ సువాసన—ఆహ్లాద
కరముగా చాల సేపు నిలిచి ఉంటుంది.
ఎక్కువ నురుగు—మృదువుగా,
సమృద్ధిగా ఉంటుంది.
ఒక్క సింథాల్ లోనే గల,
పోటిలేని జి-11 మిమ్మల్ని
రోజంతా హాయిగా ఉంచుతుంది.



CINTHOL

INTERPUB/CS/16A TEL




## సింహాల గుహలో బాలుని శవం

గోహతిలో ఒక జంతు ప్రదర్శనశాలలో సింహాల గుహలో ఒక బాలుని శవం దొరికిందట ఆఫ్రికా సింహం, ఇండియా సింహం కలిసి అల్పాహారం చేస్తున్న ఆ శవాన్ని చూసి అధికారులు "ఇదేమిటి" అనాశ్చర్యపోయి, వాటిని గుహలోకి తరిమి, ఆ శవాన్ని బయటకు తీశారట అది ఒక 13 సంవత్సరాల బాలుని శవం (పదవ తేదీన యీ శవం దొరికింది) 8 వ తేదీ శనివారం యిల్లు వదలి వెళ్ళిన అతని జాడ తెలియలేదట ఏదో గృహ సంబంధమైన గొడవలలో మనస్సు విరిగి, తనే ఆత్మహత్య యీ విధంగా చేసుకుని వుంటాడని అనుకుంటున్నారు.

## పట్టరాని ఆగ్రహం?

ఉత్తర ఘాకాకు చెందిన జమాల్‌పూర్ ప్రాంతంలో పట్టరాని కోపంతో కొంతమంది ఒక వ్యక్తిని సజీవంగా తగులబెట్టి, మరో వ్యక్తిని చెట్టుకు మేకులు వేసి కొట్టేశారట ఈ భయంకర దౌర్జన్యానికి కారణం మాత్రం తెలియలేదు

## పలుకుబడి పెంచటానికి!

టాకసాకి (జపాన్)లో ఒక వ్యక్తి తన తోటలో పని చేసుకుంటూ దూరాన్నున్న ఒక స్కూలుకు నిప్పంటుకుందని అరిచి, గమ్మున కొంతపరివారంతో వెళ్ళాడట. అయితే ఆనక పోలీసులు అతన్ని కైదు చేసి, స్కూలుకు 'నువ్వే నిప్పెట్టావు' అన్నారట. అతని తోటలోంచి స్కూలుకు నిప్పంటుకుని వుండడాన్ని చూడడం కష్టమని, అసాధ్యమనీ వాదించేసరికి అతను భయపడి నిజం ఒప్పుకొని, వూళ్ళో తన పరువు అంగుళన్నర మందాన్ని పెరగడానికి అలా చేశానని చెప్పేశాడట ఓరి అసాధ్యుడా!




## కాలేజీ అమ్మాయి హత్య

తన స్నేహితురాలితో రిక్షాలో కాలేజీకి వెళుతున్న అభిలాష కుమారి అనే ఆమెను ఒక కాబూలీ కుర్రాడు పొడిచి చంపేశాడట, పట్టపగలు నట్టనడివీధిలో. ఆమె ఎక్కి వెళుతున్న రిక్షాను సైకిలుతో వెంబడించి, సైకిలు రిక్షాను ఢీకొని, కత్తితో ఆమె గుండెలో ఒక పోటు, వెన్నులో ఒక పోటు, తొడలో ఒక పోటు పొడిచి పారిపోతుండగా నలుగురు పోలీసులు పట్టుకున్నారట. ఇతనూ, ఆమె పక్క పక్కింటివారట. తనామెను ఆ విధంగా పొడిచి చంపడానికి కారణం ఆమె తండ్రి ఎదురుగానే చెప్తాననీ, వినాలనుంటే ఆమె తండ్రిని తీసుకు రావలసినదనీ అన్నాడట ఆ ఇరవై రెండేళ్ళ కాబూలీ కుర్రాడు. ఇది పాట్నాలో జరిగింది.

* * *

ధర్మపురంజిల్లాలోని నాగణంపట్టి అనే వూరునకు చెందిన వెంకటన్ అనే అతను తన భార్య అలిమేలుకు భరణం యివ్వవలసి వచ్చిన కారణంగా చంపేశాడట వెంకటన్ తన భార్యకు విడాకులిచ్చి వేరే పెళ్ళి చేసుకున్నందువల్ల ఆమె భరణం కోసం దావా వేసి గెలిచిందట. కోర్టువారు ఆమెకు నెలకు పది హేను రూపాయలిమ్మన్నారట. వెంకటన్ అంతలో వూరుకోక, తన భార్య శీలంమీద తనకు అపనమ్మకమని కోర్టులో మళ్ళీ దావావేసి ఓడి పోయాడట. కోర్టు నుంచి ఎవరి వూరుకు వారు బయలు దేరారట. కారకోట్టఅళ్ళిలో దిగి, నాగణంపట్టికి నడక ప్రారంభించిన ఆమెను కత్తితో పొడిచి అతి దారుణంగా చంపేశాడట అతను.

## గజదొంగని పట్టించిన కోడి

ఢిల్లీలో హరిశంకర్ అనే మహాపురుషుడు డిసెంబరునుంచి, మార్చి పదో తేదీ దాకా 21 దొంగతనాలు చేశాడట. ఏడుగురు 'ఎం. పి.'ల యిళ్ళల్లో, నలుగురు ఆర్మీ జనరళ్ళ యిళ్ళల్లో, ఆటార్నీ జనరల్ ఆఫ్ ఇండియా యింట్లో, ముగ్గురు వ్యాపార సంస్థాధిపతుల యిళ్ళల్లో, ముగ్గురు ప్రభుత్వవున్నతోద్యోగుల యిళ్ళల్లో ఒక కాన్వెంటులో—యిలా అనీ పెద్దపెద్ద చోట్లే దొంగతనాలు చేశాడట. మార్చి 10వ తేదీన కానింగు సందులో వున్న ఒక జర్నలిష్టు యింటిని దోచి, ఓ పార్కులో ఆ ధనం గుట్టా దాచి, తనూ ఓ పొదవెనకాల దాక్కున్నాడట తెలతెలవారుతుండగా బీటు పోలీసులూ వగైరాలు పోతారనీ, ఆనక సురక్షితంగా తానూ పోవచ్చనీ ఆలోచించి కూర్చున్నాడట అయితే తన చేతికి వాచీ లేకపోయినందువల్ల కోడికూతను ఆధారం చేసుకుని, "కుక్కొక్కో"అని గొంతు చిరిగేలా అరిచిన కోడికూత విని, చెంగున రోడ్డుమీదకు వచ్చాడట. కోడికూత లెక్క ప్రకారం తెల్లవారనందున, బీటు పోలీసులు అతన్ని ఠక్కున పట్టేసుకున్నారట. ఇంత పెద్దదొంగని పట్టిచ్చిన ఆ కోడిని ప్రభుత్వం తప్పక సత్కరించాలి ఎలా? ఏవుంది ఓ బిరుదిస్తే సరి.

* * *

విజయనగరంలో ఓ డెబ్బయ్యేళ్ళ వృద్ధురాలు చనిపోయిందట ఈమె ముష్టి ఎత్తుకుని బతికి నన్నాళ్ళూ జీవితం గడిపిందట ఈమె యిల్లు సోదా చేస్తే కొన్ని కర్ర పెట్టెలలో కొన్ని వందల చిన్న సంచులున్నాయట విప్పి చూస్తే వాటినిండా వెండి, బంగారు నాణేములు, కరెన్సీనోటు, చిల్లర డబ్బులూ వున్నాయట. లెక్క చూస్తే 23 వేల వరకూ తేలిందట పాపం అంత ధనం ఎందుకు కూడాపెట్టిందో చెప్పకుండానే పోయింది ఆ వృద్ధురాలు.



# నీటిలోని మహత్తు

యుగోస్లావియాకి చెందిన బాస్నిలనే చోట ఒక ప్రవాహంలో నీరు తాగితే మనిషికి వీర్యశక్తి అధికమవుతుందనీ, ఆ నీటిలో ఆరకం టానిక్కులవంటివున్నాయనీ, హో డాక్టరు కనిపెట్టేసరి? ఆ ప్రవాహానికి ఎక్కడలేని రాచమర్యాదలూ వచ్చాయిట నీరు దొంగతనం జరగకుండా సాయుధ పోలీసులను గస్తీ పెట్టారట రోజుకు 40 లక్షల సీసాలలో నీరు నింపి అమ్ముతున్నారట అన్నైన సీసాలు చేసే కంపెనీకి శక్తి లేకపోవడం వల్ల అమ్మకం ఆగిపోతోందట ఈ నీరు వెస్ట్ జర్మనీ, ఇంగ్లండ్, యునైటెడ్‌స్టేట్స్, ఫ్రాన్సువంటి దేశాలు ఎగబడి దిగుమతి చేసుకుంటున్నాయట ఈ చిట్టాలో ఇండియా లేదు కాక పోయినా మనకెందుకది! మనకు లేనివికదా ఆడగాలి!!

* * *

55 ఏళ్ళ రాన్‌బ్రాడ్లీ అనే ఆయన పడకగదిలో తన భార్యను ముద్దు పెట్టుకునేసరికి గప్పున షాకు కొట్టిందట ఆ మంచం మీద కూర్చుని అనేకసారు ప్రయత్నించి చూస్తే, ముద్దు పెట్టుకున్నప్పుడలా షాకు కొటి ందట తన పెదిమలు భార్య బుగ్గలను రాసేలోపుగానే షాకు కొడుతోంది మొర్రో అని గోల పెట్టేసరికి ఆ మంచాన్ని పరీక్ష చేశారట పక్కమీద వేసిన నైలాను దుప్పటిలోంచి కరెంటు పుట్టిందని, రెండు శరీరాలూ కలిసినపుడలా ఎర్తు అయ్యి షాకు తగులుతోందనీ కనిపెట్టి, ఆ దుప్పటీ ఏయనైనా తీయాలని, లేకపోతే అతను రబ్బరు చెప్పులు తొడుక్కొనైనా తొడుక్కోవాలని, లేకపోతే ముద్దు పెట్టుకోడం కుదరదనీ తేల్చారు పాపం బహు కష్టం.




Lashmi

రేడియో వంటివి పెట్టుకుని నిద్రపోవడం ఆరోగ్యకరమైన పద్ధతి కాదని, కెనడాలో యీ విషయం మీద శాస్త్రవేత్తలు పరిశోధనలు జరిపి తేల్చారు పక్కన రేడియో పెట్టుకుని నిద్రపోతే గాఢ నిద్ర కాస్తా, మగత నిద్రగా మారిపోతుందనీ మగత నిద్ర శరీరానికి మంచిది కాదనీ, రేడియో శబ్దం వల్ల నిద్రలో కలలు రావని, మానవుని నిద్ర కాలంలో మూడోవంతు కలలకు కేటాయింపబడిందనీ, రేడియో శబ్దం వల్ల యీ కలలు రావనీ, దాని వల్ల మనిషికి నరాల బలహీనత ఏర్పడుతుందనీ వారన్నారట విన్నారా! స్విచ్ యువర్ ట్రాన్సిస్టర్స్

* * *

భువనేశ్వర్‌లోని పాతకి ఒక ప్రాచీన సాంప్రదాయంగా వస్తున్న నమ్మక వుంది మరీచికుండం లోంచి వచ్చిన నీరుతాగిన గొడ్డుమోతు ఆడవారికి (వారి కొక్కరికే కాదు) సంతాన ప్రాప్తి కలుగుతుందని అక్కడివారికో నమ్మిక వుంది. మొన్న అశోకాష్టమి నాడు తెల్లవారు ఝూమున ఆ కుండంలోంచి తీసిన నీరు వేలంవేస్తే మూడు వేలు వచ్చాయట

* * *

గోహతికి చెందిన టియోకలో 70 ఏళ్ళ వృద్ధుడు నిద్రపోతున్న తన భార్యని పొడిచి చంపేసి, యిద్దరు మనవలనూ గాయపరచాడట సమయానికి లేచి, రంగంలోకి వచ్చిన అతని కొడుకు యీ అఘాయిత్యాలింకా మీరకుండా ఆపాడుట అసలింతకూ యీ ఘాతుకమెందుకు చేయాల్సి వచ్చిందో మాత్రం తెలియనేలేదు.

* * *

పంజాబుకు చెందిన బాటెండా అనే గ్రామంలో సంత్ ఇందర్‌సింగ్ అనే అతను తను కేవలం భగవంతుణ్ణి అని కనబడిన వారందరికీ నచ్చచెప్ప నారంభించారట తను భగవంతుణ్ణనీ, గురుగోవింద్‌సింగ్ బోధనలు ప్రచారం చేయడానికే అవతార మెత్తాననీ చెప్తే గురుదేవ్‌సింగ్ అనే అతను నమ్మలేదని, అతన్ని పొడిచి చంపేశాడట ఇది 1968 ఏప్రియల్ 15న జరిగింది ఈ భగవంతుడికి మొన్న మరణ శిక్ష విధించింది చట్టం—భేష్!

* * *

లండన్‌లో మూడు మునిసిపల్ లాండ్రీలు మూసివేశారన్న కోపంతో మహిళలు తమ మాసిపోయిన బట్టలన్నీ తీసుకువెళ్ళి కౌన్సిలు మీటింగు హాలుకు వెళ్ళి—వారిమీద పడేసి, 'అయితే మా బట్టలిక నుంచి మీరే వుతకండి, యస్' అన్నారట.








**కె. ఎస్. పి, గుడిపాడు**

ఏమండీ మనిషన్న తరువాత ప్రతివానికి కొన్ని లక్ష్యాలుంటాయి—అంటారు. నాకు ఒక్క కోరిక కూడా లేదు. కారణం?

ఏమో మరి! అయినా లక్ష్యాలు వేరు. కోరికలు వేరు

**బి. ఎల్, విశాఖ**

ఈ కాలంలో స్త్రీ గౌరవం పెరిగిందా? తరిగిందా?

పబ్లిక్కుగా తరిగినట్లూ, వ్యక్తిగతంగా పెరిగినట్లూ అనిపిస్తూంది.

ఆడవాళ్ల చదువువలన దేశం పాడైందని కొందరు పెద్దలంటున్నారు. అది ఎంత వరకు సమంజసం?

ఆ పెద్దల కొంపలు పాడై ఉంటాయి అలాంటి వాళ్లే వ్యక్తిగత నష్టానికి సాంఘిక విలువ కట్టి యిలాంటి స్టేట్‌మెంట్సు పారేస్తూ ఉంటారు

**పి. పి. కె, విజయవాడ**

రామలక్ష్మిగారూ నేనంటే ఎందుకు మీకింత కోపం, ఎన్ని ఉత్తరాలు రాసినా జవాబివ్వడంలేదు చివరికి నామీద నాకే కోపం వస్తూంది మరి

తప్పు తప్పు తన కోపమే తన శత్రువు అన్న మాట వినలేదా ప్రేమా?

**టి. బి, కొత్తవలస**

అక్కయ్యా నేనిప్పుడు తొమ్మిదో క్లాసు చదువుతున్నాను. నాకు డాక్టరు చదవాలని ఉంది చదవ గలనా?

ఎందుకు చదవలేవు తమ్ముడూ, ఉత్సాహానికి తోడు కృషి కూడా చేశావంటే ఒక్కొక్క మెట్టే ఇట్టే ఎక్కేస్తావు ఎటొచ్చీ ఈ ముందు మెట్టు మంచి పోతేనే చిక్కు. తీగల వారింటి వాడివి నీకు వెనక దన్నుకి లోటుండదు బాగా చదువు.

**బి. వి. ఆర్. సిని, బీహారు**

ఒంటరి ఆడుది, అందులోనూ జవ్వని కన్పిస్తే పురుషుడు తుంటరి అవుతాడెందుకు?

మునలియైనా పురుషుడు అంటారనుకున్నాను. ఆ కనబడిన ఆడది కూడా తుంటరి అయితే యిబ్బంది లేదు గాని లేకుంటేనే ప్రమాదం. పురుషుడు స్త్రీని 'ఒక్క ఆడదాని' కిందే ఎప్పుడూ చూడ్డం వల్ల ఏర్పడే చిక్కులివి ప్రసాదరావుగారూ, వ్యక్తిగా ఆమెని చూడకల్గితే యిలాంటి తలపులు అస్తమానూ రావు!

**ఎ. వి. ఆర్. పి, గుంతకల్లు**

రామలక్ష్మిగారూ లావు కనబడకుండా వుండడానికి మార్గమేమిటి?

ఉన్న తెలివీ, ఉన్న లావూ బయటపడక మానవు చిట్టితల్లీ! అయినా, పెద్ద ప్రింట్లూ, అడ్డబారలు, మరీ నడుము పొట్టి రవికలు క్లోజు నెక్కులు, పొడుగు లోలకులు, ఛోకర్లూ, బిగువుగా చేతికి నిండుగా గాజులు మొదలుగా గలవి చేయకుండా ఉంటే గుడ్డిలో మెల్ల.

నాకు తెలుసున్న ఒకామె ఆపరేషను చేయించుకుంది. అయితే మళ్లీ గర్భవతి అయింది. భర్త అనుమానానికి అవకాశం ఏర్పడింది. కిం కర్తవ్యం?

అది శస్త్రచికిత్స చేసిన వైద్యుల లోపం గాని యిల్లాలి లోపం కాదు ఆమాత్రం గ్రహించ లేడా భర్తగారు? ఇటువంటి విషయాలలో కొన్ని వందల విజయాలు కూడా ఒక్క పరాజయములో తిరుగుముఖం పడతాయి. కుటుంబ నియంత్రణాధికారుల వ్యయప్రయాసలు వృధా అవుతాయి ఆపరేషనులు చేయించుకొందుకు విజయవంతమైన వాటిని దాఖలాగా తీసుకొని అందరూ కుటుంబనియంత్రణ వర్ధనడానికీ పరాజయం పొందిన ఒకటీ అరా దాఖలాగా ఉపయోగిస్తూండడం తెలివితక్కువ తనమే అనుకోవాలి.

**కె. ఎస్. ఎన్, లింగన్నపేట**

పూర్వకాలంలో సంతానం కొరకు వ్రతాలు, పూజలు, తీర్థయాత్రలు మొదలగునవి చేసెడి వారుకదా, మరిప్పటి కలియుగంలో ఇంతటి మార్పెలా వచ్చింది?

పూర్వయుగాల వ్రతాలుపూజలు తీర్థయాత్రలూ ఫలించాయి కాబోలు సత్యనారాయణ గారూ, యీ కలియుగంలో!

**వి. ఎస్, శృంగవరపు కోట**

నేను అందరికంటె పొట్టిగా ఉంటానని అందరూ ఏడిపిస్తున్నారు ఏం చేయాలి?

మరేం ఫరవాలేదు ఉడుక్కోకు శారదా చెప్ప పొట్టి వాళ్లకి పుట్టెడు బుద్ధులని. కస్తూరిబ పొట్టి, లాల్‌బహదూర్ శాస్త్రి పొట్టి. నెపోలియన్ పొట్టి. సిస్టర్ నివేదితా పొట్టి.

**పి. ఉమ, భిలాయి**

రాజమండ్రీ దగ్గర సీతానగరంలో ఒక స్కూలుందిట.

అవును. చాలా ట్రైనింగులున్నాయి అక్కడ. కరస్పాండెంట్, సీతానగరం రాజమండ్రి, తూ.గో.జి. అని వ్రాయండి వివరాలు పంపుతారు.

**ఎస్. ఆర్. కె, కోట కొమ్మాళి**

గాలిలో ఎగిరే గాలిపటానికి ఒక్క దారము ఆధారమని భావిస్తుంది కాని విలువైన గాలి అవసరమని ఎన్నడూ ఎంచదు. అలాగే ఈనాడు స్త్రీలు — ఆ కోవకు చెందిన వారే అని విశ్వసించుచున్నాను.

చిత్తం దారం లాగితే ఆడేబొమ్మలు అలాగే అనుకుంటున్నాయేమో!

**పి. ఆర్. ఆర్, సికింద్రాబాదు**

నా చేత సహాయం పొందిన వాళ్లు అదే సహాయం నాకు అవసరమైనప్పుడు తప్పించుకుంటారు. అటువంటి సమయంలో సహజంగా బాధ కల్గుతుంది...

మనకవసరం అయినప్పుడు సహాయపడతారు కదా అని సహాయం చేయడం—సహాయంకాదు స్వార్థం అవుతుంది.

**జె. ఎస్, బద్వేలు**

నాతో ముఖ పరిచయం ఉన్న (ఎప్పుడూ మాట్లాడుకో లేదులెండి) మా క్లాసమేట్ ఒకమ్మాయి 65లో నా కలలో 272సార్లు (డైరీలో నోట్ చేసుకుంటూ వచ్చాను లెండి) కన్పించింది. (మీరు నమ్మక పోయినా ఇది నూరు పాళ్లు నిజం) నా ప్రేమ రికార్డు బ్రేక్ కదండీ!

ఎలా? ప్రతి క్షణం మనస్సులో ఉంచుకునే ప్రేమకు మళ్లేరన్న ధీమాతో చేసిన స్టేట్‌మెంట్ అది! .. పాపం డైరీ రాసుకుంటూ 65లో ఉండి పోయినట్లున్నారు అమ్మాయి పెళ్లి చేసుకునో, చదువు పూర్తి చేసుకొనో వెళ్లిపోయి ఉంటుంది. ఔనా?!

# కటకటాలు

తమిరిశ జానకి

అసలీ పెపంచాన్ని నమ్మకూడదయ్యా! అదేలే పెపంచవంటే మనుసులే. మనిసిని మనిసి నమ్మకూడదయ్యా! మనిసిని మనిసి నమ్మక మానులు నమ్మతాయా అనడక్కు మరి. ఓ మనిసిని ఇంకో మనిసి నమ్మొద్దూ అంటే అందులో ఏదో తిరకా సుందన్నమాటే. నేను నీతో నిన్ను నమ్మ తున్నాను అన్నానంటే అందులో ఏదో ఉందన్నమాటే, ఏవిటనమగు. అవసర వైనప్పుడు ఓ బీడీముక్క వడేత్తావని. దానిక్కూడా నిన్ను నే నమ్మకపోతే ఇంక ఈ కటకటాల్లో మనం బతికేదెట్టా? ఎవరో ఏమన సెప్పాదు, సుమతి సెప్పాదు అంటారుగానీ అనుభవంతో ఎవరు సెప్ప లేరయ్యా? నే ననుబవించిన జీవితాన్నిబట్టి ఆళ్ళకి రెండు రెట్లు నే సెప్పగల్ను. ఏంటోలే ఏం సెప్పడానికి మొదలెట్టి ఎక్కడికి పోతన్నానో నాకే అంతు బట్టదు.

ఏంటిట్టా వాగుతున్నాడీడు. పొరబాటున పిచ్చాసుపత్రిలో ఎయ్యాల్సినోడిని కిష్ణ జన్మస్థానంలో ఎయ్యలేదు గదా అని ఆలో చిస్తన్నావా? అసలు నిజం సెప్పాలంటే ఈ పెపంచంలో ఎవడికి పిచ్చిలేదు సెప్పు. పెద్దయినాక ఉద్దరిస్తాడని ఆశలు పెట్టుకుని కంటికి రెప్పలా నన్ను పెంచి పెద్దజేసిన మా యమ్మకి పిచ్చికాక మరేటి?

కొవల్సినోడు గదానని వరసకి మావయ్యే చలపతిని నమ్మకున్న నాకు పిచ్చిగాదూ? తప్పుడుపన్లుసేత్తే జైల్లో ఏత్తారని తెల్సి గూడా తప్పుడుపన్లుసేసి జైల్లో కూకునే ఈళ్ళంతా పిచ్చోళ్ళుగాదూ? ఆళ్ళ శరీరాల్ని మాత్రవే బందించి, ఏళకింత బడేసి మేపుతున్న ఈ ఆపీసర్లు పిచ్చోళ్ళు గాదూ? ఏటో సెప్పడం మొదలెడితే యినే సెవి లేపోయినా సెప్తానే ఉంటాను అది నరేకానీ గురూ ఇంతకీ నువ్వు...అంటు న్నానని అనుకోమాక...నువ్వు సూత్తే బుద్దావతారంలా గున్నావ్ నిన్ను జైల్లోకి తోసిన పిచ్చోళ్ళెవరంట?'

అంతవరకూ రంగడి మాటలు వింటున్న నారాయణ నవ్వి ఊరుకున్నాడు.

మళ్ళీ అందుకున్నాడు రంగడు. 'రేపే నిన్ను యిడుదల సేత్తారన్నావ్. ఇంకా ఆ దిగులెందుగ్గురూ!

జొన్నే! కటకటాల్లో ఉన్నంతకాలం కడుపుకి కూడైనా దొరుకుద్ది. కటకటా



లవతల తిండికి కటకటలాడి సోవల్సిందేగా! మనదేశంలో దర్రిదం సవుద్రంలో నీరులా తరగదుగా? ఆ! సరేగాని గురో! నీ గురించి కాస్త్రంత సెవినెయ్యరాదూ? యింటాను.'

మళ్ళీ చిరునవ్వు తప్ప సమాధానం లేదు నారాయణదగ్గిర్నించి.

'పోనీ నా కత సెప్తాను యింటావా?' అడిగాడు రంగడు.

చెప్పమన్నట్టు తలూపాడు నారాయణ.

'నా సిన్నతనం అయ్యసావుని సూసింది. కన్నతల్లీ, కావల్సినంత డబ్బు మిగిలాయి. మా అమ్మకి నేనంటే ఎర్రిపేమ. అస్తమానం అనేది నన్ను—

'నీకు బొత్తిగా లోకం తెలీదురా రంగా! ఎట్టా బతుకుతావో ఏమో మరి' అని. నా మీదెన్నో ఆశలు బెట్టుకుంది. కానీ ఏం లాబం? కొన్నాళ్లకి ఆ అమ్మని కూడా కాలం మింగింది.

నీక్కావల్సినోడినంటూ వొచ్చి నన్ను చేరదీశాడు చలపతి మావ. నామీద జాలేసి గాదు. నా ఎనకాలున్న డబ్బుజూసి. ఆ సంగతి నాకేం దెల్సు. మావకో కూతురుంది. సాయిత్రి. అదీ, మావా నాతో బానే కబుర్లాడేవోరు. అత్తమ్మకి నేనంటే గిట్టేదిగాదు.

నా ఎనకున్న డబ్బు సూసి బరించేది గాబోలు పాపం.

నన్ను చేరదీసింది మొదలు నా సెవిలో మొగుతానే ఉన్నాడు మావ సాయిత్రిని నాకిచ్చి సేస్తానని.

నాకూ అదంటే సచ్చే యిష్టం. దానికీ తెల్సు నాపేమ.' మధ్యలో ఆపి కళ్ళు తుడుచుకున్నాడు రంగడు. 'ఏడస్తన్నానా? లేదు. అట్టే లేదు గురూ! ఏడవందే?' నన్నుగా గొణుక్కుని మళ్లీ మొదలెట్టాడు.

'మా సాయిత్రిని సేసుకుని ఈ ఇంటోనే మాదగ్గిరే ఉండిపో అల్లుడా' అనేవోడు మావ.

సాయిత్రిమీద పేమతో అల్లేది సెప్తే దానికల్లా ఒప్పేసుకున్నాను. అలాటిది ఇదిగో ఇలా సూడు.

ఈ కాలు...ఓనాడు సాయిత్రి సెట్టెక్కి ఏవో పూలుకోసి బెట్టమనడిగింది. దానికోసం సెట్టెక్కాను. నన్నేదో దడిపిద్దామనుకుందంట.

'బావోయ్' అంటా ఓకేక బెట్టింది. కొమ్మసివరగా కూసుని పైకి సూస్తూ పూలందుకుంటూ ఉన్న, నే ఉలిక్కిపడి ఎనక్కి తిరిగి కిందకి సూశాను సాయిత్రి కేవైపోయిందోనని.

అంతే ఆ సూట్టంలో కాలు మడతపడి కొమ్మమీంచి జారి ఆ ఎత్తునించి నేల కరుసుకున్నాను. దానిపలితం ఈ ఎడం కాలుతో కాస్త్రంత కుంటుతున్నట్టుగా నడవాలి.

ఆ దినంనించీ సాయిత్రి నాకు దూరంగా ఉంటం మొదలెట్టింది. మాటలు తగ్గించింది. మా వకూడా ముందటిలా కబుర్లాట్టం మానేసుకున్నాడు. అర్దం సేసుకునేపాటి ఇంగితం నాకుంటే మా అమ్మ అట్టా ఎందుకనాల్సొచ్చేది 'నీకు లోకం తెలీదురా' అని. అదీగాక ఆ కుంటికాలోడిని నే సేసుకోనని గారాబు కూతురు సాయిత్రి అల్లయ్యదగ్గిర గునిసేదని నాకేవెరుక.

ఓనాడున్నట్టుండి సక్కగా సింగారించుకుని నా దగ్గిరికొచ్చి కూసుని కబుర్లాట్టం మొదలెట్టింది సాయిత్రి.

అయిసైపోయాన్నేను. మాటాట్టం మానిన మావ కూతురు మళ్లీ మనసై నాకాడి కొచ్చిందనుకున్నా. ఇద్దరం కబుర్లాడుకుంటుంటే సేతిలో తెల్ల కాయితంతో వొచ్చాడు మావ.

'అడ్డొచ్చినట్టున్నానే. పోన్లే యిప్పుడే అన్నీ సెప్తూ యిసిగించన్లే నిన్ను. ఇప్పటికి దీనిమీదో సంతకం పారెయ్. యివరాలు ఆనక సెప్తాను' అన్నాడు వొస్తూనే తెల్ల కాయితంమీద సంతకం కావాలని సూపిస్తూ.

నాయంక మెత్తగా సూసి నవ్వింది సాయిత్రి.

'ఆ సంతక వేదో గమ్మునెట్టు బావా. నీతో ఓమంచి కబురు సెప్పాలి' అన్నాది.

నే సంతకం సెయ్యటం మావది తీసుకుపోటం సాయిత్రి కల్లల్లోకి సూస్తున్న నాకు దెలిస్తేగదా!

ఆ మరుసటిరోజు మావన్నాడు. 'ఒరే రంగా! సాయిత్రికో మాంచి సమ్మంధం వొచ్చిందిరా. ఈ నెల్లో దాని పెల్లి సేసేద్దావని సూస్తన్నాను.'

తెల్లబోయాన్నేను. మావా నువ్వనేది' ...మరి మాటాడలేపోయాను.

మళ్లీ అదేమాటన్నాడు మావ.

'అన్యాయం సేయకు మావా' అన్నాను. సాయిత్రి లేందే బతకలేను మావా అని సెప్పాను. బతిమాలాను. మంచిగా సెప్పాను. ఊహూ! ఎంత సెప్పినా ఏం లాబం? సివరి కన్నాడు సాయిత్రి కుంటికాలు మూలంగా నన్ను సేసుకోనన్నాదని.

ఏడవలేక నవ్వుకున్నా నేను. ఎవరికోసం నేను కుంటివాడినయ్యాను. నేను పేమించిన సాయిత్రికోసం కాదూ? సాయిత్రికి నామీద జాలికూడా లేదని తెల్సిపోయిందిడి.

'సరే మావా ఇంక ఈ ఇంటో నే మసల్లేను. నే నెట్టైనా పోతా' నన్నాను.

'ఒరే ఎల్లేముందు ఇదోసారి సూసిపో' అంటా సూపించాడు మావ ఓ కాయితం.

ఔ నదే! కిందటి రోజు నే సేసిన సంతకం కిందగా ఉంది. పైన ఏం రాసుందో తెల్సా గురూ! నా కప్పుడప్పుడు మతి స్తిమితం తప్పుతూ ఉంటుందట. నాకు గ్యాపకం తక్కువట. అందుకని నా ఆస్తి కంతకీ హక్కుదారుడుగా నా మావని పెట్టుకున్నానని నే రాసినట్టు. కింద నా సంతకం ఉందిగా.

కోర్టుకెక్కితే నేనే గెల్సి నిజానిజాలు బైటపడేవేమో? నా కేవిటో ఒల్లా పై తెలియలా?

అటు సాయిత్రి లేదు. ఇటు ఆస్త్రంతా కాజెయ్యాలని సూస్తన్నాడు మావ. అంతే ఆగలేపోయాను. ఉద్రేకం నంపుకోలేపోయాను.

సెవంచంలో ఉన్న పిచ్చోళ్లల్లో నేనూ ఓ పిచ్చోడినయ్యాను. కోవంలో పీతక బాదాను మావని. పావలేదుగానీ ఉప్పెనంత వచ్చింది మావకి నా దెబ్బల్తో.

మావని నే సంపడానికి పెయత్నించినట్టూ కొద్దిలో మావకి పాపు తప్పినట్టూ నా మీద కేసు బనాయించారు అయ్యా కూతుళ్లు. నాకు సాచ్చెం ఎవరూ లేరు. పలితం ఇదుగో ఈ కటకటాలు.'

రెండు చేతుల్లోనూ మొహం దాచుకున్నాడు రంగడు.

ఆప్యాయంగా రంగడి [illegible] వేశాడు నారాయణ.

పేరూ చెప్పి "ఈ ఇంట్లో ఉంటారో" అన్నాడు గొణిగినట్టుగా.

'వాళ్లా! అదిగో ఆ సందులో రెండో ఇల్లే, వేపచెట్టు పక్క ఇల్లే వాళ్లది' అన్నాడాయన పక్క సందులోకి చూపిస్తూ.

సుభద్రరూపం కళ్లముందు కదులుతుంటే, అడుగులు తడబడుతుంటే ఆత్రంగా ఆ సందులోకి, ఆ ఇంటి ముందుకి చేరాడు నారాయణ.

'ఇదేమిటి ?...ఇది...ఇది కటకటాల ఇల్లు...' అప్రయత్నంగా నారాయణ కాళ్లు ఆ ఇంటిముందు ఆగిపోయాయి.

అప్పుడే లోపల్నించి బయటికి వస్తున్న సత్యం వీధిలో నిలబడిన తండ్రిని చూసి పరుగులాంటి నడకతో వచ్చాడు.

'రా! నాన్నా! అలా నిలబడిపోయావేంటి ? ఇదే మనిల్లు.'

అప్రయత్నంగా సత్యంవెంట లోపలికి నడిచాడు నారాయణ.

'అమ్మా! నాన్న వచ్చాడు' సత్యం కేకతో బయటకివచ్చిన సుభద్ర ఆనందంలో మాటలు కరువై మూగగా గుమ్మంలో నిలబడిపోయింది. ఆప్యాయంగా భార్యవంక చూసి చిరునవ్వు నవ్వాడు నారాయణ. బదులుగా సుభద్రకళ్లు వెలుగు నింపుకుని వెదజల్లాయి నవ్వులు.

'నువ్వు విడుదలయ్యే రోజు నేను ఆ ఊరొద్దామనుకున్నాను నాన్నా. అనుకున్న దానికంటే ముందే విడుదల చేసినట్టున్నారు. కానా!' తండ్రి మీదున్న భక్తి, విశ్వాసం మరెవరి మీదా లేవు సత్యానికి.

'ముందు కాఫీ ఇచ్చి స్నానానికి నీళ్లు పెడతాను' అంటూ లోపలికి వెళ్లింది సుభద్ర.

'కూర్చో నాన్నా' అక్కడే ఉన్న పడక్కుర్చీ చూపించాడు సత్యం.

'నీకు కటకటాల ఇల్లంటే ఇష్టం కదు నాన్నా! నాకు వ్యాపారంలో లాభాలు బాగానే వస్తున్నాయి. ఈ ఇల్లు అమ్మకానికొచ్చింది. అంత డబ్బూ ఒక్కసారే ఇవ్వక్కర్లేదన్నాడు ఇంటాయన. మంచి వాడు. ఆలస్యం చేసినకొద్దీ ఇంటి రేటు పెరిగిపోవచ్చు. అందుకని మొన్ననే కొనేశాను. నిన్న మంచిరోజని మకాం ఈ ఇంట్లోకి మార్చేశాం' [illegible] తండ్రి కళ్లల్లోకి చూశాడు సత్యం.

[illegible] స్వర్గం కాదనుకున్నాడు నారాయణ.

'ఒక విధంగా నా మంచికే మన్ని ఇన్నాళ్లు కొన్నావేమోరా సత్యం. జైల్లో ఉండి వచ్చిన నేను, దొంగవని అనవసరంగా పేరు తెచ్చుకున్న నేను ఊళ్లో తలెత్తుకు తిరిగేదెలా? నలుగుర్లోనూ నడిచేదెలా! అని మథన పడుతున్న నాకు మార్గం చూపించావు. ఇన్నాళ్లూ ఆ కటకటాల్లో గడిపి వచ్చాను. ఇప్పుడింక సిగ్గుపడుతూ, బాధపడుతూ ఊళ్లో తిరగక్కర్లేకుండా, వీధిలో వచ్చే పోయే వాళ్లని చూస్తూ ఈ కటకటాల్లో కూర్చుని జీవితాంతం గడుపుతాను. ఆ కటకటాల్లో ఉండిన కొన్నాళ్లూ మాత్రమే. దానికి ఫలితం నలుగుర్లోనూ మొహం చూపలేక జీవితాంతం ఉండిపో ఈ కటకటాల్లో' అన్నం కంటే ముఖ్యం అభిమానం అనుకునే నారాయణ మనసులో అనుకున్నాడా మాటలు.

పడక్కుర్చీలో వెనక్కి వాలి కళ్లు మూసుకున్నాడు.

కళ్లు మూసుకున్నా కనిపించింది నవ్వుతోంది కటకటాలు.




[illegible]
విందులకి వెళ్ళొచ్చాక్కూడా [illegible] ఉంటారు. కాని [illegible] తెలుసుకున్నట్టు [illegible] తమ అనుభవం చెప్పరు [illegible] మళ్ళీమళ్ళీ విందులకి పిలవడాలూ వెళ్ళడాలూ ఉంటూ ఉంటాయి!

దగ్గర స్నేహితులనీ అయినవారినీ భోజనానికి పిలుస్తే ఇబ్బందేమీ లేదు అటూ ఇటూ తక్కువెక్కువలు అయినా సర్దుకుపోతారు. లేదా అడిగి వేయించుకుంటారు అయిన వాళ్ళూ, బాగా స్నేహితులూ కాకుండా సోషల్ సెట్స్ అనబడే గౌరవనీయులని భోజనానికి పిలిచినప్పుడే ఎక్కడలేని ఇబ్బందులూ వచ్చిపడతాయి విందయేసరికి కొరివితో తల గోక్కున్నా మన్న ఫీలింగు మిగిలిపోతుంది!

ఏదో ముహూర్తాల విందులు వేరు అవి బొత్తిగా శాస్త్రీయమైనవి. కాని పట్నాలలో సరదాకంటూ 'గెట్ టుగెదర్స్' జరిపిస్తూ ఉంటారు ఇది కేవలం కబుర్ల కోసం, కొత్త పోకడలు బేరీజు వేయడం కోసం జరిగేవి లేటెస్టు వార్తలు రహస్యంగా వినొచ్చు 'ఫలానావారి అమ్మాయి లేచిపోయింది'మొదలు,'ఫలానాఆవిడా ఆయనా మొన్నదెబ్బలాడుకున్నారు'దాకాతెలుస్తాయి.

మగవాళ్ళతో ఎక్కడా పేచీలేదు. వాళ్ళగొడవలు వాళ్ళవి (బిడ్జీమాచీలూ, కొత్త నగలూ, [illegible] స్పర్ధల్లా మినహా ఎక్కువ మాట్లాడు కోరు—అది పెద్దవాళ్ళ ఇక ఇలాంటి చోట కుర్రవాళ్ళుచేరితే లేటెస్టు 'ఫ్లేము' కొసనే ఉంటారు అజంతా ముడే ఎత్తు దానిమీదనుంచి క్రిందికి జలపాతపు పాయ లాగా వేలాడుతూ జట్టు—అది లేటెస్టు అని తెలుసుకుంటారు ఎంత బిగువు 'అడుగో', అంతలూజా 'టాపు'లో అమ్మా యిలు గమ్మత్తుగా కన్పిస్తుంటారు నాలాంటి వాళ్ళకి కిందదేదో ఎక్కిస్తారో తెలియదు పైది ఎందుకు వేసుకుంటారో తెలియదు ఇదే పక్కన కూర్చుని భోంచే స్తున్న ఏ ఆవిడతోనో ఏ ఆయనతోనో అనబుద్ధి అదిగో — అక్కడే జాగ్రత్త అవసరం ఇలాంటి చోట్ల లేదా మనం మాట్లాడుతున్నదా పిల్లదాని తల్లో, పిన్నో, మేనత్తో అయితే చిక్కే రకరకాల నగలు చీరెలు జుట్టుముళ్ళ ఎక్కువగా చూడాలంటే రేసులకీ; నిశితంగా చూడా లంటే ఇలాంటి డిన్నర్లకి వెళ్ళాలి

ఇదివరకు విందంటే విందే ఇప్పుడు అలాకాదు నలుగురూ కలిసి కబుర్ల కలబోసుకుందుకు విందు ఒక వంక. అందుకనే—ఎవరేనా విందుకు పిలిచారంటే భయం—అన్ని చీరలూ అందరూ ఓసారి చూసినవే—కొత్తదొకటి కొనుక్కోవాలని పిస్తుంది. (నాలాంటి మొండిఘటాలకి కాదు) లేటెస్టుగా లేకపోతే అలాంటి చోట్లకి వెళ్ళకుండా ఉండడమే మంచి దనే ఆడవాళ్ళుకూడా లేకపోలేదు.

ఇక భోజనం సంగతి కూరో పులుసో తెలియదు అది అన్నంలో అద్దుకు తినాలో కలుపుకొని తినాలో తెలియదు! 'కొత్త




డాక్టర్ కబుర్లు

## కడుపులో పుండుకి వెన్నెముక నొప్పి

భుజాల మధ్యభాగంలో ఎక్కడయినా వెన్నెముకమీద వేలు పెట్టి నొక్కితే—లేదా గుద్దు వేస్తే — నొప్పి కలిగినట్లయితే కడుపు కిందిభాగంలో (డువోడునమ్



అనేచోట) పుండు పడిందని ఊహించవచ్చు.

వీపు కిందిభాగంలో ప్రారంభించి మెడదాకా పరిశీలించటం సాధారణంగా అనుసరించే పద్ధతి ఈ పద్ధతిచూడగా 55 లో 50 మందికి కడుపులో పుండు ఉన్న సంగతి ఎక్స్-రేలద్వారాకూడా నిర్ధారణ అయింది.

పుండుమూలాన వెన్నుకి నొప్పి రావచ్చు. కాని, వెన్నులోపం వల్ల పుండురాదు!

సరయిన చికిత్సతో పుండుని నయంచేస్తే వెన్నులోబాధ తగ్గుతుంది. 81 మందికి పుండు నయంచేసి ఈ పరీక్ష పెట్టగా వెన్నెముక నొప్పిపోయినవారి సంఖ్య 78!

హెచ్. ఎల్. హార్స్టన్‌సోన్
(కాపీరయిటు)

టం. మొన్న చదివాను' అంటూ వంటి వివరాలు చెప్తేనూ ఉంటుంది విందుకారి (పిలిచినావిడ!). దానో వేసిన ఏ ఒక్క పదార్థమైనా మనకి నచ్చనిదుంటే—చూసుకొండింకా అవస్థ! బాగుంది కదా అని ఎక్కువ తింటే ఎవరు చూస్తారో అని భయం. అసలు వేసుకోకపోతే పిలిచినావిడ ఏమనుకుంటుందోనని భయం. భోజనాలయ్యాయనిపించి ఇవతల పడ్డాక అసలు విందు ప్రారంభం అవుతుంది! కబుర్లు. గాసిప్. ఇదో రెండు మూడు గంటలయినా సాగేక ఒకక్కళ్ళే లేవడం ప్రారంభిస్తారు. అంతా వెళ్ళాక సామాను సర్దుకుంటూ 'అవిన్నీ చూశారా?' అంటూ అడుగుతూంటుంది ఇల్లాలు. రెండు కళ్ళుండీ ఏం చూడలేని అదృష్టవంతుడైన ఆ భర్త 'ఏం?' అంటాడు. ఒకొక్కప్పుడు 'ఆహా' అనడంకూడా కద్దు ఇల్లాలి గొడవ—

కొత్తవంటం
మొన్న
చదివాను



ఆవిడ ఎట్టుకుంది కొత్త నెక్లెస్ అనో, కట్టుకుంది ఖరీదైన చీర అనో చెప్పాలని. దెబ్బతగలకుండా తప్పించుకునేట్టు — ఏం తెలియని మొహంపెట్టి కూర్చుంటాడు భర్త—చూశానంటే ప్రమాదం కనుక.

పువ్వుగాని పువ్వుకాదు. కాయగాని కాయకాదన్నట్టు ఈనాటి ఆధునికపు విందు—విందుగాని విందు. ఓసారి సరదాగా మావయ్యా అంటూ తీసుకువెడితే—'అది విందులే నాముఖం. మందుగాని, ఏమిటా వంట?' అంటూ వాళ్ళ మెట్లుకూడా దాటకుండానే ప్రారంభించాడు. 'బాబోయ్ ఇలాంటి మా మామయ్యని వెనకేసుకెడితే—అబ్బాయిలెవరూ పలకరించరు సరికదా—మళ్ళీ ఎవరూ పిలవరు బాబూ' అంటుంది డబ్బాలాంటి కవిూజాతో మరీ సన్నంగా కనిపిస్తున్న నా అభిమాన పుత్రి. ●




తిమింగిలాలు స్తన్యజీవులు. పాలిచ్చి పిల్లల్ని పెంచుతాయి. ఆవిధంగా అవి మన తరగతికి చెందుతాయిగాని, ఆకారం కల్గినా, అవి చేపల తరగతికి చెందవు. నేలమీద సంచరించే స్తన్యజీవులే, నీటిలోకి పోయి, చేప ఆకారాన్ని పొందాయని పరిణామ సిద్ధాంతం చెప్తుంది.

కొన్ని జాతుల తిమింగిలాలు 100 అడుగుల పొడ వుంటాయి. 150 టన్నుల బరువు కూడా ఉండవచ్చు. బహుశా ప్రపంచం వేరే అంత పెద్ద జంతువును చూసిఉండక పోయి ఉండవచ్చు. అలాగని అన్నీ ఆ సైజులో ఉండవు. 5, 6 అడుగుల తిమింగిలాల జాతులూ ఉన్నాయి.

తిమింగిలాలది ఒకవిధంగా విషాదగాథ. సముద్రంలో చాలా తిమింగిలాలు నివసిస్తున్నాయి. వాటి శరీరంలోని భాగాలు చాలా ఉపయోగం అవడం వల్ల మానవుడి చేతిలో అవి చాలా నశించి పోయాయి. కొన్ని జాతులే అంతమయి పోయాయి. కొన్ని తిమింగిలాలకి దంతా లుండవు. వాటికి బదులుగా వేల్‌బోన్ అనే పదార్థం ఎదుగుతుంది. అదే నోటిలో ఒక వడబోత అవయవంగా ఉంటుంది. తిమింగిలం వక్తు చిన్న చిన్న జీవుల మీదనే ఆధారపడు తుంది. సుమారు 100 టన్నుల బరువు గల జీవి ఇలా బతకడం ఆశ్చర్యం కదా! దాని చర్మం కింద ఒక అడుగు దళసరివ 'బ్లబ్బర్' అనే పదార్థం ఉంటుంది. అది విలువైనదే – దానికి ఉష్ణోగ్రత సమస్థాయిలో ఉంచుకోడానికీ, మనకి క్రొవ్వు పదార్థంగానూ.

'స్పెర్మ్‌వేల్' కొంచెం చిన్నది. దంతాలుంటాయి. పెద్ద పెద్ద జీవుల మీదనే ఆధారపడి ఉంటుంది. దీని నుంచి స్పెర్మ్ నూనె, అంబెర్గ్రెస్ అనే విలువైన పదార్థాలు తీస్తారు. ఇలాటి అవసరాల కోసమే తిమింగిలాలు మానవుడి చేతిలో హత మవుతున్నాయి, అవుతున్నాయి.

తిమింగిలాలు నీటి అడుగున చాలాసేపు – అర్ధ గంటవరకు – ఉండగల్గుతాయి. అయినా మనలాగా, గాలి పీల్చుకొనేప్పుడు పైకి వచ్చి ముక్కుతోనే గాలి పీల్చుకోవాలి. వదిలిన గాలి నీటి యావిరితో చక్కగా నీటి ఊటలాగా పైకి లేస్తుంది. అది చూస్తే, దాని ఉనికి కనిపెట్ట గల్గుతారు వేటగాళ్ళు.

కిల్లర్ తిమింగిలం— ఒకటుంది. 30 అడుగుల పొడ వుంటుంది. దంతాలు వాడిగా ఉంటాయి. ఇది సముద్ర తోడేళ్ళ లాంటిది. ఇతర తిమింగిలాల్ని వేటాడి, పట్టి తింటాయి. తోడేళ్ళ మాదిరిగా అవసరమైతే కొన్ని కలిసి వేటాడతాయి. కొంత చేరి దాని నోటిని బలవంతాన తెరుస్తాయి. మరికొన్ని నాలిక పీకేస్తాయి. మిగతావి ఘోరంగా దాన్ని చంపి తినేస్తాయి. నేలమీద సంచరించే తోడేళ్ళు సముద్రంలోకి పోయి అలా కిల్లర్లుగా మారి పోయాయని ఎస్కిమోలు అనుకొంటారుట!

—జమ్మి కోనేటిరావు.




### జరిగినకథ

కంట్రాక్టరు సుందరరావుగారు అయిశ్వర్య వంతుడు. ఆయన భార్య శాంతమ్మ. వారి ఇద్దరు కొడుకుల తర్వాతది కల్యాణి. కల్యాణికి వసౌళి ట్యూషన్ చెబుతాడు. అతను పేదవాడు. వారి పరిచయం ప్రేమగా మారుతుంది. తండ్రి ఆమె కొక పెద్ద సంబంధం తీసుకువస్తాడు. కల్యాణి ఒప్పుకోలేదు. కొంత డబ్బు తీసుకుని వసౌళితో మద్రాసు పారిపోవాలనుకుంటుంది. ఇద్దరూ కలిసి మద్రాసు వస్తారు. కొద్దిరోజులకే ఇద్దరికీ మనఃక్లేశాలు వస్తాయి. వసౌళి కల్యాణిని అనుమానిస్తాడు. కల్యాణి సుమిత్రవద్దకి వచ్చి ఆమె సహాయాన్ని కోరుతుంది. సుమిత్ర వసౌళి దగ్గరకు వచ్చి అతన్ని మనోవ్యథ నుంచి తప్పించాలని చూస్తుంది.

## 10

కల్యాణికి టీచర్ ఉద్యోగం దొరికింది. సుమిత్ర ఒక చిన్న ఇల్లు కూడా మాట్లాడి కల్యాణికి రాసింది — కల్యాణి వచ్చింది. డ్యూటీలో జాయినయింది—

కల్యాణి ఉద్యోగంలో చేరటం — వేరే ఇంట్లో ఉండటం — వసౌళితో వేరొక యువతి ఉండటం — ఊరంతా మళ్లీ దుమారం రేగింది.

వార్త విన్న నారాయణమూర్తి గుండె లవిసి పోయాయి. తక్షణం కల్యాణి దగ్గర కొచ్చాడు—

[illegible]

అన్నాడు విలవిలలాడుతూ.

'అన్యాయమా ఏమిటి?'

నిర్లిప్తంగా చూస్తూ అడిగింది కల్యాణి—

'వసౌళిగారు మిమ్మల్ని వదిలేసారా?'

'ఛ! ఆయన ధార్మికులు — భార్యను వదిలే అధర్మం ఆయన చెయ్యరు— నేనే వచ్చేసాను.'

నారాయణమూర్తి మదురు బాధగా రానుకొన్నాడు.

'ఏం జరిగిందక్కయ్యా! నాకు చెప్పండి—ఏం జరిగిందసలు?'

అతి నీరసంగా ఉన్న కల్యాణి ముఖాన్ని చూడలేక తల తిప్పుకొంటూ అన్నాడు—

'నిజంగానయ్యా! ఏం జరిగిందో నాకూ తెలీదు—నేనేం చెప్పగలను?'

గుండె చేతులో గట్టిగా పట్టుకొని కూలబడిపోయింది కల్యాణి—

గాభరాగా కల్యాణి దగ్గరగా వచ్చి 'ఏమిటీ? ఏమయింది?' అన్నాడు.

కొంతసేపటి వరకూ కల్యాణి మాట్లాడలేక పోయింది.

'ఈ మధ్య నాకిలా గుండెల్లో నొప్పి వస్తోంది తరచుగా...'

అంది ఆయాసపడుతో—

నారాయణమూర్తి విపరీతంగా బాధ పడ్డాడు.

'నేను పలుమ మాట్లాడ్డాన్ని — ఇప్పుడా [illegible]

సింది— పదండి. ముందు డాక్టర్ దగ్గర కెళ్దాం—'

'డాక్టర్ దగ్గర కెళ్తే మంచిదే! నేనింకా కొంతకాలం బ్రతకాలి — కానీ, నా దగ్గర డబ్బులేదు. అప్పుడే జీతం రాదు—'

నారాయణమూర్తి బాధనణచుకొంటూ పెదిమలు గట్టిగా బిగబట్టాడు—

'నా దగ్గరున్నాయి పదండి...'

'నీ డబ్బంతా ఖర్చు చేయించే అక్కలు నీకుండనే ఉన్నారు. ఇంకా నా ఖర్చులు కూడా నీ నెత్తిన వేసుకుంటావా?'

'అలా మాట్లాడితే కోపమొస్తుంది నాకు. మీరు నా స్వంత అక్క కారా? ముందు రిక్షా ఎక్కండి.'

ఎవరు స్వంత వాళ్లో ఎవరు పరాయి వాళ్లో ఏయే అనుబంధాలు ఎలా ఏర్పడతాయో ఎవరు చెప్పగలరు?'

ఒక్క నిట్టూర్పు విడిచి రిక్షాలో కూర్చుంది.

డాక్టర్ పరీక్ష చేసాడు. కన్సల్టింగ్ ఫీజ్ తీసుకుని అందరికీ తెలిసిన సంగతే చెప్పాడు.

'బాగా పళ్లూ పాలూ తీసుకోవాలి. విశ్రాంతి అవసరం— ముఖ్యంగా మానసిక ఆందోళనలు పనికిరావు.'

ఏదో టానిక్ రాసిచ్చాడు—

రిక్షాలో ఇంటికొచ్చేసింది కల్యాణి—

[illegible]

[illegible]

దగ్గిర కెళితే పిల్లావాళ్లూ [illegible] సలహాలు చెపుతారు వాళ్ళు—

పాపం, వాళ్ళుమాత్రం ఏం చెయ్య గలరు? వాళ్ళు చదువుకొన్న శాస్త్ర గ్రంధాలననుసరించి వాళ్ళు చెప్పారు—

శాస్త్రం—ధర్మం—న్యాయం—

కల్యాణి భారంగా కళ్ళు మూసుకుంది.

'అక్కయ్యగారూ!' లేచి కూర్చుంది.

టానిక్‌సీసా కల్యాణి ముందుంచాడు నారాయణమూర్తి—

'మరిచిపోకుండా డాక్టర్ చెప్పినట్లు రెండుపూటలా అన్నం తినగానే తీసుకోండి. అస్థిపంజరంలా ఉన్నారు. మిమ్మల్ని చూస్తే భయంవేస్తోంది. అందులో పట్టి మనిషికూడా కాదు.'

కల్యాణి కళ్ళలో నీళ్ళు ధారలు కట్టాయి.

'అయ్యో! నారాయణమూర్తీ! నాకోసం ఎందుకయ్యా ఇంత శ్రమపడ్తున్నావ్? నాకా టానిక్కులు దేనికి? బలం తెచ్చుకొని ఈ లోకంతో నేను పొందవలసిన దేమున్నాయి? చావకుండా బ్రతకటానికి నాలుగుమాత్రలు చాలు—'

'ఇంకోసారి అలా మాట్లాడకండి—నేను రేపొస్తాను. మళ్ళీ—రేపటికీ ఈ టానిక్ సీసా ఇలానే ఉంటే మిమ్మల్ని క్షమించను - నేను మంచివాణ్ణి కాను తెలుసా ?'

కోపం నటిస్తూ గబగబ వెళ్ళిపోయాడు నారాయణమూర్తి—

ఈ లోకపుతీరు విచిత్రమైంది—శ్రీపురంలో అందరికీ కల్యాణి పేరే ఉంటున్న విషయం తెలిసినా పకాలికి మాత్రం తెలీదు. అతనిదగ్గిర ప్రత్యేకం ఎవరూ ఈ సంగతి చెప్పటానికి సాహసించ లేరు—ఇటీవల అతను చుట్టుప్రక్కల వాళ్ళతో మాట్లాడటం పూర్తిగా మాను కొన్నాడు—

గర్ల్సుస్కూల్ కాలేజి రోడ్డుమీదేఉంది. రోజూ కాలేజికెళుతున్నప్పుడు తననెవరో పరీక్షగా చూస్తున్నట్లనిపించేదిపకాలికి.

ఒకనాడు తను పరిశీలనగా చూసాడు. కల్యాణిలా అనిపించేసరికి గుండెలు జల్లు మన్నాయి—కొంతదూరం వెళ్ళి మళ్ళీ వెనక్కిచూసాడు—ఆవ్యక్తి అక్కడే నిలబడి తనవే చూస్తుంది— సందేహం లేదు!

కల్యాణే! కాలేజికి వెళ్ళినా ఉండలేక పోయాడు—సెలవుచీటీ రాసిచ్చి తిన్నగా గర్ల్సుస్కూల్ కొచ్చాడు—ఆ సమయానికి కల్యాణి ప్లేగ్రౌండ్‌లో ఉంది.

'కల్యాణీ!' గర్జించాడు—

పకాలికేసి తిరిగింది కల్యాణి—శాంతంగా 'ఏంకావాలి?' అంది—

ఆమె కంఠస్వరంలో కొంచెమైనా కంపం లేదు.

ఆవందమూ లేదు — విచారమూ లేదు —



# ఏది సత్యం?...

కుం(భమయా శేడు

'నీతో మాట్లాడాలి—'

కటువుగా తిరస్కరిస్తూ అన్నాడు—

'ఇక్కడకాదు నా ఇంటికెళ్దాం పదండి. హెడ్‌మిస్ట్రెస్‌ను పర్మిషన్ అడిగొస్తాను—'

'ఏమిట్లు! ఇక్కడ నువ్వు వేరే ఉంటున్నావా? ఒళ్లెరగని కోపంతో పళ్లు నూరుతూ అడిగాడు—

కల్యాణి ఏ సమాధానమూ చెప్పకుండా వెళ్లి హెడ్‌మిస్ట్రెస్‌తో చెప్పి వచ్చింది.

'ఇక్కడ నలుగురిలో అనవసరంగా మాట్లాడకండి—నేను రిక్షాలో వెళ్తాను. నావెనుక సైకిల్‌మీద రండి—'

రిక్షాలో కూర్చుంది కల్యాణి.

అణువణువూ భగభగ మండుతూండగా కల్యాణి ననుసరించాడు వరాళి.

*　　*　　*

సుమిత్ర కొనిపెట్టిన రెండు చాపలూ, ఒక కేంప్‌కాట్ మాత్రం ఉన్నాయి ఆ యింట్లో—కల్యాణి కేంప్‌కాట్ వాల్చింది వరాళికి—

దానివంక జుగుప్సతో చూసి విసురుగా తల తిప్పుకున్నాడు. గుమ్మంలోనే నిలబడ్డాడు. లోపలికి అడుగు పెట్టలేదు. మరోకసారి రమ్మని అడగలేదు కల్యాణి—నిలబడే శక్తిలేక చాపపరచుకుని కూర్చుంది.

'చెప్పు! ఎందుకొచ్చావిక్కడకి? నువ్వు ఉద్యోగం చెయ్యడానికి ఊళ్లే దొరకలేదా? నా పరువంతా గంగలో కలిపితేనేగాని నీకు సుఖంగా ఉండదా?'

'నేనిక్కడికి రాకముందు మీరు పరువుగా బ్రతికేవారా?'

అతి మామూలుగా నిర్లక్ష్యంగా అడిగిన ఈ ప్రశ్న వరాళిని చాచికొట్టింది—

కొన్ని క్షణాలు మూఢుడిలా నిలబడి చివరకు 'ఛీ! సిగ్గులేనిదానా!' అని ఛీత్కారం చేశాడు.

'సిగ్గు పడవలసింది నేనా?'

మరొక్కసారి దిమ్మెరపోయాడు వరాళి—

'అవును. సిగ్గు పడవలసింది నేనే! తలెత్తి నా ముఖాన్ని ఎవరికీ చూపించలేక, ఒక్క క్షణం మనశ్శాంతి లేక కుమిలి పోతూనే ఉన్నాను. ఇంకా ఇదేవిఁటి? అసలు నిన్ను ఇంట్లోంచి ఎవరెళ్లమన్నారు? వెళ్ళిన దానివి మళ్ళీ ఇక్కడికెందుకొచ్చావ్? ఇలా వేరే ఉండటమేవిఁటి?'

'నేను ఉండటంవల్ల మీకు చాలా కష్టం కలుగుతోందని గ్రహించి వెళ్ళిపోయాను.'

'ఫరవాలేదు—కాస్త గ్రహింపు జ్ఞానముంది'

వెటకారంగా నవ్వాడు.

'మరి, ఇప్పుడెందుకొచ్చినట్లు?'

'నా ఆరోగ్యం బొత్తిగా బాగా లేదు. రోజు కొక్కసారైనా మిమ్మల్ని చూడకపోతే నా ప్రాణాలు నిలవ్వు.'

ఈ మాటలు మాటిగా వరాళి హృదయాన్ని తాకాయి. కాళ్లలో శక్తి నశించినట్లు కాళ్లు వణికిపోతోంటే గుమ్మాన్ని గట్టిగా పట్టుకున్నాడు.

కొన్ని క్షణాలాగాడు.

'నేను నీకు కనిపిస్తానని నమ్మకమేమిటే?'

'కనిపిస్తారు—నేనీ ఊళ్లో ఉన్నానని తెలిసాక నన్ను చూడకుండా ఎలా వుంటారు?'

వరాళి ముఖం పాలిపోయింది.

'పరమ క్రూరురాలివి కల్యాణీ! నాలో బలహీనత నీకు చక్కగా తెలుసు — అది ఆధారంగాతీసుకుని నన్ను నమిలేస్తున్నావు. అసలు నేనే లేకుండా పోతే నువ్వెవరిని సాధిస్తావు?'

గిరున తిరిగి వెళ్లిపోయాడు వరాళి.

కల్యాణి లేనబోయింది. కళ్లు తిరిగాయి మళ్లీ కూలబడిపోయింది,

నేనే లేకపోతే ఎవరిని సాధిస్తావునువ్వు?

వరాళి మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. అతడు ఇంటివైపు వెళ్లలేదు—ఎక్కడికి వెళ్తాడు? ఏం చేస్తాడు?

ఒక్క ఉదుటున లేచి నిలబడి కాలివడకతోనే సుమిత్రను చేరుకుంది.

'కల్యాణీ!'

ఆశ్చర్యంతో ఏం మాట్లాడలేక కల్యాణిని చెయ్యి పట్టుకొని కూర్చోబెట్టింది.

'వరాళి ఏదైనా అఘాయిత్యం చేస్తాడేమోనని భయంగా ఉంది. కాస్త కనిపెట్టవుండు సుమిత్రా!'

సుమిత్ర తెల్లబోయింది.

'అఘాయిత్యమా? అంటే? ఎందుకు?'

అంతదూరం పరుగులా నడిచిన కల్యాణి ఒగరుస్తూ ఉండిపోయింది. నోట మాట రాలేదు.

సుమిత్ర జేబురుమాలుతో చెమటలు పట్టిన కల్యాణి ముఖం తుడిచి చల్లటి మంచినీళ్లు త్రాగించింది.

'ఇవాళ నన్ను చూసారు. ఏదో అపందర్భంగా మాట్లాడారు. జాగ్రత్త సుమిత్రా! నే నొస్తాను—మనసు చిరాగ్గా ఉంది వరాళి కాలేజికెళ్లకుండా ఇంటికి వస్తే లేనిపోని గొడవలొస్తాయి. ప్రస్తుతం నువ్వొక్కదానివి ఆయనకు కొంచెం శాంతి కలుగజేయగలుగుతున్నావు. మనిద్దరం





శ్రేష్ఠమైన రుచియు
మంచి సువాసనతో నిండిన
పానీయము
ధరయో అతి సరసము
లిప్టన్స్ హిమాలయన్
గోల్డెన్ డస్ట్ టీ

ఎవరయినా కాపీయండి, ఒక్కసారి త్రాగితే చాలు—మళ్లీ మళ్లీ అడుగుతారు) నిస్సందేహంగా, మీకు మహదానంద కరమైన తృప్తినిచ్చే చిక్కంది. కమ్మని పానీయం యిది. కప్పు తర్వాత మళ్లీ కప్పు. త్రాగటం సరికొత్త మధురానుభూతిని ప్రసాదిస్తుంది. పైగా, యిది ఎంతో లాభదాయకము.







లిప్టన్స్
అంటే మంచి టీ

# ఏది సత్యం?..

కలిసి వశాళికి కనిపిస్తే ఆ అసహ్యారం కూడా లేకుండా పోతుంది.'

కల్యాణి లేవబోయింది. సుమిత్ర లేవ నియ్యలేదు.

'ఉండు. రిక్షా పిలుస్తాను. రిక్షాలో వెళ్ళువుగాని...' సుమిత్ర రిక్షా పిలవ టానికి వీధిలో కెళ్ళింది. కల్యాణి లేచి ఒక్కసారి యూవగా ఇల్లంతా కలయతిరి గింది.

తనూ వశాళీ కబుర్లు చెప్పుకున్న ముందు వరండా — తనూ వశాళీ ఒకే కంచంలో అన్నం తిన్న వంటిల్లు— తనూ వశాళీ చదరంగం ఆడుకున్న చిన్న పెరడు— తన పడకగది—తన సర్వస్వమూ—తన జీవితానందమంతా పలుమూలలూ దాచు కున్న ఆ గది-కొంచెం రోజాలే ఆ గదిలో గడిపింది. కానీ, పొందిన ఆనందం మాత్రం కొంచెంకాదు. జన్మ జన్మలకూ సరిపడేది. ఆ అనుభవాలే జీవచ్ఛవంలాంటి తనలో జీవాన్ని నింపుతున్నాయి.

పడకమీద ఏదో పెయింటింగ్ పడి వుంది.

ఆత్రంగా తీసి చూసింది.

ఒక స్త్రీ—ఒక పురుషుడు — ఒకరి నొకరు ఆర్తితో పిలుచుకొంటున్నారు — వాళ్ళ మధ్య ఎర్రని భయంకరమైన జ్వాలలు—ఆ స్త్రీ మూర్తి చుట్టూ విష సర్పాలు—ఆ పురుషుని ఏవో ముళ్ళతీగెలు బంధించేసాయి—

ఆశ్చర్యపోతూ ఆ చిత్రాన్ని మళ్ళీ చూచింది కల్యాణి. వశాళి బొమ్మలు గీస్తాడని తెలుసు. కానీ, ఇంత బాగా గీస్తాడని తెలీదు—ఆ స్త్రీమూర్తిలో తన పోలిక లున్నాయి. పురుషుడు వశాళిలాగే ఉన్నాడు.

కల్యాణి పొంగిపోయింది. ఒక్కసారిగా వెయ్యి ఏనుగులబలం వచ్చినట్లయింది.

మధ్యన మంటలు మండనియ్యగాక! ముళ్ళతీగెలతో బంధింపబడి ఉండనియ్య గాక! ఆ పురుషుడు ఆ స్త్రీని ఆర్తితో పిలుస్తూనే వున్నాడు—!!

సుమిత్ర రిక్షా తీసుకొచ్చింది. కల్యాణి రిక్షాలో కూర్చుంది.

'జాగ్రత్త సుమిత్రా! వశాళిని ఒక్క క్షణం ఒంటరిగా వదలకు—'

మరోసారి హెచ్చరించింది కల్యాణి.

* * *

విభాలున తలుపులు తెరుచుకున్నాయి. అదిరిపడ్డ వశాళి చేతుల్లోంచి స్లీపింగ్ టేబ్లెట్స్ సీసా జారిపడి ముక్కలయింది. సుమిత్ర వశాళి ముఖంలోకి సూటిగా చూసింది. వెలవెలపోయాడు వశాళి—అతని తల వాలిపోయింది.

'చివరికి ఇదా మీరు సాధిస్తున్నది?'

చీపురులో గాజుపెంకులనూ, మాత్ర లనూ ఊడ్చిపారేస్తూ తీక్షణంగా అంది.

'ఆ దెయ్యం వచ్చింది—' కసిగా అన్నాడు వశాళి.

'రావటమే కాదు—వేరే కాపురం కూడా వెలిగిస్తోంది. నన్ను చావక ఏం చెయ్య మన్నావు? ఎలా బ్రతకమన్నావు?'

పిచ్చివాడిలా రెండు చేతుల్తోనూ జుట్టు పీక్కున్నాడు గట్టిగా వశాళి.

చిరునవ్వుతో అతని చేతులనుండి విడి పించి జుట్టు సమంగా సర్దింది సుమిత్ర.

'దెయ్యం ఎవరు? నిజంగా దెయ్యమే అయితే మీరు బాధపడటం దేనికి?'

మామూలుగా అంటున్న సుమిత్రముఖం లోకి గుచ్చి చూశాడు వశాళి.

'దెయ్యమే అయితే బాధపడటం దేనికి?'

ఎందుకంది సుమిత్ర ఈ మాటలు? సుమిత్రకు తెలుసా? తెలీదా?

'నీకు తెలుసు—అంతా తెలుసు—' అన్నాడు సుమిత్ర రెండుచేతులూ గట్టిగా పట్టుకొని.

'అవును—'

'అవునా? ఏం తెలుసు నీకు? కల్యాణి ఏం చెప్పింది నీతో?'

'కల్యాణి ఏం చెప్పలేదు. నాకే తెలుసు. మీరు పట్టి పిచ్చివారని తెలుసు. అనవ సరంగా మిమ్మల్ని మీరు హింసించుకుం టున్నారని తెలుసు. అంతకంటె ఏం తెలి యాలి?'

'కల్యాణి దేవతని నాకు తెలుసు. కానీ, నాకు దెయ్యంలా కనిపిస్తోంది — ఏం చెయ్యను? నా దేవతను ప్రేమించకుండా ఉండలేను. దెయ్యాన్ని ద్వేషించకుండా ఉండలేను. భగవంతుడా నాకేది దారి?'

కుమిలిపోతున్న వశాళిని ఎలా ఓదా ర్చాలో అర్థం కాలేదు సుమిత్రకి.

ఇలాగా మూలమేమిటో తెలుసుకోవాలని అనిపించినా, ఆ స్థితిలో వున్న వనమాలిని అడగటానికి సాహసించలేక పోయింది.

రెండు చేతుల్లో ముఖాన్ని దాచుకొని మంచంమీద పడుకున్న వనమాలి చటుక్కున లేచి ఇన్నాళ్ళూ సుమిత్రకి తెలుస్తుందనే భయంతో రహస్యంగా దాచిన బ్రాందీసీసా తీసాడు. సుమిత్ర ఆ సీసా గట్టిగా పట్టుకొంది.

'నన్ను చంపి నా రక్తాన్ని త్రాగినా సహిస్తాను. కాని దీన్ని మాత్రం ముట్టుకో నియ్యను.'

'వదులు! నన్ను చావనియ్యవు, బ్రతక నియ్యవు—'

'ఉహు ! వదలను—'

'నీ యిష్టం ఏమిటి? నీ కెవరిచ్చారు నామీద ఈ అధికారం ?'

'తాను ప్రేమిస్తున్న వ్యక్తి క్షేమం కోసం స్త్రీ ఏదైనా చెయ్యగలదు. అందుకు ఎవ్వరూ ఏ అధికారాలూ ఇవ్వక్కర్లేదు.'

'నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా ?'

'అడుగుతున్నారా ? ఇంకా ఈ విషయంలో మీ కనుమానంగా వుందా?'

వనమాలి తన బ్రాందీ సీసా చేతో నెట్టేసాడు. రెండు చేతులూ జాచి 'రా ! వేగిపోతున్న నా మనసులో ఇమిడిపో !' అన్నాడు.

సుమిత్ర ఆ చేతుల్లో వాలిపోయింది.

ఊపిరాడకుండా అదుముకున్నాడు వనమాలి. ఇంకా ఇంకా అదిమేసుకుంటున్నాడు.

'మీరు కల్యాణిని వదిలేస్తున్నారా ?— నన్ను పెళ్ళి చేసుకుంటారా ?'

అస్పష్టంగా అంది సుమిత్ర.

చటుక్కున వనమాలి చేతులు జారిపోయాయి.

'పో! పో! నువ్వూ కొయ్యానివే! అవతలకు పో!' విసుగ్గా సుమిత్రను వెనక్కు నెట్టేసాడు.

తన మాటలు వనమాలిమీద యెలాంటి ప్రభావాన్ని కలిగిస్తాయో సుమిత్రకు తెలుసు—

ఒక్క నిట్టూర్పు విడిచి కళ్ళు ఒదుచుకుంది.

* * *

తలంటి పోసుకున్న జుట్టు వదులుగా జడ వేసుకుంది. తెల్లని ఎంబ్రాయిడరీ పువ్వులున్న లేత పింక్ రంగు చీర కట్టుకొని ముదురు పింక్ జాకెట్ వేసుకుంది. పచ్చని ముఖం మీద పొడిపెంట్రుకలు ఉంగరాలుంగరాలుగా ఎగురుతున్నాయి — మెరుపు తీవెల్లా మిలమిల మెరిసే కళ్ళు కాటుక రేఖలతో మరింత కళకళలాడుతున్నాయి.

ఆ కళ్ళ నిండా నిరీక్షణే!

మైథిలి నారాయణమూర్తి రాకకోసమే నిరీక్షిస్తూ నరాలన్నీ చెవులుగా చేసుకుంది.

అంతకు రెండురోజుల క్రిందటే చెప్పింది. తన పుట్టిన రోజుకి రమ్మని— తప్పకుండా వస్తానన్నాడు. ఎందుకు రాలేదు?

ఎందరెందరో వచ్చారు. ఏవేవో మాట్లాడుతున్నారు — కానీ, ఆ రోజు ఉదయం లేచింది మొదలు మైథిలి ధ్యాసంతా నారాయణమూర్తి మీదే ఉంది.

సాయంత్రం ఆరు దాటింది. సంధ్య రాత్రికెడమిస్తూ వన్నగిల్లుతోంది.



నారాయణమూర్తి రాలేదు—

పుట్టినరోజా పండగనాడు కన్నీళ్లు శుభం కాదని ఎంత నచ్చ జెప్పుకున్నా మైథిలి కళ్లు చెమ్మగిల్లి పోతున్నాయి మనసు బావురుమంటోంది ఎప్పటి నుంచో— బాధ - కోపం — అవమానం, దుఃఖం — జాలి— తనమీదే తనకు జాలి కలుగుతోంది — ఇంత వేళ మనసు ఉన్నందుకు—

ఎందుకు రాలేదో?

సాయంకాలం వేళ సాధారణంగా నారాయణమూర్తి గోదావరి గట్టు మీద కూర్చుంటాడని తెలుసు మైథిలికి—

ఇవాళ కూడానా? తను ప్రత్యేకం పిలిస్తే కూడా రాకుండా ఉండాలా?

ఒకవేళ ఒంట్లో బాగుండలేదేమో?

అయ్యో! ఛీ! ఛీ! అది కాదు — ఒంట్లో అనారోగ్యంగా ఉండడు —

[illegible] గోదావరి గట్టున కూర్చొని [illegible] తన పుట్టిన రోజు [illegible] ఏదో ఆలోచిస్తూ ఉంటాడు [illegible]

అంతా ఆలోచించి తన చిన్న తమ్ముడూ వాసుని వెంట తీసుకుని గోదావరి గట్టుకి బయల్దేరింది.

ఆ ఏకాంతస్థలాన్ని ఈ లోకంతో సంబంధం లేని వాడిలా ఏదో ఆలోచిస్తూ కూర్చుంటున్న నారాయణమూర్తిని చూడగానే మైథిలి ఒక్క క్షణం ముఖం వికసించింది, ఆనందంతో కళ్లల్లో నీళ్లు తిరిగాయి. వెనక్కి తిరిగి పారిపోదామా అనిపించింది. అంతలోనే వాసు పరుగెత్తుకుంటూ వెళ్లి నారాయణమూర్తి ఒళ్లో వాలిపోయి 'నేనూ మా అక్కా వచ్చాం' అన్నాడు—

నారాయణమూర్తి వాసు చెక్కిలి ముద్దు పెట్టుకొని 'ఇవాళ ఇలా వచ్చావేం మైథిలీ?' అన్నాడు.

మైథిలి సమాధానం చెప్పలేదు — కొంచెం ఎడంగా కూర్చొని ముఖం తిప్పుకొంది.

'మైథిలీ!'

ఎంత ప్రయత్నించినా ఆగని అశ్రువులను గబుక్కున రుమాలుతో తుడుచుకొంది మైథిలి—

# ఏది సత్యం?...

'మైథిలీ! ఏమిటది? నాకు తెలుసు! నేను రానందుకు కదూ! నువ్వు నమ్మక పోయినా నిజం చెప్తాను ఇక్కడ కూర్చున్నా నా ఆలోచనలలో నువ్వే ఉన్నావు. రాలేక పోయాను మైథిలీ! నీ పుట్టిన రోజు నాడు ఉత్త చేతులతో నిన్ను చూడలేక పోయాను. అనుకోకుండా ప్రత్యేకం నీపుట్టిన రోజు కోసం ఉంచినడబ్బుకూడా ఖర్చయిపోయింది.'

చురచుర చూసింది మైథిలి—

'ఉత్తచేతులతో రాలేక పోయానని చెప్తున్నారా! ఏం సమాధానం! మీరు వీండుమనసుతోపలికే శుభాకాంక్షలు చాలవా నాకు? అసలు మీరు కనిపించటంకంటె ఎక్కువ ఆనందం కలిగించేదుంటుందా? ఎంత కూంటికి నాకు?'

మైథిలి కోపానికి నవ్వొచ్చింది నారాయణమూర్తికి. ఆవిడ బుంగమూతి ముద్దుగా అనిపించింది.

'నువ్వెంత అమాయకురాలివి మైథిలీ!'

'అందుకే ఇలా ఆడిస్తున్నారు-'

'కాదు- అల్లాడి పోతున్నాను నీ బుంగ మూతిమీద వట్టు. నీకోసం దాచినడబ్బు పెట్టి కల్యాణిగారికి టానిక్ కొనేసాను. ఉత్తచేతులతో రాలేక, నిన్ను చూడకుండా ఉండలేక నానాయాతనా పడుతున్నాను.'

కల్యాణిపేరు వినగానే మైథిలిముఖం చటుక్కున పాలిపోయింది. అది గమనించి నారాయణమూర్తి గట్టిగా నవ్వాడు—

'పిచ్చిమైథిలీ! నేను కల్యాణిని మొదటినుండీ నా అక్కలాగే చూసు కొంటున్నాను. అదీగాక నువ్వొక్కసారి ఆవిడనెళ్లిచూడు—సాధారణ మానవమాత్రు డెవడూ వేరొకదృష్టితో ఆవిడను చూడ లేరనేది నీకే అర్థమవుతుంది.

'ఆవిడకి—ఏం జరిగింది?'

'నన్నడక్కు—నీ నోటితో నేను ఆవిడను గురించి మరోలా అనలేను. నా మనసు ఆవిడనుగురించి మరోలా ఆలోచించలేదు. నా దృష్టికి ఆమె మొదటినుంచీ ప్రేమ మూర్తిగానే కనిపించింది. మైథిలీ! ఆ విద్యావ్యవతురాలిప్పుడు దారిద్ర్యాన్నీ వంటరి తనాన్నీకోరి వరించింది. నీ కవకాశముంటే ఒకసారి వెళ్లి చూడు—నీ మనసు కరగక మానదు—'

'తప్పకుండా వెళ్తాను మీరు అక్కగా అంగీకరించాక నాకు ఎదినగారే! రేపే వెళ్తాను'

'ఆహా!...ఉత్తమ ఇల్లాలు...'

అల్లరిగా నవ్వాడు నారాయణమూర్తి. అప్పటికిగాని తాననన్నమాట అర్థం తెలీ లేదు మైథిలికి సిగ్గుపడిపోయింది.

'ఆ సిగ్గుల అరుణిమలు నీ చెక్కిళ్లలో ఇలా కలకాలం ఉండిపోవాలని ఇటువంటి అందమైన పుట్టినరోజులు నువ్వింకా చాలా చాలా జరుపుకోవాలనీ అప్పటికీ ఇంకా ఇంకా అందంగనే ఉండాలనీ మన సారా కోరుకుంటున్నాను'

'బాగున్నాయి కోరికలు!......'

ఆనందంతో అల మునకలవుతూ వయ్యారంగా వెక్కిరించింది మైథిలి.

'ఏంతోచక నీమీద ఒక గేయం రాసాను. ఇదే నీకు నా కానుక—'

తనచేతిలో కాగితాన్ని అందించాడు. సంతోషంతో చెయ్యిజాపింది మైథిలి— ఆమె మృదువైనహస్తాన్ని మృదువుగానొక్కి తనచేతిలో కాగితం ఆ చేతిలోపెట్టాడు—

'మరి, మీ చెయ్యి ఇలా అందించండి.'

'ఎందుకు?'

చెయ్యి జాపాడు—

తన రుమాలులోంచి ఒక ఆకుపచ్చ రాయి పొదిగిన ఉంగరాన్ని తీసి నారాయణ మూర్తి వేలికి తొడిగింది మైథిలి—

'ఏమిటి మైథిలీ! పుట్టినరోజున నువ్వు నాకు ప్రజెంట్ చెయ్యటమేమిటీ?'

నొచ్చుకొంటూ అన్నాడు నారాయణ మూర్తి తీసెయ్యబోయాడు—

'తీసేసారంటే నామీదవట్టే! కలకాలం మీదగ్గరుండే అదృష్టం నాకు కలుగుతుందో? కలగదో? కనీసం నా ఉంగరాన్నయినా ఉండనియ్యండి—'

మైథిలి కంఠం గద్గదమయి పోయింది.

'పిచ్చిమాటలు మాట్లాడకు—నీ చెంపలు వాయించెయ్యాలనిపిస్తోంది. చీకటి పడుతోంది. ఇంక ఇంటికెళ్లు—'

తన వేలినున్న ఉంగరాన్ని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు నారాయణమూర్తి—

మైథిలి ముఖం కందిపోయింది—లేచి వాసు వెంటరాగా మనసు వెనక్కి తిరుగు తున్నా కాళ్లను ముందుకు కదిపింది.

# ధర్మపథం
# స్వార్థంలేని త్యాగం



బులుసు వేంకటరమణయ్య

'పెడకెడు బిచ్చం వెయ్యండమ్మా' అని గుమ్మంందగ్గర నిలబడి ప్రాధేయపడిన బిచ్చగాడిని కసిరి పంపివేసినా, ఏ మహోత్సవమో, ఏ సమ్మానమో జరుపుతామని చందా పట్టీకతో వచ్చిన తగు మనుష్యులను కాదనలేక వందలకొద్దీకూడా విరాళాలిచ్చే త్యాగమూర్తులు లేకపోలేదు.

బిచ్చగాడికి బియ్యం వేస్తే తనపేరు వెల్లడి అవుతుందా? అందువల్ల వేసిన ప్రయోజనంలేదు; సమ్మానాలకూ వాటికీ విరాళాలిస్తే తనపేరు అచ్చుపడుతుంది. తన్ను అందరూ త్యాగమూర్తి అని మెచ్చుకుంటారు.

అట్టిదాతల త్యాగంలోని అంతరార్థం ఇదీ.

చేసే దానధర్మాలు ప్రతిఫలాపేక్షతో—కీర్తికోసమో, పొగడ్తకోసమో జరిగినవి ఉండడం ఉచితం కాదు. చేసే ఉత్తమకర్మ ఫలాపేక్షతో కూడి ఉండడం ఉచితంకాదని 'మాకర్మఫల హేతుర్భూః' అనే గీతా వాక్యం తెలుపుతూ ఉన్నది.

ప్రాచీనకాలంలో మహామునులు వనాల్లో ఆశ్రమాలను నిర్మించుకుని, అడవిలో దొరికే కాయకసురులవల్లా, దుంపలవల్లా దుర్బాధను నివర్తించుకుని ఘోర నియమాలతో తపస్సుచేసేవారు. వారు స్వార్థం కోసం తపస్సు చెయ్యలేదు. లోకహితమే వారిలక్ష్యం. వారు తమ తపశ్శక్తివల్ల ఏమి కావలసినా సమకూర్చుకోగలరు. అది వారి అభిమతం కాదు.

పూర్వం రాజుల పరిపాలనకు శాసనాలను తయారుచేసినవారు రాజులుగాని, మంత్రివర్గంగాని, యితర ప్రముఖ సభ్యులుకాని కారు. మహర్షులే బాగా ఆలోచించి శాసనాలను సూత్రగ్రంథాలుగా రచించి రాజుల కిస్తే, రాజులు వాటిని అమలులో పెట్టేవారు. ఆ శాసనాలను అనుసరించి పాలించడమే ప్రభువులవంతు. రాజులకు ఏమైనా ధర్మసందేహం కలిగితే వెంటనే మునుల ఆశ్రమాలకు పరుగెత్తి వెళ్ళేవారు. ఆ మునులకు అధికారవాంఛ వుంటే ఆ కోరిక క్షణంలో నెరవేరేదే! లౌకికాలతో సంబంధం లేకుండావుండి లోక వ్యవహారాల్ని సరియైన పద్ధతిలో వుంచి, తాము నిరీహులై అడవుల్లో తపస్సు చేసుకోవడమే వారిలక్ష్యం! అందువల్ల అప్పుడు ప్రజలు సుఖంగా జీవించేవారు; వారికి ప్రభువులమీద మహామునులమీదా ఎంతో భక్తి, గౌరవమూ ఉండేవి. మునుల త్యాగాన్ని చూచే, ప్రజలు కూడా అవసరమైనప్పుడు ఎట్టిత్యాగాన్ని చెయ్యడానికయినా సిద్ధపడేవారు.

ఇప్పట్లో గొప్ప దాతలమని పేరు సంపాదించ దలచే ధనవంతులు గుళ్ళూ, గోపురాలూ కట్టించేవారు, క్షేత్రాలలో ధర్మసత్రాలు కట్టించి, వాటి గోడలమీద రాతి పలకలమీద పెద్ద అక్షరాలతో తమపేరు చెక్కించుకొంటూ ఉంటారు. వారి దానధర్మాలను పెద్దలు సభల్లో ఘనంగా మెచ్చుకుని మాట్లాడతారు. పత్రికలు వారినిగురించి ప్రశంసా వాక్యాలను ప్రకటిస్తాయి: అయితే—వారి కర్మాగారాల్లోగాని, కార్యాలయాల్లోగాని, భవనాల్లోగాని పనిచేసేవారిపట్ల అందులో శతాంశమైనా ఔదార్యం చూపడం చాలా అరుదు. సేవకులు వార్ని మనస్సులోనే తిట్టుకుంటారుగాని బయటికి పొక్కరు! అందువల్ల ఆ సంగతి యెవ్వరికీ తెలియదు.

దానధర్మాల వెనక స్వార్థం అనేది ఉండకూడదు. ఉంటే, వాటి ప్రయోజనం ఉండదు.

మనం ఇట్టివాటికి దాసులం కాకూడదు. స్వార్థాలకు దాసులమయితే అందరికీ మనం దాసులమైపోతాము. స్వార్థాన్ని విడిచిపెడితే అందరూ మనకు దాసులు కాగలరు.

స్వార్థంలేని త్యాగమే మహత్తరమైనది!





# అతిథి

కాశీనాధని కాశీనాధ

శ్రీ మహారాజశ్రీ రఘురామయ్యగారికి,

వరంధామయ్య వ్రాయునది.

మీరు మా సమాధానం కోసం ఎదురుచూస్తూ వుంటారని నాకు తెలుసు. అయితే మీరు చేసిన మోసం గ్రహించామని మాత్రం మీకు తెలియదు. వెయ్యి అబద్ధాలాడైనా ఒక పెళ్ళి చెయ్యాలన్న సామెతను మీరు అక్షరాలా ఆచరణలో పెడతా [illegible] ఊహించలేదు.

మోసానికి కూడ పరిమితు లుంటాయి. ఆడ పెళ్ళివార మైనంత మాత్రాన మీ అడుగులకు మడుగు లొత్తి, మీరు మా సంబంధానికి అంగీక రించడమే మహద్భాగ్యంగా భావిస్తామని మీరను [illegible]

ఆడపిల్ల పెళ్ళి చేయడం కష్టమే. అందు లోనూ మంచి సంబంధం చేయడం యింకా కష్టం. అందుకోసం ఆ తండ్రి ఎన్ని అగచాట్లైనా పడతాడు. కాని ప్రాణం యిచ్చుకోడు. మీ అబ్బాయి వివాహం అయిన సంవత్సరంలోగా పిల్ల నిచ్చిన వ్యక్తికి మరణయోగం వుందన్న విషయాన్ని మానుంచి దాచినా లోకం నుంచి దాచలేకపోయారు. కొన్ని సందర్భాలలో నిజం నిలకడ మీద కాకుండా త్వరలోనే తెలుస్తుందని గుర్తించండి.

మీరు చేసిన మోసాన్ని సమర్థించుకో నక్కర లేదు. మా సంబంధం గురించి ఆలోచించ వద్దు. నా ప్రాణాన్ని పణంగా కోరని మరో సంబంధం [illegible] కూతురికి చూసుకుంటాను. మీ సంబంధం

మీకు నమస్సు. సెలవు.

ఇట్లు,
వరంధామయ్య.

ఉత్తరం పూర్తి చేసి కవరులో పెట్టి అయి దింటి పోస్టులో పోస్టుచేసి వచ్చిన వరంధామయ్య మనస్సు సంతృప్తిగా వుంది. ఎంతో గొప్ప ఆపదలో నుంచి తప్పుకున్న ఆనందం ఆయన ముఖంలో స్పష్టంగా కనిపిస్తుంది.

ఒళ్ళంతా బరువుగా అనిపించి కుర్చీలో కూర్చుండి పోయాడు వరంధామయ్య. ఆడపిల్ల పెళ్ళి కుదిర్చిన ఏ తండ్రి అయినా యెంత సంతోషంగా వుంటాడో అంతకంటే సంతోషంగా వున్నాడు ఆయన నిన్నటిదాకా. కలిగిన సంబంధం. పిల్ల వాడు బాగా చదువుకున్నవాడు. అందమైనవాడు. మంచి ఉద్యోగంలో వున్నాడు. ఈ సంబంధాన్ని గురించి తను ఎంతో సంబరపడ్డాడు. ఈ సంబం ధం కుదిరిందని మగ పెళ్ళివారు ఒప్పుకొన్నారని తెలిసిన రోజున తను ఈ ప్రపంచాన్ని జయించి నంత సంబర పడ్డాడు. తను కలిగినవాడు కాక పోవడంవల్ల, పిల్ల అందచందాలను చూసి పెళ్ళి వారు ఏ బెట్టు చెయ్యకుండానే పదిమెట్లు దిగి రావటం, తనకు మొదట్లో ఆశ్చర్యం కలిగించినా, ఆనందం దాన్ని వెంటనే కప్పేసింది.

తను మొదట్లో కూతురి పెళ్ళి చెయ్యలేకపోతా నేమోనని భయపడ్డాడు. కారణం కట్నం యిచ్చు కోవడంలో అందరికీ వుండేబాధ, అశక్తత తనక

కుదిరితే విష్ణువగా వుండటమే. తను ఎంత బీద వాడైనా, అన్ని విధాల మంచి సంబంధం కావాలను కోవడం పరంధామయ్యకి దురాశగా తోచలేదు.

ప్రపంచంలో తను పుట్టిపెరిగిన తర్వాత తనకి కలిగిన ఒకేఒక అదృష్టం ఈ సంబంధం అని పరంధామయ్య మొదట అనుకొన్నాడు. అయితే అసలు అదృష్టం యిది కాదని, అదృష్టం అంతా యీ సంబంధం కుదరటంలోకాక తప్పిపోవడంలోనే వుందని తనకి తెలిసిన రోజున భయపడ్డాడు.

తనకి ఆ విషయం కొంచెం ఆలస్యంగా తెలిసి వుంటే? జోగయ్య తనకి దైవికంగా తటస్థపడకుండా వుండి వుంటే? జరిగి పెళ్లిని ఏడగొట్టకూడదని, ఆ విషయం జోగయ్య తనకి చెప్పకుండా వుండి వుంటే? ఏం జరిగి వుండేది? ఊహించడానికే భయం వేస్తుంది. సుశీల వివాహ వేదికలోకి ప్రవేశించిన క్షణం తను బలిపీఠం మీద అడుగు పెట్టిన క్షణం అయ్యేది. ఆమె మెడలో మంగళ సూత్రం పడిన క్షణం, తన మెడలో ఉరితాడు బిగిసే క్షణం అయ్యేది. ఆపత్సమయాలలో భగవంతుడు అవతారమెత్తుతాడన్న తన నమ్మకం ఎలాంటిదైనా, యీ సంబంధాన్ని గురించిన లోపాలు చెప్పి పెళ్లి తప్పించిన జోగయ్యలో భగవంతుడిని చూశాడు ఆయన.

జోగయ్య తనకి ఆప్త మిత్రుడు కాకపోయినా, కనీస పరిచయం గలవ్యక్తి. అయితే ఈ సంఘటనతో పరిచయం స్నేహంగా మారి గట్టిపడింది.

* * *

పరంధామయ్య కుర్చీలో అలా చాలాసేపు కూర్చుండిపోయాడు. ఒక ఐదు నిమిషాలపాటు నిద్ర పట్టింది. లేచి బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు. దాహం వేసింది. నీళ్లు తెమ్మని భార్యని పిలవబోయాడు గాని, ఆమె యింట్లో లేదని గుర్తుకు వచ్చింది. రాబోయే పెళ్లికోసం చీరలు తెచ్చుకోవడానికి వెళ్లింది. పెళ్లి రద్దు అయిందని తెలియదు పాపం. రాగానే చెప్పాలి. చెపితే నిరాశ, ఆనందం రెండూ కలుగుతాయి. నిజమే పెళ్లి తప్పిపోయినందుకు బాధ పడాలా, ప్రమాదం తప్పినందుకు సంతోషించాలా? చీకటి పడుతోంది. గదిలో దీపం వెలిగించాడు.

గదిలో పెట్టె సగం సర్ది వుంది. సాయంత్రం ప్రయాణం పెట్టుకున్నాడు తిరుపతికి. ఈ పెళ్లి కుదిరితే ఆ దేవుణ్ణి దర్శిద్దామనుకొన్నాడు. అదే యీ ప్రయాణం ఇప్పుడు..... ఇప్పుడు ఈ పెళ్లి తప్పించినందుకు దర్శించాలి.

మంచినీళ్లు తనే పోసుకుని తాగాడు. తాగుతుంటే తలుపు చప్పుడు వినిపించింది.

లక్ష్మమ్మ చాల సంబరంగా వచ్చింది. మూడు చీరలున్న పేకెట్ చేతిలో వుంది. చీరలు వుత్సాహంగా చూపించింది భర్తకి. పరంధామయ్య ముభావంగానే చూశాడు వాటిని.

'ఏమిటలా ఉన్నారు?' అంది.

'చెబుతాను. అమ్మాయి ఎక్కడుంది?'

'వాళ్ల స్నేహితురాలింటికి వెళ్లింది'

ఒక క్షణం ఆగి 'మనం చాల మోసపోయాము' అన్నాడు.

'ఏమిటి?' అంది ఆదుర్దాగా.

'ఏముంది. నేను ఆహుతి అయిపోయి వుండే వాడిని. పెళ్లికొడుకు పెళ్లి అయిన సంవత్సరములో పిల్లనిచ్చిన వ్యక్తి చచ్చిపోతాడట.'

'ఏలా తెలిసింది? ఎవరు చెప్పారు?' అంది లక్ష్మమ్మ నీరసంగా.

'ఎవరు చెపితేనేం?' జరిగిందిదీ.

'మరయితే వాళ్లు ఇవాళ ఉత్తరం రాయమన్నారుగా లగ్నం నిశ్చయించి.'

'ఉత్తరం రాశాను. లగ్నం నిశ్చయించి కాదు, ఈ పెళ్లి అక్కరలేదని.'

ఇద్దరూ ఏమీ మాట్లాడలేక పోయారు చాలా సేపు. పరంధామయ్య చుట్ట తీసి వెలిగించాడు. 'చూశావా! ఎంతటో ప్రమాదం జరిగి ఉండేది! ఆ జోగయ్య నిజం చెప్పకపోతే ఏమి జరిగిఉండేదో.'

లక్ష్మమ్మ చటుక్కున భర్తవైపు తిరిగింది.

'ఎవరూ, జోగయ్యా మీకు చెప్పింది?'

'అవునూ, జోగయ్యే. నీకు తెలుసా?'

'శివాలయం వీధిలో వుంటాడు. ఆయనేనా?'

'ఆయనే, ఏం?'

'అయితే అబద్ధం, ఆయన చెప్పిన దంతా అబద్ధం. ఆయన అలాంటి మనిషి. ఇలాగే శివరామయ్య గారికీ చెప్పాడట. వాళ్లు మానుకున్న సంబంధమే తన కూతురికి చేసుకొన్నాడు. ఆయనకి అంతా ఆడపిల్లలే.'

పరంధామయ్య కంగారుగా లేచాడు.

'నిజమేనా నీవు చెప్పింది? ఎలా తెలుసు నీకు?'

'శివరామయ్య గారిభార్య చెప్పింది. ఇప్పుడే వెళ్లి కనుక్కోండి.'

కండువా భుజంమీద వేసుకుని వీధిలోకి వెళ్లి పోయాడు ఆయన. గంటలో తిరిగి వచ్చాడు మొహంలో అలసట, నీరసం, పశ్చాత్తాపం.

నిజం లక్ష్మీ, జోగయ్య ఒక స్కౌండ్రల్. వాడు చెప్పినదంతా అబద్ధం. వాడిని గురించి చాల కనుక్కున్నాను. చాల నీచపు మనిషి. జాతకాలు చూడ్డం లాటివేమీ తెలియవు.

కుర్చీలో కూలబడి పోయాడు ఆయన. ఛ, ఇప్పుడేం చేయాలి. ఉత్తరం పోస్టు చేసేశాము, అన్నాడు నిస్పృహగా.

'ఏం రాశారు?'

'చాలా రాశాను. ఈ జన్మలో మా సంబంధం సంగతి ఆలోచించవద్దని రాశాను. మోసానికి కూడ పరిమితులుంటాయనీ, యింత మోసం చేస్తే సహించమనీ రాశాను. అబద్ధాలు చెప్పి పెళ్ళిళ్ళు చేయవద్దని రాశాను.'

'. . . .అంత తొందర పడకుండా ఉండాల్సింది అతి సర్వత్ర వర్జయేత్ అన్నారు.'

రఘురామయ్యగారు మాట పట్టింపు మనిషి. మాట అంటే ఖచ్చితంగా చేస్తాడు. మేనరికం చేసుకొమని ఆయన చెల్లెలు పోరుపెడుతుంటే కాదని పట్టుబట్టి మన సంబంధం ఒప్పుకున్నాడు. ఆయన మనస్సు ఒక విధంగా మారితే మళ్లీ దాన్ని మార్చలేము. ఒకసారి మనస్సు గాయపడితే దాన్ని సరి చెయ్యలేము. ఈ ఉత్తరం చదివితే ఆయన మనస్సు విరిగి పోతుంది. మనం ఇంక ఎంత చెప్పినా లాభం వుండదు. అయినా ఏ ముఖంపెట్టుకుని ప్రతిమాలగలం? అన్నాడు పరంధామయ్య.

బంగారంలాంటి సంబంధం చిన్న పొరపాటు వల్ల చెయిజారి పోయింది. కూతురి భవిష్యత్ తన అవివేకంతో పాడు చేశాడు.

లక్ష్మమ్మ బాధగా చూసింది, 'కుదరక కుదరక మంచి సంబంధం కుదిరితే, అది కాస్తా ఇలా గంగపాలయింది. ఆ వుత్తరం చూశాక వాళ్లు మనం ఇంక ఎంత చెప్పినా వినరు. మన సంబంధం యింక చచ్చినా ఒప్పుకోరు' అంది.

పరంధామయ్య గొణుక్కున్నాడు.

ఆ వుత్తరం చూశాక మన సంబంధం చచ్చినా ఒప్పుకోరు అవును. . . . . .ఆ వుత్తరం చూశాక.

పరంధామయ్య చటుక్కున లేచి కూర్చున్నాడు. ఏదో చిన్న ఆశ మొహంలో కన్పించింది.

'లక్ష్మీ నా బట్టలు పట్టు' అన్నాడు వుత్సాహంగా

'ఏమిటి?' అంది భర్తతో మాట్లాడ్తూ ఆశగా చూస్తూ.

'ఏలూరు వెళుతున్నాను.'

'ఎప్పుడు?'

'ఇప్పుడే.'

'ఎందుకు?'

మనం ఆ సంబంధం ఇంకా పోగొట్టుకోలేదు. పరిస్థితి మన చేతిలోంచి యింకా జారిపోలేదు. మన అదృష్టం బాగుంటే వుత్తరం వాళ్లు చూడరు.

లక్ష్మమ్మకి అర్థం అయింది. చకచక బట్టలు సర్దింది వుత్సాహంగా. పరిస్థితి అంతా మళ్లీ పూర్తిగా బాగుపడే అవకాశం వుంది. ఇప్పుడు జరిగినదేమీ జరక్కపోతే వుండే పరిస్థితి యిప్పుడూ వచ్చే అవకాశం వుంది. తన భర్త బయలుదేరిన పని జయప్రదంగా జరగాలి. కరుగుతుంటే నమ్ముతోంది లక్ష్మమ్మ.

* * *

రాత్రి ఎనిమిది గంటలప్పుడు తలుపు తట్టాడు పరంధామయ్య. ఎవరూ అంటూ తలుపు తీశాడు సుందర్రావు. సుందర్రావు రఘురామయ్యగారి పెద్ద కొడుకు. అతని తమ్ముడే వరుడు. పరంధామయ్యకి కాబోయే లేక అయివుండే అల్లుడు. రేణుకకీ, సుందర్రావుకి పెళ్ళయి ఏడాదయింది.

'మీరా! రండి' అన్నాడు సుందర్రావు ఆశ్చర్యంగా.

పరంధామయ్య లోపలికి అడుగు పెడుతూనే నాన్నగారున్నారా? అన్నాడు.

లేరండి ఇవాళే ఊరెళ్లారు. రేపు రావచ్చు. అన్నాడు సుందర్రావు.

రేణుక కాళ్లకి నీళ్లిచ్చింది. అంతా బాగున్నారా అని అడిగింది. నిజానికి పరంధామయ్య తరుపు వాళ్లెవరో, సుందర్రావుకిగానీ, రేణుకకిగానీ, తెలియదు. ఈయన్ని కూడ ఒకసారి మాత్రమే చూశారు. ఆయన అతిథిగా వస్తారని కూడ అనుకోలేదు. పరంధామయ్యకీ, వాళ్లు రఘురామయ్య కొడుకూ కోడలుగానే తెలుసు. అంతకుమించి ఏమీ తెలియదు.

తనని చూసినప్పుడు సుందర్రావు ఆశ్చర్యపోవడం గమనించాడు. పరంధామయ్య. అవును మరి, తను వాళ్ళకి అతిథిగా వస్తాడని తను అనుకోలేదు. వాళ్ళూ ఊహించలేదు.

ఎందుకు వచ్చినదీ, ఎన్నాళ్ళుండేదీ అడుగలేదు వాళ్ళు. పరంధామయ్య కూడ కల్పించుకుని చెప్ప లేదు. రేణుక సుందర్రావులతోపాటు సుందరరావు నాయనమ్మ కూడ వుంటోంది. ముసలిది. చూపు ఆనదు. మాట సరిగా వినబడదు.

రేణుక మంచి నీళ్ళిచ్చింది. తాగి, ఇప్పుడేవస్తాను అంటూ బయలు దేరాడు.

'వంటయిపోయింది. భోజనం చేసి వెళ్ళచ్చు' అంది రేణుక.

'లేదమ్మా! భోజనం చేసే వచ్చాను అని చెప్పులు వేసుకొని బయలుదేరాడు. పనుండికాదు. కాసేపు బయట తిరగాలని.'

ఇంట్లో రేణుక సుందరరావు ఇద్దరే వున్నారు. తను రావడం వాళ్ళకి యిబ్బంది. వాళ్ళకి యిబ్బందిగా వుండటం తనకీ యిబ్బందిగానే వుంటుంది. కాని తప్పదు రేపు పదకొండింటిదాకా. రేపు పోస్ట్మన్కి ఎదురు వెళ్ళాలి. తొమ్మిదింటి నుంచి వీధిలోనే వుండాలి. ఈవీధి పోస్ట్మన్ కనిపించగానే ఈయింటి గుర్తు చెప్పి వుత్తరాలు వచ్చాయేమో అడగాలి. అప్పుడు సుందర్రావు యింట్లో వుండకూడదు. రేణుక గుమ్మంలో వుండకూడదు. సుందరరావు ఎలాగా వుండడు. ఆపీసుకి వెళ్ళి పోతాడు. రేణుక గుమ్మంలో వుండకుండా చూసుకోవాలి. ఉంటే లోపలికి పంపించెయ్యాలి.

బాగా ఆకలివేస్తోంది. ఇంట్లో ఎందుకో అన్నం తినాలనిపించలేదు నాలుగడుగులు వేస్తే విజయ విహార్ వస్తుంది.

విజయవిహార్లో కాఫీ తీసుకొని కాన్వెంట్, డి. యి. వో. ఆఫీసుమీదుగా సీవర్ బ్రిడ్జి దగ్గరకు వచ్చాడు. బ్రిడ్జి అటూ యిటూ అయిపోయినట్టే, మధ్య పోర్షన్ కడుతున్నారు. త్వరలోనే పూర్తయి పోతుంది. అక్కడనుంచి వచ్చేశాడు యింటికి తొమ్మిదిన్నరయింది.

రేణుక పక్కవేసింది. పడుకున్నాడే గాని ఎంతకీ నిద్రపట్టలేదు. అదోలా వుంది. మనసులో ఆందోళన.

పగీపదకొండు ప్రాంతంలో దుప్పటి యివ్వటానికి వచ్చాడు సుందరరావు. అప్పటికి మగతగా నిద్రపడుతోంది.

'రేపు ప్రొద్దున్న పిక్నిక్కి వెళుతున్నాము. మీరు కూడ వస్తారా?' అన్నాడు సుందరరావు.

'ఎక్కడికి ?'

'ఇక్కడికి నాలుగు మైళ్ళలో వుంది తోట. అక్కడికి వెళుతున్నాం. సాయంత్రానికల్లా వచ్చేస్తాం.'

'నేనెందుకోయ్.'

'మీరు తప్పకుండా రావాలి. పక్కింటి జానకి రామయ్యగారు కూడ వస్తున్నారు. మీకు కాలక్షేపం కూడ అవుతుంది.'

'చూద్దాంలే,' అన్నాడు ఆవలిస్తూ, సుందర్రావు వెళ్ళిపోయాడు.

[illegible] మాటలు వినిపించాయి.

# అతిథి

ఆయన ఏమన్నారు? అంటోంది రేణుక.

ఏదీ సరిగ్గా చెప్పలేదు.

అసలెందుకు వచ్చారట. . . . . అని ఆ... ఆయన నిద్రపోలేదా? అంది.

'పోయివుంటారు. ఇందాకనే ఆవలిస్తున్నారు.'

'తమ్మని గట్టిగా అడగలేకపోయారా?'

'ఎందుకు లేద్దూ. యిందాక సినిమాకి వెళదామను కున్న వాళ్ళం మానేశాం యీయన్ని పిలవాలో పిలవ కూడదో తెలియక. యీయనకి యిబ్బంది ఉవుతుం దని. నువ్వు ఎన్నియినా చెప్పు. ఈ అతిథులతో ప్రతి దానికీ యిబ్బందే.'

'ఛ. తప్పు. అలా అనకూడదు. పిలవండి ఆయన్ని రేపు పిక్నిక్కి వెళదామనుకున్నప్పుడు, ఆయన వుంటేయేం? అంది.'

మాటలు ఏవీ లేదుగాని వినపడుతున్నాయి. తన వునికి వాళ్ళకి అంత యిబ్బందిగా వుంటుందని తెలిసీకూడ వాళ్ళకి బలవంతపు అతిథిగా వుండవలసి వస్తోంది. అయినా తప్పదు తనకి.

తెల్లారి అయిదింటికి లేచారు. జానకిరామయ్య గారు లేపడానికి వచ్చేసరికే పరంధామయ్య మేలుకొని వున్నాడు. నిద్రపట్టలేదు. తప్పించుకుందామని ప్రయత్నం చేశాడు. కాని జానకిరామయ్యగారు వదిలిపెట్టలేదు అప్పుడు తనతో పరిచయం చేసు కున్న మనిషి తనని చనువులో బలవంత పెట్ట టం ఆశ్చర్యం వేసింది పరంధామయ్యకి. కొందరు మనుష్యులంతే.

లేదండీ పనులున్నాయి అని తప్పించుకోబో యాడు జానకిరామయ్యగారు వదలదలచుకోలేదు. దనులుంటే సాయంత్రం చూసుకోవచ్చు తొం దరగా నాలుగింటికే వచ్చేద్దాం ఉన్నాడు. తప్పనిసరి అయింది పరంధామయ్యకి అదీగాక వుత్తరంవచ్చినా యింట్లో ముసలామె తప్ప ఎవ్వరూ వుండరు. ఆమెకి చదవడం రాదు. చూపు ఆనదు. ఎను సాయం త్రం ముందుగా వస్తే సరిపోతుంది.

ఇంటిదగ్గర సుందరరావు నాయనమ్మను వదిలి రేణుక, సుందరరావు, పరంధామయ్య, జానకి రామయ్యగారు ఆయన కొడుకు, కోడలు, ఇద్దరు చిన్న పిల్లలు బయలు దేరారు.

జానకిరామయ్యగారితో వున్నాడన్న మాటేగాని మనసంతా యింటిమీదే వుంది. ఆయన ఏం చెబు తున్నదీ వినిపించడంలేదు. పదకొండింటికి రెండోసారి కాఫీ తాగుతున్నప్పుడు 'ఈ టైముకి ఉత్తరం వచ్చి వుంటుంది' అనుకున్నాడు ఒంటిగంటకు భోజనాలు చేశారు. ముసలామె ఉత్తరం తీసుకొని వుంటుం దేమో అనుకున్నాడు, అసలు యీవేళ వస్తుందా? పోస్టులో మిస్ అవుతుందా? లేకపోతే ఒకటి రెండు రోజులు ఆలస్యంగా వస్తుందా? అప్పుడు తనపని యింకా కష్టం అవుతుంది ఇవాళ వచ్చేస్తే ఒక రకంగా నయం. లేకపోతే తను యిక్కడ ఎన్నాళ్ళుం డాలో తెలియదు.

మీకు చదరంగం వచ్చా అన్నాడు ఆయన తన బాతాఖానీ పరంధామయ్య వినడంలేదని తెలిసి.

వచ్చు అన్నాడు పరంధామయ్య.

ఆయన దగ్గర చదరంగం బోర్డు వుంది. బల్ల పరిచి పావులు సర్ది ఆడటం మొదలుపెట్టారు. ఆయన వోపెనింగ్ పాన్ క్వీన్ ఫోర్. తనది కింగ్ ఫోర్. తనకి క్వీన్ ఫోర్ ఆడటం అంత బాగా తెలియదు. అదీగాక మనసు ఆటమీద లేదు. వరుసగా మూడు ఆటలు వోడిపోయాడు. నాలుగో ఆట వోడిపోయే పరిస్థితి వుంది.

మీకు ఆట బాగావచ్చు. కాని సరిగ్గా ఆడటం లేదు అన్నాడు ఆయన.

అప్పుడు చూశాడు ఆట పరిస్థితి. ప్రమాదం లోంచి తేరుకునేందుకు చాలాకష్టపడవలసివచ్చింది.

ఆట ఆయేసరికి నాలుగయింది. పరంధామయ్య వులిక్కిపడి లేచాడు. రేణుక, సుందర్రావు కంటే తను ముందు వుండాలి. గబగబా రేణుక దగ్గరకి వెళ్ళి నేను వస్తానమ్మా అన్నాడు.

ఉండండి మేమూ వస్తున్నాం అంది రేణుక.

జానకిరామయ్యగారు పోనియ్యలేదు. అందరు కలిసి వెళదాం అన్నారు. అదీకాక, తను ముందు వెళ్ళ డానికి వాహనం ఏదీ లేదు. అందరితోట బయలుదేరి తీరాలి. లేకపోతే, నాలుగు మైళ్ళు నడవాలి. నడిచి వాళ్ళకంటే ముందు వెళ్ళటం జరిగేపని కాదు. ఈ విష యం తను ముందే ఆలోచించలేదు.

అందరు కలిసే బయలుదేరారు. పరంధామయ్య ఒంట్లో రక్తం పరుగులు పెడుతోంది. ఒక్క అర గంటలో ఇల్లు చేరుకుంటారు. ఉత్తరం వచ్చి ఉంటుందా? వస్తే ఏం చెయ్యాలి?

ఇంటిదగ్గర సుందరరావు నాయనమ్మ తలుపు తీసింది

'ఉత్తరాలేమైనా వచ్చాయా' అన్నాడు సుందర రావు.

వచ్చింది అంది ముసలావిడ.

పరంధామయ్య ఊపిరి బిగపట్టాడు. గుండె గట్టిగా పట్టుకున్నాడు.

ఏదీ అన్నాడు సుందర్రావు.

అదిగో డ్రాయర్లో పెట్టాను అంది దక్షి ణంవైపు చూపిస్తూ.

రేణుక ఆ గదివైపు కదిలింది. ఒక్కక్షణం ఆగి పోయిన పరంధామయ్య తేరుకుని గబగబా ఆ గది వైపు అంగలు వేశాడు.

'రండి, నిలబడ్డారేం?' అంది రేణుక వింతగా చూస్తూ.

'నీళ్ళు పోసుకోవాలి. తోడులావేపోవాని. . . .'

తోడుతాను. . . . . . ఉత్తరం ఇచ్చేసి. .

ఉత్తరం తియ్యడానికివెళ్ళుతూంది. ఎలా ఆపాలి?

'ఉత్తరం నేను చూస్తానులేమ్మా! నీళ్ళ తోడూ' . . . . . . అనబోతుంటేనే రేణుక డ్రాయరు తెరిచింది.

పరంధామయ్య తలుపుకి ఆనుకున్నాడు. కళ్ళు మూసుకున్నాడు.

డ్రాయరు తెరచి కాయితాలు తియ్యడం. . . .

# ఉదయమందలి తాజాదనము గంటల కొలది వుండేలా చేసుకోండి...

దానికి కావలసినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కే! ఉదయం స్నానానంతరం పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్‌ను వొళ్ళంతా జల్లుకొంటే తాజాదనము, హాయిని గంటల కొలది వుంచుతుంది. పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ యొక్క తేలికైన పరిమళము వొంటి మీద రోజంతా నిలిచి వుంటుంది. చెమటను త్వరగా పీల్చే గుణము గల పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్ మండే ఎండలలో, ఉక్కబోసే వాతావరణములో మిమ్మలిని సేద దేర్చి, తాజాగా, హాయిగా, పరిమళంతో వుంచుతుంది. సంవత్సరమంతా అన్ని వాతావరణములలోను మీరు వాడదగినది పాండ్స్ డ్రీమ్‌ఫ్లవర్ టాల్కే!




## పాండ్స్

డ్రీమ్‌ఫ్లవర్ టాల్క్—

**ఎంతో మెత్తటి మేలు రకం టాల్క్!**

రిజిస్ట్రా. - పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్
(పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)

ట్రౌన్ పెట్టడం మళ్ళీ డ్రాయరు మూయ్యడం. మళ్లీ తెరవడం. . . . . . వినబడ్డాయి.

'ఏదండీ. కనపడదేం?' అంది రేణుక.

జరిగినది నిజమేనా? రేణుకకి వుత్తరం కనబడలేదా?

పరంధామయ్య నెమ్మదిగా కళ్ళు తెరిచి చూశాడు. రేణుక డ్రాయరులోని కాయితాలు అన్నీ వెదికి చూస్తోంది. ఉత్తరం కనబడలేదు.

సుందరరావు కూడా అక్కడికి వచ్చాడు. తనూ వెదికాడు. కనబడలేదు 'ముసలావిడకు మతిమరుపు అసలిక్కడ పెట్టిందో లేదో' అన్నాడు విసుగ్గా.

పరంధామయ్య దీర్ఘంగా నిట్టూర్పు వదిలాడు. అరంగుళందూరంలో ఉన్న ప్రమాదం కొంచెం దూరమయింది. కొంత తెరపివచ్చింది. కానీ ఈ అదృష్టం ఎంతసేపు నిలుస్తుంది?

బామ్మా! అని పిలిచాడు సుందరరావు.

ఏమిరా అని కేకవినబడింది.

'ఉత్తరం ఎక్కడ పెట్టావు. కనబడటం లేదే.'

'అక్కడే పెట్టానే ఉండువస్తున్నా' అని కేక వినిపించింది.

పరంధామయ్య గుమ్మంలోంచి పక్కకి తప్పుకున్నాడు. అక్కడ వుండలేక పోయాడు. ఉత్తరం అక్కడ పెట్టిన మనిషి వస్తోంది. ఆమెకి కూడ వుత్తరం కనిపించదనుకోవడం కేవలం భ్రమ. అదృష్టాన్ని మరీ అంత ఎక్కువగా నమ్ముకోకూడదు. వెళ్ళి దూరంగా మంచం మీద కూర్చున్నాడు. తను చెయ్యగలిగింది ఏమీలేదు.

ముసలావె పొపుగంట వెదికింది. కనబడలేదు.

'నీ కెప్పుడూ మతిమరుపే. ఏదీ గుర్తుండదు గుర్తు తెచ్చుకో ఎక్కడ పెట్టావో', అంటున్నాడు సుందరరావు విసుగ్గా.

గుర్తు తెచ్చుకోవద్దు అనుకున్నాడు పరం

# అతిథి

ధామయ్య. వయసు మీద పడితే మతిమరుపు రావడం కూడ యిందుకు మంచిది.

ఆదెంత ముఖ్యమైన ఉత్తరమో! అంటోంది రేణుక.

ముఖ్యమైన ఉత్తరమేకాని చూసేదికాదు అనుకున్నాడు. పరంధామయ్య.

ఆయన ఆ సాయంత్రం బయటకు కదులేదు. రేణుక సుందర్రావులతోపాటే వున్నాడు. వాళ్లకి ఆ ఉత్తరం సంగతి ఎప్పుడు తెలిస్తే తనకీ ఆ క్షణంలోనే తెలియాలి. వాళ్లతోనే ఉన్నాడు. వాళ్లకి యిబ్బంది అని దృష్టికి రాలేదు. ఉత్తరం, ఉత్తరం ఆదే ధ్యాస.

ముసలమ్మ చాలసేపు గొణుక్కుంది. మాయదారి మరుపు, అనుకొంది.

రాత్రి తొందరగానే పక్కమీదికి చేరాడు పరంధామయ్య. చాల అలసటగా వుంది. నిద్రవస్తోంది. కాని, నిద్రపోవడానికి వీలులేదు.

ఇవాళ రఘురామయ్యగారు రాకపోవడం ఒకవిధంగా మంచిదే. వస్తే తను ఏపని మీద వచ్చినదీ ఆయనకి చెప్పాలి. ఈవూళ్లో చాల పరపతి వున్నవాడు ఆయన. ఫలానా ఆఫీసులో పని అన్నా, కోర్టు వ్యవహారం అని చెప్పినా 'నేను ఎవరినైనా పంపి చేయిస్తాలెండి. ఏం పని?' అంటారు. ఏం పని అని చెబుతాడతను?

'ఏమిటండీ ఆయన అలా యింట్లో ఎక్కడ పడితే అక్కడకి వచ్చేస్తాడు? అంటోంది రేణుక. ఆమెకి పరంధామయ్య మీదనున్న గౌరవం తగ్గింది. గదిలోవుంటే గదిలోకి, హాలులో వుంటే హాలులోకి వస్తూ ఎక్కడ వుంటే అక్కడ వుంటున్నాడు.'

'కొందరు పెద్దవాళ్లు అంతే! చాదస్తం. అంతా ప్రేమలా కనిపిస్తుంది వాళ్లకి. అసలు అతిథులు తోస్తేనే యిబ్బంది. అందులో యిలాంటి వాళ్ళు మరీను!' అంటున్నాడు సుందరరావు.

విని వూరుకున్నాడు పరంధామయ్య. తనకి వినబడుతోందని వాళ్ళు అనుకొని వుండరు.

'సరే, ఇవాళ ఆయన మంచం పక్కనే మీ మంచం వేస్తాను. రాత్రి మంచినీళ్లు కావాలన్నా, ఇంకేం కావాలన్నా చూడండి ' అంది.

'నాకు నిద్రబాగా వస్తోంది. మెలకువరాదు.'

'బాబ్బాబు. ఈ ఒక్కరోజుకే. . . . .' అంది రేణుక లాలనగా. సరేనన్నాడు సుందర్రావు.

పడుకోబోయేముందు 'బామ్మా, వుత్తరం ఎక్కడపెట్టావో గుర్తుకు వచ్చిందా' అన్నాడు.

'లేదురా?' అంది. ఇందాకటలా తిట్టకపోయేసరికి ఆమెకి కొంచెం మనసు కుదుటపడింది. స్థిమితంగా ఆలోచించింది.

'గుర్తువచ్చిందిరా అబ్బాయ్' అంది పది నిమిషాల తర్వాత.

ఆతను లేవలేదు. మెలకువ రాలేదు. కాని మళ్ళీ పిలుస్తుందేమో. ఈ మాటు లేస్తాడేమో.

'అబ్బాయి నిద్రపోయాడు. మెల్లగా మాట్లాడండి. అన్నాడు పరంధామయ్య. ఆమె దగ్గరకి వెళ్లి.

'ఎవరూ?' అంది ముసలామె గట్టిగా చూపు ఆనక, మాట వినబడక.

'నేనేలెండి పరంధామయ్యని. ఉత్తరం ఎక్కడ పెట్టారు?' అన్నాడు. నవనాడులు బిగుసుకున్నాయి.

'డ్రాయర్లో పెట్టాననుకున్నాను. లేదు. అలమారులో పెట్టాను' అంది ముసలామె పెద్దగా.

ఏమిటే గోల అంటూ లేచాడు సుందరరావు.

'ఏంలేదు. ఒంట్లో బాగున్నట్లు లేదు. నువ్వు పడుకో' అన్నాడు పరంధామయ్య కంగారుగా సర్దేస్తూ.

'మీరు లేచారేం? ఏమైనా కావాలా?' అన్నాడు సుందర్రావు నిద్ర మత్తులోనే.

'లేదు. నిద్ర పట్టక.'

'వినరమంటూరా,'

'వద్దు నిద్ర పడుతుంది. నువ్వు పడుకో' సుందర్రావు పడుకోలేదు. రేణుక మరి మరీ చెప్పింది ఆయనకి కావలసినవన్నీ చూడమని.

'లేదు లెండి. నిద్ర రావడంలేదు' అన్నాడు. తప్పలేదు. పరంధామయ్య వెళ్లి మంచం మీద పడుకున్నాడు. సుందరరావు పడుకునే దాకా తను పడుకోక తప్పదు.

ఇంట్లో అలమారలో వుంది. ఇల్లు తాళం వేసి వుంది. తాళం అతని తలగడ క్రింద వుంది. తాళం తీసుకోవాలంటే ఏదో కారణం చెప్పాలి.

'తాళం వుందా? అన్నాడు.'

'ఏం కావాలి?'

'మాత్ర వేసుకోవాలి.'

సుందరరావు తాళం తీసుకుని లేచాడు 'ఇస్తాండుకులే వేసు తీసుకుంటా' అన్నాడు పర



భాషయ్య. మంచి నీళ్లివ్వాలిగా అంటూ తాళం తీసి వంటింట్లోంచి మంచినీళ్లు తెచ్చి యిచ్చాడు సుందర్రావు.

జేబులోంచి సారిడాన్ మాత్ర తీసి వేసుకొన్నాడు. తలనొప్పి వస్తోందని దగ్గర పెట్టుకున్నాడు అది ఇంక అక్కడ వుండటానికి అవకాశం లేకపోయింది.

మళ్లీ వచ్చి పడుకున్నాడు. క్రితం రాత్రి నిద్ర లేకపోవడం వల్ల నిద్ర బాగా వస్తోంది. కాని నిద్ర పోకూడదు.

అరగంట తర్వాత లేచాడు. ఈమాటు సుందరరావు లేవలేదు. నెమ్మదిగా తాళాలు తీసుకున్నాడు, అలని తలగడ క్రింద నుంచి. తాళం తీసుకొని లోపలికి వెళ్లాడు. అలమార తలుపు తీసి వెతికాడు.

తను రాసిన కవరు చాల సులభంగా గుర్తు పట్టగలిగాడు. అది తీసుకుంటున్నప్పుడు చేతులు వణికాయి.

తాళం వేసి అది సుందరరావు తలగడ క్రింద. పెడుతోంటే సుందరరావు లేచాడు.

'ఏమన్నా కావాలా?'

'ఏంలేదు. కడుపునొప్పిగా వుంటేనూ...'

'సోడా తెమ్మంటారా..'

'వద్దు. తగ్గిపోయిందిలే' అన్నాడు.

రెండు రాత్రులు నిద్ర లేదేమో వళ్లు మరచి నిద్రపోయాడు.

మర్నాడు ఎనిమిదింటికి నిద్ర లేచాడు. మనసు ప్రశాంతంగా వుంది. ఆదుర్దా, ఆందోళనా, టెన్షన్ యివేమీ లేవు యిప్పుడు.

ముసలావిడ కవరు కోసం వెతకడం, సుందరరావు ఆవిడ మీద విసుక్కోవడం గమనించాడు...

'పోనీ లేవోయ్. ముసలావిడ కదా మరచిపోయి వుంటుంది!' అన్నాడు.

సుందరరావు ఆతర్వాత ఆమె నేమీ అనలేదు. కాసేపాగి నేను పదకొండు గంటల బండికి వెళ్లిపోతున్నాను అన్నాడు.

'అదేమిటి నాన్నగారు వచ్చేదాకా వుండరా?'

'వచ్చేటట్లు లేరు.'

'లేదు. ఆయన స్నేహితుడితో బెజవాడ వెళ్లారు. ఇవాళ వస్తారు, పోనీ ఆయనతో ఏమైనా చెప్పాలా?'

'చెప్పేది ఏమీలేదు.'

బయలుదేరుతూంటే వచ్చారు రఘురామయ్య గారు. వస్తూనే 'ఎప్పుడు వచ్చారు' అన్నాడాయన కంగారుగా.

'మొన్నరాత్రి.'

కొంచెం స్థిమిత పడ్డాడాయన. మొహంలో ఆనందం కనిపించింది.

'ఉంటారా రెండు రోజులు?'

'లేదు. పదకొండు గంటల బండికి వెళ్లిపోతున్నాను.'

'అయితే నేనూ వస్తాలెండి. పనుంది మీతో' అన్నాడాయన.

లోలోపలే విసుక్కున్నాడు పరంధామయ్య. ఈయనకి యిప్పుడే పని తగలాలా? తను యింటికి వెళ్లగానే తిరుపతి ప్రయాణం పెట్టింది. భార్య అన్నీ సర్ది ప్రయాణానికి సిద్ధంగా వుంటుంది. ఈయన వస్తే మరో రెండు రోజులైనా వుంటాడు. ప్రయాణం వాయిదా పడుతుంది. తనకీ యిబ్బంది.

పరంధామయ్యతో బాటే బయలుదేరాడు ఆయన. ప్రయాణం అంతా ఆయన యేదో కల్పించుకుని మాట్లాడుతూనే వున్నాడు. అంత చనువుగా, అంత కలుపుగోరుగా ఆయన మాట్లాడటం కొత్తగానే వుంది పరంధామయ్యకి. పిల్లలు, సంబంధాలు, పెళ్లిళ్లు, పీటల మీద పెళ్లిళ్లు చెడిపోవటం ఇవన్నీ మాట్లాడాడు. కుదిరిన పెళ్లి ఏ సందర్భములోను మానుకోకూడదు, అన్నాడు అసందర్భంలోనే. అప్పుడే కొంచెం అనుమానం వచ్చింది పరంధామయ్యకి తన సంగతి తెలిసిందేమోనని. కాని, తెలిసి వుండటానికి వీల్లేదు.

మాట పట్టింపుల కోసం పెళ్లిళ్లు చెడిపోయిన సందర్భాలు చాల చెప్పాడు ఆయన. స్నేహాలు బంధుత్వాలు కలసిన తర్వాత చిన్నచిన్న విషయాలు వాళ్ల మధ్య స్పర్థలు తేకూడదు. పొరబాటున ఎవరైనా మాట జారినా రెండో వాళ్లు పట్టించుకోకూడదు అన్నాడు. సందర్భం కల్పించుకుని చెప్పినట్లుగా వుంది. తను వుత్తరం రాసిన సంగతి తెలిసిందా? అది తను చూసివున్నా ఏమీ అనుకొని వుండేవాడిని కాను అని చెబుతున్నాడా? ఏమీ అర్థం కాలేదు. అర్థం మాట అటుంచి అసలు విసుగ్గా, చిరాగ్గా వుంది. ఈ తప్పనిసరి అతిథితో.

ఇంటికి వెళ్లిన తర్వాత కూడ తనతో పాటే వున్నాడాయన. తన భార్యతో కూడ రెండు నిమిషాలు మాట్లాడుకోవడానికి అవకాశం రాలేదు.

భోజనాలయిన తర్వాత ఆయన నిద్ర పోలేదు. ఊళ్లో పని వుందన్న మనిషి, ఆ పని చూసుకోవడానికి వెళ్లలేదు.

మధ్యాహ్నం లక్ష్మమ్మ అన్నట్లు మర్చేపోయాను. మీకో వుత్తరం వచ్చింది అంది.

ఎక్కడ నుంచి?

ఏమో నేను చూడలేదు. కవరొచ్చింది. లక్ష్మమ్మ కవరు ఇస్తోంటే పరంధామయ్యతో పాటు రఘురామయ్య కూడ లేచి కూర్చున్నాడు.

ఉత్తరం రఘురామయ్య దగ్గర నుంచి.: పరంధామయ్య ఆయన కేసి చూశాడు. మొహంలో ఆదుర్దా, ఆందోళనా, కంగారు.

చటుక్కున స్ఫురించింది అదేనా కారణం? అందుకే అయి వుంటుందా ఇదంతా?

లక్ష్మమ్మని మంచినీళ్లకని ఇంట్లోకి పంపాడు.

'మీకు జోగయ్య తెలుసా?' అన్నాడు నవ్వి. రఘురామయ్య ఆశ్చర్యంగా చూసి, తెలుసునన్నట్లుగా తల ఊపాడు.

'మిమ్మల్ని ఈమధ్య కలుసుకున్నాడా?'

రఘురామయ్య తల దించుకొని తల ఊపాడు.

'ఫరవాలేదు లెండి. పొరబాట్లు ఎవరికయినా వస్తాయి' అంటూ లక్ష్మమ్మ యిచ్చిన కవరుని చదవకుండానే ఇచ్చేశాడు పరంధామయ్య.

---

# రచయితలకూ మనవి

## కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాతప్రతులని తిప్పి పంపకోరే రచయితలు వ్రాతప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

## నవలలు

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 ఆరఠావు పేజీల సయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

## కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమంలో ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

*సంపాదకుడు*

*ఆంధ్ర సచిత్ర వారపత్రిక*

# వారఫలం

## 2-5-1969 శుక్రవారం మొదలు 8-5-1969 గురువారం వరకు

**మేషం:** వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది విలాస వస్తువులు కొంటారు

**వృషభం** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు రావలసిన డబ్బు సమయానికి అందుతుంది వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది

స్త్రీలకు - ఆరోగ్యం బాగా ఉండదు బంధుమిత్రులను కల్సుకొంటారు

**మిథునం:** వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. వారం ఆఖరులో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరాల కోసం వ్యయం చేస్తారు.

**కర్కాటకం** వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**సింహం** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారంమధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు

స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**కన్య:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించ గలవు. సాహసముతో కూడిన వ్యవహారాలు [illegible] ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు — సంతోషకరమైన వార్తలు వింటారు. బంధువులకు సహాయం చేస్తారు.

**తుల** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలించ గలవు మిత్రులకు సహాయం చేస్తారు

స్త్రీలకు.— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి పుణ్యకార్యాలు చేస్తారు

**వృశ్చికం** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించ గలదు అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉంటుంది అలంకార వస్తువులు కొంటారు

**ధనుస్సు** కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది వృత్తిలో ఆదాయం పెరుగుతుంది రావలసిన డబ్బు సమయానికి అందుతుంది

స్త్రీలకు — అధిక వ్యయం జరుగుతుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి.

**మకరం** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది వారం ఆఖరులో తిరిగి అనుకూలత లభిస్తుంది

స్త్రీలకు — ఆరోగ్యం బాగా ఉండదు నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం** అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించ గలదు. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం ఆఖరులో అనుకోని చికాకులకు గురి కాగలరు.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది

**మీనం:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం ఆఖరులో లాభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. [illegible]

—[illegible]




ప్రశస్తిగాంచిన పాటలి పురములో
చరిత్రకెక్కని సమయ మందున
గుండు గొరిగినా గుణాలు మారని
బైరాగొక్కడు బ్రదుకు చునుండె.

అన్నం సున్నం సర్వంబొకటే
అయితే అన్నం బహు మంచిదంటూ
అన్నం స్వర్గం ఐశ్వర్యాలకు
ప్రాపులాడెడి బైరాగివాడు

పాటల్ బాడుచు పేటల్ దిరుగుచు
హరికీర్తనంబు విరివిగ జేయుచు
పురుషార్థంబును ప్రజలకు జెప్పుచు
దినములనాతడు గడుపుచుండెను.

విచ్చటబడితె అచ్చట దినుచును
ఏ చోటంటే అచ్చట త్రాగుచు
తింటూ త్రాగుచు దినములు తోస్తూ
సన్యాసుండెను సన్యాసిపలెను.

అతనికివుండే ఆస్తిపాస్తులు
ఎంచ బోతెను గోచిపాతలు
రెండే అతనికి వున్నాయండీ
అవ్వే అతనికి సర్వస్వంబు.

ఒక్కటి కట్టితె మరొక్కదాన్ని
చక్కగ వుతుకుచు ముక్కువగ దాచుతు
ఉంటూ వుండగ అంతట వానికి
కన్నులగట్టెను కష్టం బొక్కటి.

ఉతికి దాచిన గోచిపాతను
ఎలకొక్కటి కొరకగనతడూ
గోచిని దాచే ఆలోచనమూ
ఇవ్విధంబుగా చేశాడప్పుడు.

ఎలుకలు కొరకక కౌపీనంబును
రక్షించుటకు మార్గంబతనికి
చక్కటిపిల్లిని సాకుటకంటె
వేరే లేదని బుర్రకు తోచెను.

అయితే అతని ఆపద గాచెడి
మూషికవైరిని పోషించుటకో
పాలనుయిచ్చే పాడియావును
తెస్తేనేమరి తీరును కష్టం.

అప్పటి కూడ అతనికి సౌఖ్యం
వస్తుందనియెడి ధైర్యంలేదూ
గోవును మేపే గోపాలుండూ
కుదిరేవరకు కష్టంబోదు.

మున్నాముబాపే గోపాలునికి
ప్రతిదినంబును పూటపూటకు
అన్నమువండి అతనికి బెట్టను
గృహలక్ష్మి తనకు కావలసివచ్చె.

ఇవ్విధంబుగా అంతములేని
వానర శేష్టని వాలంబాగును
ఒకటికి మరియొక్క టవసరమూ
కనబడె వానికి తలచేకొంటు.

ఎట్టకేలకతడేలాగైనా
కౌపీనంబును కాపాడుటకై
బైరాగప్పుడు పరిణయమాడను
నిశ్చయించెను సైంధైర్యం వీడక

అందుచె బైరాగవతికోసమ్మై
గ్రామంగ్రామం కడవ కడపనూ
తిరిగితిరిగి మనిషి--మనిషికీ
విన్నవించెను దైన్యంబంతా.

ఓహో! బైరాగీ ఆహా వైరాగ్యం!
అంటూ జనాలు అల్లరిజేసినా
పట్టువిడువక గుట్టును జెప్పుచు
చివరికో ఆశ్రమం చేరాడండి.

అతలుపండి కోరిక తీరిన
ఆశ్రమవాసిని సన్యాసొక్కతె
అతని విషయం సర్వంబెరిగి
తీర్చెదవనెను బైరాగికష్టం.

గంతకు తగిన బొంత దొరికెనని
సంతోషంతో సన్యాసప్పుడు
కౌపీనంబును గాపాడుటకై
తాళియయ్యెనా బైరాగప్పుడు.

# వెలుగు నీడలు



యలమంచిలి ఝాన్సీలక్ష్మి

సీరియల్

## 2

ఆ మధ్యాహ్నం తిరగగానే జ్వరం ఎక్కువగా వచ్చింది. డాక్టరికి ఫోను చేశాడత డాతురతతో. 'కంగారు పడవద్దు అవే మందులు వాడండి. టెంపరేచరు తగ్గిపోతుంది కొంతసేపటి'కని డాక్టరు తిరిగి ఫోనులో చెప్పాడు.

సాయంత్రానికి కొంచెంగా మాట్లాడ గలిగిందనుపమ 'మీ కెంతో శ్రమ కలిగిస్తున్నాను' అన్నది.

'కాదు కాదు. పరిచర్యలో వున్న ఆనందాన్ని రుచి చూపించావనుపమా! అందుకేనేమో మీ ఆడవాళ్ళకంత మక్కువ సేవ చేయడమంటే' అన్నాడతడు మృదువుగా నవ్వుతూ.

మూడవ రోజుగ్గాని టెంపరేచరు పూర్తిగా తగ్గలేదు ఆ నాటి సంధ్యా సమయాన పడక్కుర్చీ ఒకటి తెప్పించి వసారాలో వేయించాడనుపమ కోసమని.

తా నెదురుగా వున్న బల్లపై కూర్చుంటూ అన్నాడు.

'మీ నాన్నగారుంటే ఎంత కంగారు పడేవారో?'

'మీరు మాత్రం ఏం తక్కువ తిన్నారో? అంతకన్నా ఎక్కువే హడావిడి చేశారుగా?' అన్నదామె.

అతడు సమాధానం చెప్తూండగానే మధ్యలోనే అన్నది తిరిగి.

'ఒకందుకు మాత్రం నాకెంతో బావుంది. పసిపాపలా లాలించారే మూడు రోజులూ నన్ను. జ్వరం యింకా వుండాలనే అనిపిస్తోంది నాకందుకే.'

'ఛా! అదేం కోరిక! అనూ!' మందలించాడతడు వెంటనే.

'మీ రిలా 'అనూ!' అనగానే బావ జ్ఞాపకొస్తున్నాడు — అచ్చు యిలాగే పిలుస్తాడు' అన్న దామె అతని ముఖభంగిమలను గమనించుతూ.

'ఇపు డెక్కడున్నారాయన?'

'డాక్టరు కోర్సు చదువుతున్నాడు ఇంగ్లండులో, పూర్తయిందట ఓ నెల రోజుల్లో వస్తున్నానని వ్రాశాడు నాన్న గారికి.'

అత డాపైన కుతూహలం ప్రదర్శించనే లేదు సంభాషణకు.

కానీ అతని కనులలో ఎంత వెదికినా అసూయ అన్న భావమే మెదిలినట్లు లేదు. ఎప్పటిలా విరిసిన పూవులా నిర్మలంగానే ఉంది.

ఆ నిర్వికారతను చూసి అనుపమ హృదయాన ఓ మూల నిరుత్సాహం కెరటంలా లేచిపడింది.

అందుకే నిట్టూరుస్తూ అన్నదామె ఓ నిమిషం ఆగి.

'ఉన్నట్లుండి గంభీరంగా మారిపోతారేమిటి మీరు ఒక్కొక్కసారి?'

ఆమె కనులలోకి సూటిగా చూశాడు క్షణమాత్రం.

'కారణం యిపుడు చెప్పలేను అనుపమా! కాని ఎప్పుడో ఒకప్పుడు తప్పక నీకు మాత్రమే చెబుతాను' అన్నా డతడు చివరి మాటల్ని ఒత్తి పలుకుతూ

అతని కంఠాన ధ్వనించిన ఆత్మీయత ఆమెను కదిలించివేసింది.

'బాధ్యగాన్ని మనుష్యగాని హృదయాన

తాచుకున్నంతకాలం ఆత్మీయమైన మనస్సుకి వెలిగే మమతను అందుకోలేం — దూరం పెరుగుతుంది. మ న సు కూ—మనసుకూ మధ్యనున్న మమతల వంతెన కూలిపోతుంది కొన్నాళ్ళకి' అన్నదామె అతని మనస్సును మరింత ఆత్మీయంగా కదిలించుతూ.

ఏవో భావాలు అతని కంఠాన పైకీ క్రిందికీ మ దు గు న దా గి న చేపల్లా కొట్లాడుకున్నాయి కొంతసేపు. కనులలో కన్నీటి కెరటం విరుచుకుపడబోయి చటుక్కున వెనుదిరిగిందది నిగ్రహించుకుని.

'కాదనలేను అనుపమా! నీ వాదన!' అంటూ మరేమో చె ప్ప బో యి ఆగిపోయాడు ఎవరో రావడంమూలాన.

అతని హృదయాన రగులుతూన్న అగ్ని పర్వతాన్ని వెలికి దీయించి సాధ్యమైనంత వరకు హాయినందించాలనుకున్న అనుపమ మనసున ఆతురత ఆ మూతనవ్యక్తి రాకతో అతి ప్రయత్నం మీద అణిగిపోయిందా క్షణానికి.

'మీకు రెండు కవర్లు వచ్చాయి మధు గారూ!' అంటూ ఆ వ్యక్తి మధుమూర్తి చేతికి రెండు బరువైన కవర్ల నందించి వెళ్ళిపోయాడు.

ఆ లేఖలను చూడగానే అతని కనులలో ఓవైపున కాంతి కెరటాలూ, మరోవైపున బాధాకెరటాలూ ఉవ్వెత్తున పొంగాయి.

'ఈ జాబులే నాలో దీపాన్ని వెలిగించుతాయి! అయినా అంధకారమే అందించుతుందా దీపం' విచిత్రంగా ధ్వనించిందతని స్వరం

అతని మాటలు అర్థంగాక అలాగే చూస్తూండిపోయింది అనుపమ. తరువాత కొంతసేపటివరకు మౌనంగానే వుండిపోయారిరువురూ.

'పద! ముందు నువ్వు కొంచెం భోంచేయి! మళ్ళీ ప్రొద్దుపోయినకొలదీ అజీర్తి చేస్తుందేమో!' అన్నాడతడు లేస్తూ.

తిరిగి ఎప్పటిలా ఎదుటివారి కోసమై అనురాగాన్ని ఒలికించిన ఆతని సంయమనానికి ఆ శ్చ ర్యం తో పాటు గౌరవంకూడ యినుమడించిం దామెకు.

'మీరు కూడా భోంచేయండి. లేకపోతే నా ఒక్కర్తికే తిన బుద్ధిగాదు' అన్నదామె.

మౌనంగా తలూపాడతడు. అడ్డు చెబుతాడనుకొన్నదామె. కానీ వెంటనే



1. దేశమును శక్తివంతంగా నిర్మించే నిమిత్తం మనం శ్రేష్ఠ మహత్వాకాంక్షలు/ పరంపరాలు కలిగియే వుండవలెను.

2 అనుమానం / వివాదం విజ్ఞానమును ప్రబల అంతర్వేగమందు వుంచగలిగే సాధన

3. ప్రకృతియొక్క ప్రపంచం మానవుని కార్యాలు/స్వప్నాలు మరియు ఆకాంక్షలకు నిర్లిప్తమైయున్నది.

4 ఒక్కొక్కప్పుడు ఉజ్జ్వలకాంతిగా ఒక్కొక్కప్పుడు సౌమ్యంగానుండే ప్రకాశహీన జీవనం తన ఘనత ఆవేశాన్ని/రుచిని కోల్పోతుంది

5 ఆనందం / నిరాశ లేకుండా జీవం వుండదు

6 లక్ష్యాలు/ఆదర్శాలు రహితుడైన మనుష్యుడు కేవలం బ్రతికియుంటాడు అతనికి తన జీవితం బహుశా ఎక్కువ అసౌఖ్యకరం అనిపించకపోయినా సరే

7 అంతఃకరణయొక్క వికాసం/బలం నిగూఢ భావనలు మరియు మూల్య ప్రమాణంతో గణింపబడజాలదు

8 వైజ్ఞానిక మరియు సాంకేతిక వికాసిత యుగంలో మానవత/సమృద్ధిపూజకు నిజమైన వస్తువై యున్నది

9 మనం వారి లోపములను కనుగొన్నప్పుడు లోకులకు మనయెడల ప్రేరేపణ/ శ్రద్ధ నిలచిపోవును

10 సమాజం ప్రత్యేకించబడి/వికృతపరచబడి నప్పుడు మిగత ప్రపంచ ఇతిహాసం మరియు ప్రతిష్ఠానాలు తిరస్కార దృష్టిలో గోచరిస్తాయి

11 అరాజకత/ఏకాంతత బహుశా మానవుడు ఉండగలుగుట్లో అన్నిటికంటె ఎక్కువ హృదయ విదారకస్థితి.

12 మన సంపూర్ణ జీవన విధానం అభ్యసించే/ప్రేమించే ప్రేమించే యోగ్యతపై వదిష్ఠించి యున్నది

13 నీ పదవి/ప్రస్తావ్ ఎంత మహత్వపూర్ణమైన దయినప్పటికీ, ఇతర మానవునికి అతని మనోగతమై యున్నదానిని ప్రకటించను కాశమియువలె.

14. సత్యం/ధర్మం ఆత్మ సాక్షాత్కారమై వున్నది.

15. భయం అన్నిటికంటె గొప్ప బుద్ధికుశలు నేర్పగలది మరియు అన్ని నియమాలకు/క్రాంతులకు అగ్రదూతమై యున్నది.

16 మానవ సంబంధాలు / అధికారములు నైతిక బోధవల్ల నియమించబడతవి

17. ప్రతి విధమైన సంస్కృతికీ ప్రతిరోధ/అవరోధ మరియు నిరాశానుభవం కలదు

18 విజ్ఞానం మరియు సాంకేతికంయొక్క ప్రకటితములు అవి కనిపించునట్లు/ సూచించునట్లు సర్వదా వుండనేరవు,

## No. 49: 18 CLUES

1. **For building a strong country we need to have noble Aspirations / Traditions.**
2. **Conjecture / Controversy is the yeast which keeps science in lively fermentation.**
3. **The world of nature is indifferent to man's Deeds / Dreams and desires.**
4. **Without its glow, which is some times resplendent and sometimes mild, life would lose its grace and Fervour / Savour.**
5. **There is no life without Fruition / Frustration.**
6. **A person without Goals / Ideals is merely existing though he may not find his existence too uncomfortable**
7. **The Growth / Strength of conscience cannot be measured in terms of abstract concepts and values**
8. **Humanity / Prosperity is the true object of worship in the age of scientific and technological advancement**
9. **Men cease to Inspire / Interest us when we find their limitations.**
10. **When a society is Isolated / Perverted it looks with contempt upon the history and institutions of the rest of the world.**
11. **Lawlessness / Loneliness is perhaps the most heart-breaking state in which a human being can be.**
12. **Our entire way of life is predicated upon our ability to Learn / Love.**
13. **No matter how important your Position / Proposition, give the other fellow a chance to express what is on his mind.**
14. **Reality / Religion is self-revealing.**
15. **Fear is an instructor of great sagacity and the herald of all Regulations / Revolutions.**
16. **Human Relations / Rights are regulated by moral sense.**
17. **Every type of culture has experienced Resistance / Restraint and frustration.**
18. **The manifestations of science and technology are not always what they Seem / Signify**

**గమనిక. పై క్లూలు ప్రసిద్ధ గ్రంథకర్తల పుస్తకములనుండి తీసుకొనబడినవి అవి పూర్తి వాక్యములు మరియు వేరు వేరుగా పూర్తి అర్థవంతమైనవి గ్రంథకర్తలు, వారి పుస్తకముల పేర్లు అఫిషియల్ సొల్యూషన్‌తో పాటు లెటర్స్ వీక్లీలో ప్రచురించబడును.**

# వెలుగు నీడలు

తన అభ్యర్థన నంగీకరించినందుకు క్షణం సేపు ఆలోచనలో నిమగ్నమైందామె మనస్సు.

అతని హృదయానవున్న బాధ జీవితాన తొలిగిన తీరని శాపం అని మాత్రం గ్రహించగలిగింది.

* * *

ఉదయాన్నే రాజశేఖరంగారు ఫోనుద్వారా తెలియబరచారు - 'మరో పది రోజుల వరకు రాలేననీ — బొంబాయి ప్రయాణం చేయవలసి వచ్చిందని'. ఆ వార్త మధుమూర్తికి తెలియపరచాలన్న వుత్సాహంతో అతని గదివైపుకు వెళ్లిందామె. కాని అతడప్పటికే స్నానపానాదులన్నీ ముగించి ఆఫీసులో అర్జంటుపనుందని వెళ్లాడని తెలియజేశాడు నౌకరు

ఆశ్చర్యంతో కుతూహలాన్ని అణచుకోలేక ఆతని గదిలోనికి వెళ్లిందామె

టేబిల్‌పైన ఆతని ఫోటోముందు డైరీ తెరిచేవుంది — సంస్కారంకాదు గూడదని హెచ్చరించుతున్నా మనస్సున దాగిన ఆత్మీయానురాగాలు ఆతని జీవిత సమస్యల్ని తెలుసుకోవాలన్న ఆతురతతో వూగిపోయాయి

అందుకే మెల్లిగా మొదటిపేజీ త్రిప్పింది — ముత్యాలు జల్లినట్లు, నక్షత్రాలు అల్లుకున్నట్లు రెండేరెండు పంక్తులున్నాయి —

'మల్లెలువిరిసిన మనస్సున మధువులేదు
మధువుకురిసిన మనస్సుకు మమతలేదు'

ఎంత ఆలోచించినా భావ గర్భితమైన ఆ వాక్యాలామెకు అర్థంకాలేదు - రెండో పేజీ తిరిగింది-

మనస్సునూ — మనస్సునూ —
మంత్రాలతో ముడివేసి
వయస్సునూ — సొగసునూ —
మమతలతో జతవేసి
సృష్టికి — సోపానాల్ని పరుస్తుంది
వివాహ బంధం'

మరోసారి చదివింది 'అర్థం గంభీరంగా వుంది భావాలు అతి కోమలంగా వున్నాయి ఎంత సున్నితం ఆతని మనస్సు?' ఆశ్చర్యపడిందామె మరోపేజీ త్రిప్పుతూ—

'పూవులా తావిలా కలిసి నవ్వులు పండించుకుని దివ్యలమైపోదామనుకున్నాము ఆమె నేనూ -- కానీ...ఉహూ! మనస్సు

# లిట్ క్విజ్ చందాదారుల క్విజ్

LitQuiz NO 49 — 50000 — 1st PRIZE Rs. 22000 — 2nd PRIZE Rs. 10,000 — RUNNERS UP (UPTO 4 ERRORS) Rs 7,500 — EVERY ALL CORRECT WILL GET A SILVER BOWL — MINIQUIZ (UPTO 1 ERROR) Rs 8000 — SUBSCRIBERS' QUIZ Rs 2,500

ఈ క్విజ్ లో 3 నెలల (రు 3) 6 నెలల (రు 6) మరియు సంవత్సర (రు 12) చందాదారు లందరు పాల్గొనవచ్చును. వీరు ఖాళీగా యుంచుక్కై వదలిన స్థలములో తమ చందా నెంబరో తప్పకుండా వేయవలెను. వీరు తమ చందా క్రింద క్రొత్తగా రు 3 రు 6 లేక రు 12 ఎంట్రీ ఫీజుతో పంపుచున్నయెడల కూపను క్రింద వున్న క్రొత్త అనుచోట గుర్తించవలెను.

క్రొత్తగా ప్రారంభించిన యీ చందాదారుల క్విజ్ స్కీము మా చిన్న మరియు పెద్ద చందాదారుల అభిమానమును తప్పకుండా పొందగలదని ఆశిస్తున్నాము.

మీ చందా నేడే పంపండి ఇది మీకు లాభదాయకం కాగలదు.

— లిట్ క్విజ్ నెం 49 అధికార ఎంట్రీ ఫారము —

ఆఖరు ముగింపు తేదీ 7-5-69 బుధవారం

ADDRESS LITQUIZ No 49 ALANKAR BALARAM STREET BOMBAY-7 (W B)

గమనిక 1) ఒక్కొక్క కాలంలో మీరు వద్దనే పదమును కొట్టివేయండి (2) ఒక కూపన్ మాత్రం పంపినచో ఇతర కూపనులను కొట్టివేయండి (3) ఎంట్రీలను MO ద్వారా పంపినచో, పోస్టాఫీసునుండిపొందిన MO రసీదును ఎంట్రీ ఫారముతో జతపరచవలెను. MO రసీదు లేని ఎంట్రీలు నిరాకరింపబడును (4) IPO క్రాస్‌చేయవలదు అది లిట్‌క్విజ్ నెం 49 బొంబాయి—7 వారికి చెల్లించునట్లు ఉండవలెను

| 1 | | Re 1 | 2 | | Re 1 | 3 | | Re 1 | 4 | | Re 1 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ASPIRATIONS | TRADITIONS | 1 | ASPIRATIONS | TRADITIONS | 1 | ASPIRATIONS | TRADITIONS | 1 | ASPIRATIONS | TRADITIONS |
| 2 | CONJECTURE | CONTROVERSY | 2 | CONJECTURE | CONTROVERSY | 2 | CONJECTURE | CONTROVERSY | 2 | CONJECTURE | CONTROVERSY |
| 3 | DEEDS | DREAMS | 3 | DEEDS | DREAMS | 3 | DEEDS | DREAMS | 3 | DEEDS | DREAMS |
| 4 | FERVOUR | SAVOUR | 4 | FERVOUR | SAVOUR | 4 | FERVOUR | SAVOUR | 4 | FERVOUR | SAVOUR |
| 5 | FRUITION | FRUSTRATION | 5 | FRUITION | FRUSTRATION | 5 | FRUITION | FRUSTRATION | 5 | FRUITION | FRUSTRATION |
| 6 | GOALS | IDEALS | 6 | GOALS | IDEALS | 6 | GOALS | IDEALS | 6 | GOALS | IDEALS |
| 7 | GROWTH | STRENGTH | 7 | GROWTH | STRENGTH | 7 | GROWTH | STRENGTH | 7 | GROWTH | STRENGTH |
| 8 | HUMANITY | PROSPERITY | 8 | HUMANITY | PROSPERITY | 8 | HUMANITY | PROSPERITY | 8 | HUMANITY | PROSPERITY |
| 9 | INSPIRE | INTEREST | 9 | INSPIRE | INTEREST | 9 | INSPIRE | INTEREST | 9 | INSPIRE | INTEREST |
| 10 | ISOLATED | PERVERTED | 10 | ISOLATED | PERVERTED | 10 | ISOLATED | PERVERTED | 10 | ISOLATED | PERVERTED |
| 11 | LAWLESSNESS | LONELINESS | 11 | LAWLESSNESS | LONELINESS | 11 | LAWLESSNESS | LONELINESS | 11 | LAWLESSNESS | LONELINESS |
| 12 | LEARN | LOVE | 12 | LEARN | LOVE | 12 | LEARN | LOVE | 12 | LEARN | LOVE |
| 13 | POSITION | PROPOSITION | 13 | POSITION | PROPOSITION | 13 | POSITION | PROPOSITION | 13 | POSITION | PROPOSITION |
| 14 | REALITY | RELIGION | 14 | REALITY | RELIGION | 14 | REALITY | RELIGION | 14 | REALITY | RELIGION |
| 15 | REGULATIONS | REVOLUTIONS | 15 | REGULATIONS | REVOLUTIONS | 15 | REGULATIONS | REVOLUTIONS | 15 | REGULATIONS | REVOLUTIONS |
| 16 | RELATIONS | RIGHTS | 16 | RELATIONS | RIGHTS | 16 | RELATIONS | RIGHTS | 16 | RELATIONS | RIGHTS |
| 17 | RESISTANCE | RESTRAINT | 17 | RESISTANCE | RESTRAINT | 17 | RESISTANCE | RESTRAINT | 17 | RESISTANCE | RESTRAINT |
| 18 | SEEM | SIGNIFY | 18 | SEEM | SIGNIFY | 18 | SEEM | SIGNIFY | 18 | SEEM | SIGNIFY |

FREE TO SUBSCRIBERS WHO SEND 2 COUPONS — NO 49 — FREE TO ALL WHO SEND 4 COUPONS

SUBSCRIBERS QUIZ

| | | | |
|---|---|---|---|
| ASPIRATIONS | TRADITIONS | FRUITION | FRUSTRATION |
| CONJECTURE | CONTROVERSY | GOALS | IDEALS |
| DEEDS | DREAMS | GROWTH | STRENGTH |
| FERVOUR | SAVOUR | HUMANITY | PROSPERITY |

3 MONTHLY/6 MONTHLY/ANNUAL SUB NO. NEW,

FREE COUPON

MINIQUIZ

| | | | |
|---|---|---|---|
| INSPIRE | INTEREST | REALITY | RELIGION |
| ISOLATED | PERVERTED | REGULATIONS | REVOLUTIONS |
| LAWLESSNESS | LONELINESS | RELATIONS | RIGHTS |
| LEARN | LOVE | RESISTANCE | RESTRAINT |
| POSITION | PROPOSITION | SEEM | SIGNIFY |

2 కూపనులు పంపు చందాదారు లందరికి ఉచితం

4 కూపనులు పంపువారందరికి ఉచితం

ఈ క్విజ్ ప్రవేశమునకుచెందిన నిబంధనలను, షరతులను పాటించుటకు అంగీకరిస్తున్నాను మరియు కాంపిటీషన్ ఎడిటరుగారి నిర్ణయమును తుది నిర్ణయముగాను, న్యాయబద్ధమైనదిగాను అంగీకరించుటకు ఆమోదిస్తున్నాను. ప్రతి కూపనుకు ఎంట్రీ ఫీజు రు 1/—. ఈ పూర్తి ఎంట్రీఫారము (4 కూపనులకు) ఫీజు రు 4/— M O. రసీదు/I P O/లిట్‌క్విజ్ క్యాష్ రశీదు/ప్రైజు కార్డు జతపరుస్తున్నాను. వాటి నెం.............

4 9 ASVP

CAPITAL LETTERS

NAME.............................................

.............................................

ADDRESS .............................................

.............................................

.............................................

— ఈ పూర్తి ఫారమును కత్తిరించి పంపవలెను —

లిట్ క్విజ్ నెం 47 లో తప్పులు లేకుండా గెలుపొందినవారు ఒక్కొక్కరు రూ 11000/—లు పంచుకొంటిరి (1) శ్రీ హాసు పటేల్, C/o జగ్జీవన్ కెమికల్స్, గుజరాతీ బజారు, సాగర్ (ఎం పి) (2) శ్రీ కృష్ణకాంత్ ఠాకోర్దాస్ జారీవాలా, 11/1396, నానావత్, నవల్ షా కోతా సమీపం, సూరత్.

ఒక తప్పు గల 10 మంది ఒక్కొక్కరు రూ 1000/—లు గెలుపొందిరి.

ఆఖరు ముగింపు తేది. 7—5—69.
సొల్యూషన్ ఆంధ్రపత్రిక 11 5 69.
* సొల్యూషన్ వెంటనే పొందుటకు 10 పైసల స్టాంపు, స్వంత అడ్రసు గల కార్డును వెంటనే పంపవలెను.

నిలా వాలిపోయిలేను. ఆ గిరణాన్ని లక్ష్య రాళ్ళలోనూడా వింపి, తన జీవితాన దొర్లిన మహాశాపం కాలసర్పమై నన్ను కాటేయ్యదుకో తలచిందేమో! ఇంకా ఈ జీవితాన సుఖ మెక్కడ ?'

మంత్రించిన బొమ్మలా నిశ్చేష్ట అయిందామె. కొంతసేపటికా నిశ్చలతనుంచి తేరుకుని 'ఆమె?! ఎవరో! భార్యా? కాదు మరెవరు?!' తీరని సందేహమై నిప్పు రవ్వలా చురుక్కుమనిపించిందామెకా వూహే!

ఆఖరి పేజీ తిరిగిందామె చేతుల్లో అప్రయత్నంగానే—

'అమ్మా! నీ కోరికే నిజమై నిలిచే క్షణాలు ఎదురైనట్లున్నాయి పోనీ నీ మనస్సుకైనా తృప్తి కలగనీ ... ఇక నీ వన్నట్లే హృదయాన ఆశ నింపుకుంటా నమ్మా! మనిషిగా మారిపోతాను మీ అందరి ఆనందానికైనా — నలుగురికీ నవ్వులు పంచి యిచ్చినా జీవితం ధన్యమే!'

కనుబొమలు ముడివడ్డాయి. హృద యాన విచిత్రమైన భావన కలయ దిరుగు తోంది. చిత్రవిచిత్రమైన భావనలెన్నో అలల్లా విరుచుకు పడుతున్నాయి. సందే హాలు ఆలోచనకే అందడం లేదు.

'మధుమూర్తి వివాహితుడా? అయితే నష్టమేముంది దానిలో? వుహూ! కాదు! ఆ కనులలో వెలిగే కాంతులు సావని అను క్షణమూ ఆతనిమాటలు చేతలూ చెప్పు తున్నాయిగా? ఏమో? నాదంతా భ్రమతో నిలుపుకున్న గాలిమేడే అయితే! అసలాతని జీవితాన సుఖం లేదంటా డేమిటి? మనస్సు విప్పి చెప్పనే చెప్పడు. ఏమో బాబూ!' అంతా అయోమయంగా పద్మ వ్యూహంలా అల్లుకు పోతోందామె హృద యాన సమస్యలతోరణం.

రాత్రి అతడు వచ్చేసరికి బాగా ప్రొద్దు పోయింది. ఆకసాన వెలుగుతూన్న నక్షత్రా లను లెక్కించు కుంటోందామె.

అపుడే పదకొండు కొట్టింది గడియా రం. లోలోన నవ్వుకుందామె.

అంత ప్రొద్దుపోయినా కనులు మూత పడకుండా వుండడం అదే మొదటిసారి ఆమెకు ఏవ్యక్తి వూహలతో అలా ఒంట రిగా ఆలోచనలతో వూగిసలాడి పోతున్నదో ఆతని హృదయానమాత్రం అంత సంచల నం వున్నట్లే కన్పించాలేదు. అన్పించా లేదామెకు

నిశ్శబ్దంగావచ్చి తలుపులు తెరుచుకుని ప్రక్కపైన వాలిపోయాడాతడు.

అనుపమ మనస్సు చివుక్కుమంది చటుక్కునలేచి 'లైటు తీసివేయినాగులూ! అంటూ తన గదిలోకి దారితీసింది. ఆ కంఠాన ధ్వనించిన విసుగుదలా కోపా లతో ఆ యిల్లు ప్రతిధ్వనించింది.

'అనూ! ఓసారిలావచ్చి వెళ్ళగలవా?' అన్నాడు మధుమూర్తి గదిలోనుంచి. అలుకతో కదం త్రొక్కుతూన్న ఆమెపాదాలు ఆగిపోయాయి వెంటనే.

'ఏం కావాలి?' విసుగుదలా నిర్లక్ష్యం స్పష్టంగా ధ్వనించాయామెస్వరాన. ఆమె వదనం కఠినంగా వున్నట్లు కనిపిస్తోంది.

విస్మయం నిండుకొచ్చిందాతని నేత్రాల్లో ఓ క్షణంపాటు ఆమెవంకచూసి అన్నాడు నెమ్మదిగా—

'నీ చదువుకు అడ్డువచ్చాననుకుంటాను. ఏంలేదు? నిద్రపోలేదేమిటని పిలిచాను.'

గిరుక్కున వెనుదిరిగిందామె ఓ గంట తర్వాత మంచినీళ్లకని లేచి వచ్చిన అను పమ నిర్ఘాంతపోయింది

అప్పుడే లోనికివస్తున్నాడు మధు మూర్తి జోళ్ళువిడిచి తలుపులు మూసి. చేతిలో ఫ్లాస్కు వుంది. తెరిచి కాఫీ పోసు కుని తెల్లటి టాబ్లెట్ మ్రింగాడక్కడే. సోఫాలో కూర్చుని రెండు నిమిషాలవరకు వెనక్కువాలి కూర్చుండి పోయాడు కణతలు నొక్కుకుంటూ. తర్వాత లేచి వెళ్లాడు నెమ్మదిగా.

'అమ్మాయిగోరిఫ్లాస్కులో వుంచా యిగా బాబూ కాఫీ! ఇంతదూరం పోయొ చ్చారీ అర్ధరేత్తిరికాడ— తలనెప్పి తగ్గిం దాండీ!' అంటున్నాడు నాగులు.

'తలనొప్పే కాదు నాగులూ! ఒళ్లంతా సమ్మెటలతో పొడిచినట్లుంది. అదే తగ్గు తుందిలే. పడుకోనువ్వికి! పాపంనామూలాన యింతవరకు కన్నుమూయలేదు' అన్నాడు మధుమూర్తి.

అనుపమ మొహం వివర్ణమైపోయింది. 'అతని హృదయావస్థ అంతర్యామికి తప్ప మరొకరికి విప్పిచెప్పగూడదు గాబోలు' అస్పష్ట స్వరంతో అనుకున్నదామె కానీ అదేం చిత్రమోగానీ ఆ సంఘటన అతనిపైనున్న అనురాగాన్ని కించిత్కూడా తగ్గించలేదు సరిగదా పైగా ఆమె మనస్సున రేగిన భావాలు విశృంఖలంగా విప్లవాన్ని లేవదీశాయి.



విప్పటికో ఆలోచనల పొలిమేరల్నిదాటి విదురలోకి జారుకున్నదామె అలిసిపోయి.

*　　　*　　　*

'మెలకువరాలేదా అనుపమా! కాఫీవేళ దాటినా లేవలేదని గోలజేస్తున్నాడు నౌకరు' అన్నాడు వుదయాన్నే ఎదురై ప్రేమ రంజితమైన చిరునవ్వుతో.

అప్పటికీ అతడు స్నానపానాదులు ముగించి ఆఫీసుకు వెళ్ళడానికై తయారవుతున్నాడు.

'అదేమిటి? ఒంట్లో కులాసాగా లేనపుడుకూడా సెలవు పంపించగూడదా?' అన్నదామె ఆత్మీయత వుట్టిపడుతూన్న స్వరంతో.

సహజ శాంత స్వరంతోనే నవ్వుతూ అన్నాడతడు—

'మీ ఆడవాళ్ళకు అనురాగం తుఫానులా విపుడు విజృంభిస్తుందో దేవతలక్కూడా తెలియదనుకుంటానే'

'అయినా నా అప్వస్థత నీకెలా తెలిసిందో? కలగన్నావా?' అన్నాడాతడే తిరిగి ఆశ్చర్యంతో.

'పాషాణంగా మారనంత కాలం అన్నీ తెలుస్తాయి' అన్నదామె విస్మరస్వరంతో.

ఆమెకెందుకు ఆగ్రహం వచ్చిందో గ్రహించాడతడు.

'అయితే ధన్యుణ్ణే—ఈ భావం అలాగే చిల్లకాలం నిలిచిపోతే నాలాంటి వాళ్ళు సుఖపడతారు'

ఆమాటతో ఆమె క్రోధం దూది పింజలా ఎగిరిపోయింది. సాయంత్రం అతడు అనుపమ గదిలోకి వస్తూనే అన్నాడు—

'అరే! మ్రోయంచేది మురళినా? లేక పిపాణాన్నా అనుపమా! ఏమిటా అపస్వరాలు పలికించడం!!'

లోనికి రాగానే మరోయువతి వుండడం చూసి నిరుత్తరు డయ్యాడతడు.

'మరోలా భావించకండి! అనుపమ అనుకున్నాను —ఏదీ యిలా యివ్వండి' అంటూ మృదువుగానే నచ్చజెప్పి ఆమె చేతిలోని మురళిని తీసికొని మనోహరంగా మధురాతి మధురంగా మ్రోయించి వినిపించాడు.

అనుపమతోసహా ఆ యువతి కూడా ఆశ్చర్యానందాలలో తేలిపోయూరా గానసుధలోని పవిత్రమహత్తకి.

[illegible]

'ఎంత చక్కగావున్నది మీగానం! నీరజా! యీ నాల్గురోజులు కొంచెం నేర్చుకోవలసి వస్తుంది. వచ్చేశుక్రవారమే మా కాలేజి యూనివర్సరీ అండి. ఏదో నృత్యనాటిక యిమ్మంది. మా ప్రిన్సిపాల్. అందుకే యీ సన్నాహమంతా' అంటూ ఏకధాటిగా చెప్పి వేసింది అనుపమ వుత్సాహంగా.

వేయబోతున్నది 'రాధా మా ధవీయమ్' అన్న నృత్యనాటిక. అదీ బ్యాక్‌గ్రౌండు మ్యూజిక్ వుంటుందని ప్రాక్టీసుకోసమై మురళి వాయించుకుంటున్నామని తెలియజేశారిరువురూ తర్వాత.

అప్పటినుంచి మధుమూర్తి వాళ్ళ రిహార్సలు పూర్తయ్యేవరకూ తనకు తోచిన సలహాలనిస్తూండేవాడు. అతని రాకతో అనుపమ హృదయం పూసిన పొన్నతరువులా సంతోషంతో నిండిపోయేది. నీరజ, అతడిని 'మాష్టారూ!' అనడం ప్రారంభించింది. అనుపమకూడా అలాగే సంబోధించుతోందా క్షణంనుంచీ. అతని సలహాలు వాళ్ళకు అమూల్యంగా వుండేవి. మనస్సు నొవ్వనీయడు చెప్పవలసిన పరిధి దాటిపోడు

'భావం కనులలో ప్రతిఫలించాలి. అణువణువునా అభినయించవలసిన భావనలే విరియాలి. అపుడే నటన పరాకాష్ఠనందుకుంటుంది. ఆమా! అనురాగంతో నిండిన నీ మల్లెవంటి మనస్సు ప్రేక్షకులకు అడుగడుగునా కన్పించాలి! రాధ ఆ మాధవుని ప్రణయ సామ్రాజ్యానికి పట్టపురాణి.'

'బాబోయ్! మీరు కృష్ణుడైతే నా నృత్యం ఎగిరిపోయేట్లుంది. ఇన్ని నిబంధలేమిటి బాబూ!' అంటూ నవ్వేది అనుపమ

యూనివర్సరీ సమీపించింది.

ఆ రోజు రాజశేఖరంగారు లేకపోవడం వలన మధుమూర్తిని తప్పకరమ్మని ఆహ్వానించిందామె.

సాయంత్రం ఆఫీసుక్కూడా ఫోను చేసింది.

అతడు వెళ్ళేసరికి ప్రోగ్రాం ఆరంభమైంది. ప్రార్థనాగీతం విన్పిస్తోందో శ్రావ్యమైన స్వరం. వందనవనంలా అలంకరించబడింది కళాశాల రంగురంగుల గులాబీలు వయ్యారాల నొలికించుతూ అతిథుల్ని ఆహ్వానించుతున్నాయి. దీపాల వెలుగుతో మెరుపు తీవల్లా తళుక్కు మంటున్నారు విద్యార్థినులు రంగురంగుల సింగారంలో

యౌవనమంతా అక్కడే ప్రోగువడినట్లు ఉత్సాహం సముద్రంలా పొంగివస్తున్నది. పచ్చని ఎర్రని తోరణాలతో ఆవరణ దీపాలపందిరిలా వుంది.

అనుపమ అంత హడావిడిలోనూ ఎదురై అతని నాహ్వానించింది. స్టేజి ప్రక్కగావున్న సీటులో కూర్చోబెట్టింది. ఆమె అలంకరణ అందంగా వుంది. పసుపురంగు పట్టుచీరా, అదేరంగు చోళీ ధరించింది. జడనిండుగా మల్లెలు. మల్లెలతో



విరవిగులాబీలు మెరుస్తున్నాయి. అరుణిమ అలదుకున్న పెదవులపై అందమైన మందహాసం మెరుపులా తళుక్కున మెరిసి పోతోంది. నుదుట సన్నని కుంకుమరేఖ.

మధుమూర్తి ఆమె సౌందర్యానికి ముగ్ధుడైపోయాడు. రెండు నిమిషాలవరకు ఆమెకేసి చూస్తూండిపోయాడు అనుపమ గమనించీ గమనించినట్లు 'వస్తాను! మాస్టారూ!' అంటూ వయ్యారం ఒలికించుతూ హంసలా కదిలి వెళ్లిపోయింది.

'సౌందర్యం మగువలకు పరమాత్మ ఒసంగిన వరం —అనుకున్నదతని మనస్సు మురిసిపోయి.

ముందుగా 'అనుపమ' అష్టపదీ ననుసరించి నృత్యం చేసింది కనుల పండువుగా మనోహరంగా వుందామె భావప్రకటన. ప్రేక్షకుల అభినందనలతో ఆవరణ మార్మోగి పోయింది.

మరోనాటిక ప్రదర్శితమౌతోంది. అంతలో అనుపమ మధుమూర్తికోసం కబురంపించింది ప్యూనుతో.

'ఎలా? మాస్టారూ! నీరజకు రాత్రి నుంచి జ్వరమట. రాలేదని వాళ్ల అమ్మ గారిపుడే మనిషిని పంపించారు. నా ప్రోగ్రాం కాన్సిల్ అవుతుందేమో యిక!' నిరాశ నిండుకొచ్చిందామె కంఠాన.

ప్రిన్సిపాల్ కోపంతో మండిపోతోంది. 'ఉన్నవాటిల్లో అదే మంచి నాటిక అనుకుంటె యిలా ఆగిపోతే ఎలా? మంత్రి గారేమనుకుంటారు?' అన్నదామె.

'కృష్ణుడిగా నేను నటించుతాను! ఏం అనుపమా! పద!' అన్నాడు మరోమాటకు తావివ్వకుండా అతడు

'రసాభాసమాత్రం కాకూడదని' హెచ్చరించింది ప్రిన్సిపాల్.

తెర లేచింది. రంగస్థలం వెనుకనుంచి యమునానదీ తరంగాలహోరు శ్రావ్యంగా విన్పించుతోంది. ఇసుక తిన్నెలూ—విరియబూసిన పొన్నతరువులూ ఓ చెట్టుక్రింద రాధ మల్లెలమాలలల్లుతోంది.

దూరాన వేణుగానం మనోహరంగా శ్రావ్యంగా విన్పించుతోంది. ఆ మధురనాదం చెవుల సోకగానే రాధ నిలువెల్లా పులకించి పూచిన తంగేడై పూగిపోయింది. మెరుపు తీవలా లేచి నిలబడింది

వర్షిద్కుల్లా ప్రసరించాయా ప్రణయ

# వెలుగు-నీడలు

దేవత ప్రేమ పూర్ణ దృష్టులు.

సమీపాన్నే వున్న మాధవీలత ఒడలు జల్లుమంది రాధమనస్సున అనురాగం జల్లులై కురిసింది. కనులలో కోటిమెరుపులు తళుక్కుమన్నయి.

తలపైన నెమలిపింఛము! ఫాలతలంపై నల్లని ముంగురులు! కనులలో మధుర భావాల విన్యాసాలు, తాంబూలరక్తిమ నలదుకున్న అధరాలపై మధురమైన మందహాసం! నుదుట పొడవైన కస్తూరితిలకం, మధురరాగాలు పలికించే వేణువు చేతులలో మెరుస్తూండగా చిలిపిచూపుల నల్లనయ్య మాధవీలతవెనుక సాక్షాత్కరించాడు జగన్మోహనాకారుడై.

ప్రేమమయిరాధ హృదయాన మధుసూదనుని వూహలే పూవులై పూశాయి.

ఘల్లు ఘల్లుమని కాళ్ల గజ్జెలు మ్రోగుతున్నాయి. మాధవుడు చిలిపిగా కనుసైగ చేశాడు. రాధ మనస్సు ఝల్లు మన్నది. తధిగిణత! అని మద్దెల మ్రోగిపోతోంది పురివిప్పిన మయూరమై, పరువులెత్తే సెలయేరై, వెన్నెల రేఖయై, విరిసిన పూవై పరవశత్వంతో మైమరచి నృత్యం చేస్తోందామె—

నిలువెల్లా మాధవుని తలపులే! జగమెల్ల రాధామాధవుల మధురగానమే! నీలమేఘ శ్యాముడు సమీపించాడామెను. మృదువుగా స్పృశించాడు బంగారుపెదవులతో. లోని వూహలే అలలై, బంగారు కలలై, రూపు దాల్చినట్లు రాధామనోహరుడు సౌందర్యమూర్తియై జగమంతటికీ వెలుగై మెరిసిపోయాడు.

ఆ మురళీధరుని కనులలో కనులు నిలిపి విరిసిన సుమంలా, రాధ, తన ప్రేమమూర్తి పాదాలపై వాలిపోయింది పరవశాన

తెరజారింది మెల్లిగా. ప్రేక్షకుల చప్పట్లు ఆకసాన్నంటాయి. మంత్రిగారా క్షణమే వేదికపైకి వచ్చి నృత్యమెంతో రమ్యంగావుందని—మనోహరంగా ప్రదర్శింపబడిందని — ఎన్నాళ్లకో చక్కని కళాఖండాన్ని దర్శించేభాగ్యం కలిగిందనీ ప్రశంసించారు.

అనుపమను చుట్టుముట్టి ప్రశ్నల వర్షం కురిపించసాగారు స్నేహితురాలంతా.

'ఎవరే? ఆ అందాల కృష్ణుడు?'

'బావగారేమో?'

'కాదు! కాబోయేవారేనట!'

'అమ్మ! దొంగా! మాకైనా చెప్పిందేమో చూడు!'

అనుపమ అందరి ప్రశ్నలకీ, సందేహాలకీ చిరునవ్వులే సమాధానమిచ్చింది

ఇంటికి రాగానే మధుమూర్తి ప్రశ్నించాడు—

'ఎంత మనోహరంగా నృత్యం చేశావు! భరతనాట్యం వచ్చునని చెప్పనే లేదే?' అంటూ.

'మీరు చెప్పారేమిటి? ఇంత చక్కని నటన మీలో వుందని?'

'ఆ వేషంలో నిన్ను చూడగానే నాలో కృష్ణుడే ప్రవేశించాడేమో?' అన్నాడతడు చిన్నగా నవ్వుతూ.

అదే సంభాషణతో, పరిహాసోక్తులతో భోజనాలు పూర్తయ్యాయి.

అనుపమ పడుకున్నదేగానీ నిదురే రావడం లేదెంత ప్రయత్నించినా. రంగస్థలంపై నాటిక, నృత్యమూ, కృష్ణుడూ, అవే దృశ్యాలు కలల్లా గోచరించుతున్నాయి. మనస్సున ఏవో ఆలోచలు కొల్లలుగా అలలై లేచిపడుతున్నాయి.

మధుమూర్తి! ఎంత అందమైన పేరు! నిజంగా కృష్ణుడేనన్పించిందేమిటి!? అబ్బ! ఎంత చిలిపిగా నవ్వాడో! ఏదో చిత్రమైన భావన విద్యుత్తులా నిలువెల్లా అల్లుకుపోయిందాక్షణంలోనే!

ఆస్పర్శ ఎంత సున్నితం! ఎన్నెన్ని మధుర భావాలు పొదిగి వున్నాయో ఆ స్పర్శలో! ఝల్లుమన్నదందుకే నా మనస్సు! కనులలో కనుపించగానే అంత పరవశత ఆవహించిందేమిటి నన్ను? అలా అంతగా మైమరచి తూలిపోయానేమిటూ పాదాలపైన?! ఆ కనులలో ఏదో సమ్మోహన శక్తి వుంది!

మరోసారి కృష్ణుడై, నేను రాధనైతే!'

............ఊహలు కలలై, ఆ కలల్లోకి జారిపోయిందామె, ఏఝామునో తనకు తెలియకుండానే మరోసారి రాధగా మారిపోయి.

(ఇంకా ఉంది)

# వైశాఖ పూర్ణిమ

ప్రతిసంవత్సరమూ వచ్చే పర్వాల్లోనూ పబ్బాల్లోనూ వైశాఖపూర్ణిమ ఒకటి. ప్రసిద్ధాలయిన తక్కిన పండుగులవలె జనసామాన్యం దీన్ని పాటించకపోయినా దీనికి ప్రాధాన్యం లేకపోలేదు.

మన పండుగుల్లో కొన్ని జన్మదినాలు ముఖ్యంగా ఉన్నవి కొన్నిటిలో పూజలూ, పురస్కారాలూ ప్రధానాలు. కొన్నింటికి జనసామాన్యం సంతుష్టి, ఆనందమూ కారణాలు. ఈ వైశాఖపౌర్ణమి కాల ప్రాధాన్యాన్ని అనుసరించినది. దీనికి చిత్రా పౌర్ణమి అనికూడా పేరు ఉన్నది. పున్నమ సంపూర్ణంగా ఉన్ననాడు చిత్రానక్షత్రం వున్నట్లయితే అది చిత్రా పూర్ణిమ అవుతుంది ఆవిధంగా పౌర్ణమీ, చిత్రా నక్షత్రం కలిసి వుండేరోజు వైశాఖ పూర్ణిమ అవుతుంది!

పండుగులుగా ఉన్న పున్నములు కొన్ని వున్నవి. జ్యేష్ఠమాసంలోని పున్నమ ఏరువాక పున్నమ! అది పొలందున్నే కర్షకులకు ప్రధానమైన పర్వం ఆషాఢ పౌర్ణమిని వ్యాసపౌర్ణమి అంటారు. అది యతులకు ముఖ్యమైనది. అంతేకాకుండా ప్రాచీన పద్ధతిని అనుసరించి శిష్యులు గురువులను పూజించేపర్వం అది. శ్రావణపౌర్ణమి ఉపాకర్మకు ముఖ్యమైనదనే సంగతి అందరూ ఎరిగినదే! కార్తీకపౌర్ణమి భగవత్పూజకూ, దీపారాధనకూ ప్రధానమైనది పుష్య, మాఘపౌర్ణములు పుణ్యప్రదాలు. ఫాల్గుణ పౌర్ణమి హోలీపండుగ, డోలోత్సవం జరుపబడే పర్వం! తక్కిన పౌర్ణములకు ఉండే ప్రాధాన్యం వైశాఖ పౌర్ణమికిన్నీ ఉన్నది.

ఆయాకాలాలను అనుసరించి పర్వాల్లో దానధర్మాలు చెయ్యడం మనదేశంలో మొదట్నుంచి వస్తున్నది. ఇది వేసవి కాలంలో వస్తుంది. కనుక నిదాఘతాపనోదనార్థమైన వాటిని దానం చెయ్యడం పరిపాటి నాడు చల్లదనంకోసం దధ్యన్నాన్ని పెట్టి, ఛత్రాన్నీ విసనకర్రనీ, మామిడి పండ్లనూ యిచ్చి జనాన్ని తృప్తిపరుస్తారు. ఇలా దానం చెయ్యాలనేది పంచాంగాలలో కానవస్తున్నది కూడా. కలిగిన వాళ్ల యిళ్లలో సాయంకాలం అందరినీ సమావేశపరిచి మామిడిపళ్లూ, పానకం, విసనకర్రలూ యివ్వడం యిప్పటికీ ఆచారంలో ఉంది. క్షేత్రాల్లోని దేవాలయాల్లోనూ—ముఖ్యంగా విష్ణుదేవాలయాల్లో ఇలా జరుపబడుతుంది.

హిందువులకు కాకపోయినా బౌద్ధులకిది అతి ముఖ్యమైన పర్వదినం. ఈ దినాన్నే బౌద్ధులు బుద్ధజయంతిని జరుపుతారు లోకం ఆధివ్యాధి జరామరణాదులతో బాధపడుతూ, ప్రాణివధ మొదలైన హింసా కృత్యాలకు వెనుతీయక అజ్ఞానాంధకారావృతమై వున్నకాలంలో—అనేక జన్మలలో పరోపకారంకోసం ఆత్మార్పణచేసిన బోధిసత్త్వుడు సిద్ధార్థుడుగా శాక్యరాజవంశంలో శుద్ధోదన మహారాజు పుత్రుడై పుట్టి, తాను కనుగొనిన మహా సంబోధి మూలంగా బుద్ధుడై లోకాన్నుద్ధరించాడు ఆయన జన్మించినది ఈ పూర్ణిమనాడే!

ఆయన విష్ణుదేవుని అవతార మూర్తుల్లో ఒకడని తెలుస్తూ వున్నది. ఆయన శమదమాదులను స్వీకరించి, లోకంలో జీవహింస అసత్యం, ఉండకూడదని ప్రచారం చేశాడు. జీవకారుణ్యాన్నీ, పరోపకార పరాయణత్వాన్నీ, వినీతినీ, మృదుభాషణాన్నీ వ్యాప్తిచెందేటట్లు చేశాడు ఆయన ప్రబోధంవల్ల హింసాకాండ చాలవరకూ తగ్గింది. యుద్ధాలు జరగడంలేదు. భారతదేశంలోని వారేకాక సింహళీయులు, చైనీయులు మొదలైన దేశాంతరాలవారు కూడా ఆయన బోధలకు తన్మయులై, ఆయన చెప్పిన ధర్మాలను ఆచరణలో పెట్టి బౌద్ధమతాన్ని స్వీకరించారు. అట్టి మహనీయుని జన్మదినం కావడంవల్ల వైశాఖ పూర్ణిమ ఘనత హెచ్చింది.

బౌద్ధులీనాడు బుద్ధుని పూజించి, ఆయన మహోపదేశాలను ప్రజలకు బోధిస్తూ సభలుజరిపి, బౌద్ధమతవ్యాప్తికి తగిన ప్రచారం జరుపుతారు

—బు. వేం. ర.



# ఏడడుగులు - మరో తప్పటడుగు

పాలకోడేటి సత్యనారాయణరావు

ఆరేళ్ళ తర్వాత ప్రకాశం కనిపించాడు నాకు.

ఆకాశం అందుకొన్నంత సంబరం అయిందికాదూ మరి. నాలుగో క్లాసు నుంచి డిగ్రీ పుచ్చుకునేవరకూ కలిసే చదువుకున్నాం. డిగ్రీ పుచ్చుకున్న రెండు నెలలకే ప్రకాశం ఉద్యోగం సంపాదించుకోటంతో వెళ్ళిపోయాడు. ఆ తర్వాత మరో ఇరవై నెలల కనుక్కుంటూ నా పెళ్ళికి వచ్చాడు.

అంతే! ఆ తర్వాత దర్శనం లేదు!!

రోడ్డుమీద కామరాజుగారి దుకాణం దగ్గర కూచుని కబుర్లు చెబుతున్న నాకు, ప్రకాశం కొంచెం దూరం ఉండగానే కనిపించాడు. అవునో కాదోనని సందేహించాను.

'సందేహమేమిటి మాస్టారూ! అతను మీ ప్రకాశమే!' అన్న కామరాజుగారి పలుకులు విన్న తర్వాతనే నేనతన్ని పిలువగలిగాను.

'ప్రకాశం ప్రకాశం'

చప్పట్లు వినిపించాయేమో, వెనక్కి తిరిగి చూశాడు ప్రకాశం.

ప్రకాశమే!

దగ్గరకు చేరిచేరగానే — 'నువ్వురా! ఓరినీ, ఎవరో అనుకున్నాను' అన్నాడు నను కౌగలించుకునే ప్రయత్నం చేసి.

నా మనసుకెంతో ఉల్లాసంగా ఉంది.

ఏడడుగులు వేస్తే వారు మిత్రులవుతారని సూక్తి.

కానీ నేను ప్రకాశం కలిసే ఉన్నది దాదాపుగ పన్నెండేళ్ళు! పొరబాటుగనైనా కలహించుకున్న సందర్భాలు లేవన్నది అతిశయోక్తి గాదు.

ఇంటికి తీసుకొచ్చాను. కాఫీ కాద్దామని చెపబోయేసరికి రామం వచ్చాడు.

'రామం, కాస్త కాఫీ కలిపి పెట్టు' అన్నాను నేను.

ఏమనుకున్నాడో ఏమో గానీ, రామం వెళ్ళిపోగానే అన్నాడు ప్రకాశం—'చాల తప్పుపని చేశావురా!'

నాకు అర్థంగాలేదు. ఏమిటని అడిగాను.

'నీ స్టూడెంటును కాఫీ కలిపి పెట్టమనటం...ఛ బాగలేదురా!'

నేను నవ్వుతూ అన్నాను—'రోజూ అతనే కాస్తాడురా కాఫీ! అదో కథలేరా!' అంటూ విషయాన్ని తుంచివేశాను.

రామం తెచ్చిన కాఫీలు తాగాము. తర్వాత అన్నాడు రామం—'ఈవేళ శాస్త్రి రయ్యగారు రమ్మన్నారండీ! ఇంట్లో తోడెవరూ లేరుట. పోయి పడుకో మన్నారు.'

సరే వెళ్ళమన్నాను ప్రకాశంతో ఏకాంతంగ ఉండచ్చనే ఊహతో.

ప్రకాశం—నా జీవిత చరిత్రలో ఒక భాగం. ప్రకాశం లేక నా జీవిత చరిత్ర లేదు. ప్రకాశంతో నా జీవితం రకరకాలుగ ముడిపడి ఉంది. ఈ ముళ్ళు ఎలా పడ్డాయో, ఏ ముడి ఎవరు వేసారో ఎవరికీ అర్థంగాని పొడికట్లు.

కనిపించిన ప్రతి వారికి ముభావంగా

వాళ్ల ప్రశ్నలకు జవాబులిచ్చి రావిచెట్టు క్రింద రచ్చబండవద్దకు చేరుకున్నాము.

ప్రకాశంకన్న ముఖ్యంగ ఎదుటివారికి కనిపించేది అతనిలోని ధైర్యం—నాకు నవ్వొస్తుంది, అతను చేసిన ఒకటి రెండు పనులు చూసి. ముఖ్యంగా నా పెళ్లి జరగడానికికూడ కారణం ప్రకాశంలోని ధైర్యం!

వెళ్లక వెళ్లక నేను ఏదో పనిమీద రాజమండ్రి వెళ్లటం, అక్కడ ఆ అమ్మాయినిచూసి, వాళ్ల కుటుంబం స్థితిగతులను విచారించడం, ఏదో లోకాభిరామాయణంలా అదే విషయాన్ని ప్రకాశానికి రాయటం...ఆ తర్వాత ఏం జరిగిందోకానీ, ఆ అమ్మాయి తండ్రి నన్ను పెళ్లి చూపులకు రమ్మని కోరటం, తర్వాత పెళ్లి జరగటం కూడ జరిగింది.

పెళ్లియాకనే చెప్పాడు ప్రకాశం—వివాహానికి తను చేసినదేమిటో! నేననే ఒకణ్ణి ఈ ఊళ్లో ఉన్నట్లు రాయటం, కట్నం ప్రధానం కాదనే విషయాన్ని తెలియబరిచి, ప్రయత్నించమనటంకూడ ప్రకాశం పాత్రే!

ప్రకాశం ధైర్యానికి మెచ్చుకోకుండా ఉండలేకపోయాను—ఎవరో తెలియని వ్యక్తికి, ఆ వ్యక్తి కుమార్తె పెళ్లి విషయంలో అయాచితంగ సలహా అందివ్వటం అంత తేలికయిన పనికాదు.

ఉన్నట్టుండి అన్నాడు ప్రకాశం ఏదో. నాకు సరిగా వినిపించలేదు.

'ఏమిటి?' అన్నాను నేను అతనికేసి తిరిగి

'నీకు తెలియదా?'

'ఏ విషయం?'

'నిజంగానే నీకు తెలియదురా?' అన్నాడు ప్రకాశం ఆశ్చర్యపోతూ ఈసారి కొంచెం విసుగ్గానే అడిగాను—'ఏ విషయం అని?'

'రాజ్యానికి పెళ్లయింది.'

రాజ్యం!

మనసు మొద్దుబారి పోయింది.

సందేహం తీర్చుకోవాలనే అడిగాను మళ్లీ—'ఎవరికి?'

'మీ రాజ్యానికేరా! నీ కసలు తెలియదా?'

జవాబివ్వలేకపోయాను నేను.

ఆశ్చర్యమో, దుఃఖమో, సంభ్రమమో—అసలు ఆ పరిస్థితిని ఏమంటారో, ఆ స్థితిని చెప్పటానికి తెలుగులో ఒకపదం ఉందో లేదో కూడ నాకు తెలియదు.

ఏవీ చెప్పకపోతేనే బాగుండనిపించింది—చెప్పదలుచుకున్నా, ఏం చెప్పాలి?

లేచి నిలబడ్డాను పోదాం అన్నట్లు.

ప్రకాశం నన్ను అనుసరించాడు.

* * *

రాత్రి...

కుంపటిమీద గిన్నెలో కుతకుత ఉడుకుతోంది అన్నం.

ఏవేవో ఆలోచనలు!—పనిచేస్తున్నాకాని మనసు నా స్వాధీనంలో లేదు. తన ఇష్టమున్నట్లు ఎక్కడెక్కడో సంచరిస్తూ, ఏవేవో విషయాలను జ్ఞప్తికి తెచ్చుకుంటోంది.

అసలు ఇలా జరిగిందా?

లేకపోతే—లేకపోతే ఇది కేవలం ప్రకాశం కల్పితమా?

ఛ!—మనిషిని, అందులోనూ చిన్ననాట నుండి ప్రాణానికి ప్రాణంగ మసలిన స్నేహితుణ్ణి నమ్మకపోవడం...

కానీ, ఎందుకిలా జరిగింది?

రాజ్యం ఇలా చేయగలిగిందా?

స్వరాజ్యలక్ష్మి—

ఆ పేరే నాలో మధురస్మృతులను రేపుతుందే!

కానీ...ఏమిటిది?

ఇలా చేయగలిగిందా రాజ్యం?

మళ్లీ పెళ్లిచేసుకో గలిగిందా?

నన్ను మర్చిపోయి...

అసలెలా మర్చిపోగలిగింది?

నే నెందుకు మర్చిపోలేక పోతున్నాను—నాకూ రాజ్యానికి పెళ్లయి ఆరేళ్లయింది. ఆరేళ్లేం తక్కువకాలం గాదు. ఎంతో ఈ కాలంలో మర్చిపోయి ఉండచ్చు. పాత స్మృతులకు, పాత సంఘటనలకు సమాధి కట్టి, ఆ సమాధిమీదే నూతన కాంక్షలనే విత్తనాలు చల్లుకొని, హాయిగ మరో జీవితం గడుపుకోవచ్చు.

కాదనను.

కానీ.. రాజ్యం నన్నింత త్వరగ మర్చిపోయి, వేరొకతన్ని పెళ్లాడటం జరగని పని! కానీ ప్రకాశం జరిగిందనే అంటున్నాడు.

'ప్రకాశం!'

ప్రకాశం రాగానే వింతోశక్తి కూడగట్టుకొని అన్నాను నేను—'నేను నమ్మనురా!'

మౌనంగ తల దించుకున్నాడు ప్రకాశం. చాలసేపుతర్వాత అన్నాడు—'మొదట నేనే నమ్మలేదు. కానీ పెళ్లినాకూ ఇన్విటేషన్ వచ్చింది.

ఆశ్చర్యపోయాను—'ఉందా నీ దగ్గర?' అడిగాక బాధపడ్డాను—'ఎందుకడిగానా' అని.

ఔను — ప్రపంచంలో ఎందరివో పెళ్లిళ్లు నాకు తెలియకుండానే జరిగిపోతున్నాయి. మనకు తెలియనంత మాత్రాన కలిగే నష్టంలేదు. తెలిస్తే జరిగే లాభం లేదు.

కానీ...

ఇది స్వరాజ్యలక్ష్మి పెళ్లి!

స్వరాజ్యలక్ష్మి నాకు 'ప్రపంచంలో ఎవరో కాదు—నాకున్న ప్రపంచం అంతా ఆమే'

ప్రకాశం తిరిగి వచ్చాడు శుభలేఖతో. అందుకున్నాను.

నా అర్ధాంగి వివాహమహోత్సవ 'శుభలేఖ!'

నాకేసి అనునయంగ చూశాడు ప్రకాశం. తల త్రిప్పుకొన్నాను ప్రక్కకు—కంట్లో నీరు తిరుగుతోంటే!

'నేనొకటి అడగనా?'

పక్కకు తిరిగిచూశాను ప్రకాశంకేసి

'నిజం చెబుతావురా?'

'అనుమానం ఏమయినా ఉందా నీకు?'

'లేదనుకో...'

'ప్రకాశం, నువ్వుకదరా నా పెళ్లిపెద్దవు—నీ దగ్గర అబద్ధం ఎలా చెప్పగలనురా?' అందామనుకున్నా కానీ ఈస్వరాజ్యలక్ష్మి పెళ్లి నాలోతడిని ఇంకింప జేసింది. అందుకే ఏమీ అనలేకపోయాను

'నువ్వు స్వరాజ్యానికి విడాకులు ఇచ్చావా?'

ఆశ్చర్యపోయినా జవాబు ఇచ్చాను 'లేదు'

ఈసారి ఆశ్చర్యపోయింది ప్రకాశం—'నిజమా?'

'నిజమే!'

'మరేమీ అనుకోకు—మీ ఇద్దరిమధ్య

'గొడవలేమైనా వచ్చాయా?'

చెప్పరంటూ ప్రశ్న!

గొడవ రాకుండా ఇంత ఎలా జరుగుతుంది?

కానీ గొడవ వచ్చిందా అన్నది నాకూ అనుమానమే!

ఆలోచిస్తేనేగానీ అర్థంగాదు—

* * *

పగిన్నర దాటింది. నాకు సెకండ పీరియడ్‌గానీ క్లాస్‌లేదు. అందుకే దూరంగ ఉన్న చింతచెట్టు క్రిందకు వెళ్ళి కూర్చున్నాను ఏదో ఆలోచిస్తూ.

'మాష్టారూ!'

ఎవరో పిలిచినట్లు అయి, ఇటుకేసి తిరిగాను—పదేళ్ళు, పదకొండేళ్ళుంటాయేమో! చింపిరిజుత్తు, లాగు, చొక్కా... ఎవరో!

'ఏంకావాలి?' అన్నాను నేను లేస్తూ.

ఆ అబ్బాయి తడబడ్డాడు. ఏంచెప్పాలో తోచలేదనుకుంటా ఆ అబ్బాయికి.

'చెప్పు.'

'మరేం...మా నాన్న పోయాడండి!' కంఠంలో దుఃఖం కొంత తొంగిచూసింది. 'మాదీ ప్రక్కఊరేనండి! మా నాన్నపోయి పదిరోజులయిందండి' అన్నాడు ఆ అబ్బాయి. నాకు అంతా అర్థమయింది.

బహుశా పదో, పాతికో పైసలు కావాలంటాడు. జేబులో చెయ్యిపెట్టి, చేతికి దొరికిన పావలా కాసు తీశాను.

'తీసుకో!' అన్నాను నేను.

# ఏడడుగులు...

బిడియపడ్డాడు.

నాకు ఆశ్చర్యం వేసింది—ఇలా అబ్బాయిలు రావటం, ఏవో కాగితాలు గట్రా చూపి, డబ్బులు వసూలు చేసుకోవటం మామూలే! కానీ ఇలా డబ్బులు తీసుకోవటానికి బిడియపడ్డాడు వీడే!

'తీసుకో, ఫర్వాలేదు.' అన్నాను నేను మళ్ళీ.

'డబ్బులు అఖ్ఖరలేదండీ!'—అన్నాడు సందేహంగనే ఆ అబ్బాయి

ఆశ్చర్యపోతూ ప్రశ్నించాను—'మరింకేం కావాలి?'

'నాకు...నాకు...'

'చెప్పు—' అన్నాను నేను ప్రోత్సహిస్తూ.

'నాకు...చదువుకోవాలని ఉందండీ! మీరు...వారాలు ఏర్పాటు చేయిస్తే...'

అదిరిపడ్డాను.

'ఇలారా, కూర్చో' అన్నాను నేను.

'ఫర్వాలేదండీ' అంటూనే కూర్చున్నాడు ఆ అబ్బాయి.

'నీపేరేమిటి?'

'రామం.'

'మీ నాన్న ఏం చేసేవాడు?'

'...రిక్షా లాగేవాడండి.'

'ఎలా పోయాడు?'

'మరేమోనండి...కరణంగారబ్బాయిగారి కారుక్రింద పడిపోయాడండి.'




'మరి, కరణంగారేమైనా ఇచ్చారా నీకు?'

'డబ్బాండీ?...లేదండి. ఇన్నాళ్ళా వాళ్ళింట్లోనే ఉన్నాను గదండి.' అన్నాడు రామం. అతనిలో ఇప్పుడంత బిడియం, కొత్త లేవు.

'మరి, కేసు గట్రా ఏమయినా?'—సందేహిస్తూనే అడిగాను. కరణంగారికి ఉన్న పలుకుబడి నాకు తెలియందిగాదు.

చాలాసేపు ఆ అబ్బాయి అలాగే కూర్చున్నాడు. చివరకు మెల్లిగ అన్నాడు—'మాస్టారూ! మీరేం చెప్పారుకారు—'

అవును, ఆ అబ్బాయికి ఏదో చెప్పాలి!

'నా ఇంట్లో ఉందువుగాని...'అన్నాను నేను.

ఆ అబ్బాయికి సంతోషం వేసింది గాబోలు—ముఖం విప్పారింది.

'ఏ వారం అండి?'

'వారంరోజులూ మా ఇంట్లోనే ఉందువుగానిలే!' అన్నాను నేను.

ఇంటికి తీసుకొచ్చాను రామాన్ని.

స్వరాజ్యలక్ష్మి—అదే, నా అర్ధాంగి—నే చేసినపనికి ఎంతగానో సంతోషపడిపోతుందని నేను అనుకోలేదు, కానీ ముభావంగా మాత్రం ఉంటుందనుకోలేదు.

రామం స్నానం చేశాడు—వచ్చేటప్పుడు నేను కొన్న రెడీమేడ్ లాగు చొక్కా వేసుకున్నాడు. తల దువ్వుకునేసరికి—ఆకర్షణీయంగనే ఉన్నాడు.

'వెళ్ళి వీధిగదిలో కూర్చో' అన్నాను నేను రామంతో.

రామం వెళ్ళిపోయాడు.

వంటఇంటిలో కుంపటిమీద రాజ్యం కాఫీ కాస్తోంది. వెళ్ళాను. తలెత్తి చూసింది.

'చెప్పండి.'

'ఏం చెప్పను?' అన్నాను నేను కొంత హాస్యంగ.

'ఏంచెప్పాలని వచ్చారో అది—' అంది రాజ్యం. అంత కఠినంగా రాజ్యం నాతో మాట్లాడిన క్షణాలేవీ నాకు గుర్తులేవు.

విషయం కొంత కఠినంగానే ఉంది అనుకున్నాను.

'ఎవరా అబ్బాయి?'

'ఏమో! ఇన్నాళ్ళిదాకా ఎవరి అబ్బాయో కానీ, ఇకపై మన అబ్బాయి.'

# విజ్ఞానోదయ సాహిత్య పదావళి 4

## వరంగల్లు.2 (ఆ.ప్ర)

రు. **2300** తప్పక గెలవండి

భారత ఉన్నత న్యాయస్థాన తీర్పు ననుసరించి నిర్వహించబడుచున్న సాహిత్య పోటీ

ముగింపు తేదీ **9-5-69**

మొదటి బహుమతి రు **1000** ఆల్ కరెక్టు
రెండవ బహుమతి రు **500** ఒక తప్పు
మూడవ బహుమతి రు **300** రెండుతప్పులు
నాలుగవ బహుమతి రు **250** మూడు తప్పులు
లఘుపదావళి రు **250** ఆల్ కరెక్టు

——— ఇది చింపి పంపండి ———

**చిరునామా :— విజ్ఞానోదయ సాహిత్య పదావళి - 3, వరంగల్లు - 2**

**సూచనలు :—** (1) ప్రతి ఆధారములోను మీరు తప్పుఅని భావించిన పదము ను పిరాతో కొట్టివేయండి. (2) మీరు నాలుగుకన్న తక్కువ కూపనులు పంపదలచుకున్నచో మిగిలినవాటిని కొట్టివేయండి. (3) ప్రవేశశుల్కం M.O. ద్వారా పంపినచో M.O. రశీదు దీనికి తప్పక జతచేయండి. M.O. రశీదులేని కూపనులు పోటీలో చేర్చబడవు. (4) పోస్టల్ ఆర్డరు క్రాస్‌చేయకూడదు. దాని మిద కేవలం విజ్ఞానోదమ సాహిత్య పదావళి వరంగల్లు 2 అని మాత్రమే వ్రాయాలి. (5) ఆల్ కరెక్టు లేనియెడల తక్కువ తప్పులున్న కూపనుకు మొదటిబహుమతి లభించును. ఆ క్రమము ననుసరించి మిగిలిన బహుమతులుకూడా ఇవ్వబడును.

| ① | రు/ | | ② | రు/ | | ③ | రు/ | | ④ | రు/ | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | సులభము | కష్టము | 1 | సులభము | కష్టము | 1 | సులభము | కష్టము | 1 | సులభము | కష్టము |
| 2 | మానవత్వం | దైవత్వం | 2 | మానవత్వం | దైవత్వం | 2 | మానవత్వం | దైవత్వం | 2 | మానవత్వం | దైవత్వం |
| 3 | అతి | మహా | 3 | అతి | మహా | 3 | అతి | మహా | 3 | అతి | మహా |
| 4 | దుర్బలమై | బలహీనమై | 4 | దుర్బలమై | బలహీనమై | 4 | దుర్బలమై | బలహీనమై | 4 | దుర్బలమై | బలహీనమై |
| 5 | నాగరికత | సంస్కృతి | 5 | నాగరికత | సంస్కృతి | 5 | నాగరికత | సంస్కృతి | 5 | నాగరికత | సంస్కృతి |
| 6 | ప్రవృత్తి | ఆసక్తి | 6 | ప్రవృత్తి | ఆసక్తి | 6 | ప్రవృత్తి | ఆసక్తి | 6 | ప్రవృత్తి | ఆసక్తి |
| 7 | పుణ్య | సాధు | 7 | పుణ్య | సాధు | 7 | పుణ్య | సాధు | 7 | పుణ్య | సాధు |
| 8 | ఆదర్శాల | సిద్ధాంతాల | 8 | ఆదర్శాల | సిద్ధాంతాల | 8 | ఆదర్శాల | సిద్ధాంతాల | 8 | ఆదర్శాల | సిద్ధాంతాల |
| 9 | భక్తి | నీతి | 9 | భక్తి | నీతి | 9 | భక్తి | నీతి | 9 | భక్తి | నీతి |
| 10 | జీవితము | ఆనందం | 10 | జీవితము | ఆనందం | 10 | జీవితము | ఆనందం | 10 | జీవితము | ఆనందం |
| 11 | మత | సంఘ | 11 | మత | సంఘ | 11 | మత | సంఘ | 11 | మత | సంఘ |
| 12 | కొన్ని | అనేక | 12 | కొన్ని | అనేక | 12 | కొన్ని | అనేక | 12 | కొన్ని | అనేక |
| 13 | పట్టుదలతో | కష్టపడి | 13 | పట్టుదలతో | కష్టపడి | 13 | పట్టుదలతో | కష్టపడి | 13 | పట్టుదలతో | కష్టపడి |
| 14 | అధికారి | అర్హుడు | 14 | అధికారి | అర్హుడు | 14 | అధికారి | అర్హుడు | 14 | అధికారి | అర్హుడు |
| 15 | పరిస్థితులు | సమస్యలు | 15 | పరిస్థితులు | సమస్యలు | 15 | పరిస్థితులు | సమస్యలు | 15 | పరిస్థితులు | సమస్యలు |

ప్రతి రెండు కూపనులకు ఒక లఘు పదావళి ఉచితము

ప్రతి రెండు కూపనులకు ఒక లఘుపదావళి ఉచితము

| ఉచిత లఘు పదావళి | | |
|---|---|---|
| 4 | దుర్బలమై | బలహీనమై |
| 5 | నాగరికత | సంస్కృతి |
| 10 | జీవితము | ఆనందం |
| 13 | పట్టుదలతో | కష్టపడి |
| 15 | పరిస్థితులు | సమస్యలు |

వి.సా.ప. 4

| ఉచిత లఘు పదావళి | | |
|---|---|---|
| 4 | దుర్బలమై | బలహీనమై |
| 5 | నాగరికత | సంస్కృతి |
| 10 | జీవితము | ఆనందం |
| 13 | పట్టుదలతో | కష్టపడి |
| 15 | పరిస్థితులు | సమస్యలు |

మీ నిబంధనలకు లోబడి ఈ పోటీలో పాల్గొనుచున్నాను. ... కూపనులకుగాను రు. ......... మనీ / పోస్టల్ ఆర్డరుద్వారా పంపి నం.........గల రశీదు జతపరచుచున్నాను.

పేరు ..............................................

చిరునామా ..............................................

——— ఇది చింపి పంపండి ———

### ఆధారములు :

1. ధన సంపాదనము చాల **సులభము/కష్టము.**
2. దీనావస్థలోఉన్న దీన లపట్ల దయ చూపడంలో **మానవత్వం/దైవత్వం** ఉంది.
3. ప్రపంచంలో మనిషికుండే అన్ని బాధల్లోకీ **అతి/మహా** నికృష్టమైంది ఈ అప్పుల బాధ.
4. భారతీయులు సాంకేతిక విద్యలో వెనుకబడినందువలన భారతీ యార్థిక స్తోమత కూడా **దుర్బలమై/బలహీనమై** పోయింది.
5. మానవునకు ధర్మపథమును చూపునదే **నాగరికత/సంస్కృతి.**
6. మానవునికి శ్రద్ధ లేనిచో దేనియందును **ప్రవృత్తి/ఆసక్తి** కలుగదు.
7. పరస్త్రీ, పరధన విముఖుడై, దంభ మాత్సర్యములు లేనివానినే **పుణ్య/సాధు** పురుషుడంటుంది లోకము.
8. బాధ్యతను నెమరువేసుకోవడంలో గౌరవం, అవి విూద యిచ్చనశించి **ఆదర్శాల/సిద్ధాంతాల** విూద మమకారం పెరిగిపోతుంది.
9. **భక్తి/నీతి** సమస్త ధర్మములకు మూలము.
10. ప్రేమ గల చోటనే **జీవితము/ఆనందము** కలదు.
11. **మత/సంఘ** నియమాలు కూడా దేశ కాల పరిస్థితుల్నిబట్టి నిర్ణయించబడతాయి.
12. జీవన యాత్రలో **కొన్ని/అనేక** పొర్లు తప్పటడుగు వేయడం మానవుడికి సహజం.
13. **పట్టుదలతో/కష్టపడి** నేర్చుకుంటే యే విద్య అయినా వస్తుంది.
14. ప్రాణమును సృజింపలేని మానవుడు ప్రాణమును తీయుటకు **అధికారి/అర్హుడు** కాడు.
15. **పరిస్థితులు/సమస్యలు** చదరంగంలాంటివి

### పదావళి 3 కి సొల్యూషన్

1. పూజింప 2. సులభల 3. కళల 4. వివాదం 5. వ్యాధి 6. నూరు 7. పిల్లలు 8. ఘోర 9. మానవులు 10. స్నేహాలు 11. ధైర్యం 12. ధైర్యం 13. ఆత్మ 14. నిరసించి 15. అనుభవాల.

## ఏ జెం ట్లు కా వ లె ను

వివరములకు వ్రాయండి.

**నిబంధనలు :—** (1) ఆధారములు భారతీయ రచయితల గ్రంథములనుండి తీసుకొనబడినవి. ప్రతి ఆధారములోనూ మా "కూర్పరి" ఒక పదమును చేర్చును. పోటీదారులు ఆపదమును గుర్తించి కొట్టివేయాలి, రచయిత గ్రంథములో వాడిన పదముమాత్రమే సరిఅయినది. (2) ప్రతి కూపనుకు ప్రవేశశుల్కం ఒక రూపాయిచొప్పున చెల్లించి తాము ఎన్నికూపనులైనను ఒకేపేరుతో పంపుకొనవచ్చును. ప్రతి రెండు కూపనులకు ఒక లఘుపదావళి ఉచితం. ఆల్‌కరక్టు నుండి మూడు తప్పులవరకుగల ప్రతి కూపనుకు బహుమతి లభించును. లఘుపదావళిలో ఆల్‌కరక్టువారికి మాత్రమే బహుమతి లభించును. (3) ప్రవేశ శుల్కం మనీ / పోస్టల్ ఆర్డరుద్వారా పంపవచ్చును. (4) ఒకరికన్న ఎక్కువమంది విజేతలున్నచో బహుమతి మొత్తం అందరికి సమానముగా పంచబడును. (5) 16—5—69 లోగా గ్రంథాది వివరణ విజేతల పట్టిక ప్రచురించబడును. కూపనులు మరియు విజేతల పట్టిక కావలసినవారు —15 పైసల పోస్టేజి అదనంగాపంపి పొందవచ్చును. తెల్లకాగితముపై వరుసక్రమములో పదములువ్రాసి పంపినను అంగీకరించబడును. (6) గడువుదాటిన తరువాత వచ్చు కూపనులు పోటీలో చేర్చబడవు. (7) పోస్టువారి ఆలస్యమునకు మా బాధ్యత ఉండబోదు. (8) ఒకే కవరులో ఎందరి కూపనులైనా ఒకే M.O. ద్వారా ఎందరి ప్రవేశశుల్కమైన పంపవచ్చును. (9) ఇది కేవలం తెలివి, అనుభవమూ, జ్ఞాపక శక్తితో సాధింపగల సాహిత్య పోటీ. (10) ఇందుకు సంబంధించిన వివాదము లన్నియు వరంగల్లు న్యాయ స్థానములో మాత్రమే పరిష్కరించుకొనవలెను.

'అంటే...?'

'మన ఇంటిలో ఉండి చదువు కుంటాడు.'

ఏమనుకుందోగానీ, కొంతసేపు ఏమీ అన లేదు—'వారాల కుర్రాడా?'

'కాదు' అన్నాను నేను మనసులో చెల రేగుతున్న అశాంతిని ఆపుకుంటూ. 'కొంచెం కనిపెడుతూ ఉండు' అని లేచాను.

'కాఫీ తీసుకువెళ్ళండి.' అంటూ నన్ను ఆపింది రాజ్యం—'కనిపెట్టడం అంటే?'

ఈ ప్రశ్నకు జవాబులేదు నాదగ్గర. అందుకే తడుముకుంటూ జవాబిచ్చాను— 'అంటే...కొంచెం ఆలనాపాలనాచూస్తూండు. వేళకు తిండిగట్రా...'

'అడ్డమైన వెధవలకు చేయడం నా వల్లగాదు.'

ఆప్రయోగం నాకు ఎక్కడో తగిలింది. మళ్ళీ కూర్చున్నాను. రాజ్యం మనసులోఉన్న ఈభావాన్ని తొలగించాలి ముందు. తర్వాత ఏదైనా!

'చూడు రాజ్యం, అతనూ మనలాటివాడే నని ఎందుకనుకోవు?'

'మనలాటివాడెలా అవుతాడు?' సూటి గనే అడిగింది రాజ్యం.

'కాదు రాజ్యం. ఆ భావం రానివ్వకోకు. మనం అంతా ఒకటే! అతనికి లేదు. మన కున్నది అతనికీ కొంత పెడదాం:'

'ఎన్నాళ్ళు?'

'ఏమో, ఇది నేనాలోచించలేదు. నాచేత నయినంతకాలం...'

'మీసంగతేమో కానీ, నాకసలు చేత గాదు—బజారులో వాళ్ళకు చేయటం.'

'బాగా ఆలోచించు రాజ్యం! చదువు కుంటానని మన పంచ చేరాడు. మనకున్నది అతనికి కొంతపెడదాం. అది మానవత.'

'ఏమో...నాకుతెలియదు.' అంది కాఫీ అందిస్తూ.

'రామం, వచ్చి కాఫీ తీసుకెళ్ళు' అన్నాను నేను.

నాకేసి ఒకసారి చూసి, గ్లాసులో కాఫీ పోసి ఇచ్చింది రాజ్యం.

మౌనంగా అందుకున్నాడతను.

* * *

'మీరసలు నాబాధ అర్థంచేసుకోరేం?'

ఆరోజు సాయంత్రం నేనూ రామం బజారులోకి వెళ్ళి, రామానికి రెండుజతల బట్టలు, కంచం, గ్లాసు వగైరాలు కొని

# ఏడడుగులు...

ఇంటికి తిరిగి రాగానే రాజ్యం అడిగినప్రశ్న అది.

'నాకు తెలియదు—ఏమిటి నీ బాధ?'

'మీకెలా చెప్పను? ఈ అడ్డమైన వాళ్ళకూ చాకిరీ చేయడం నావల్లగాదు. మీరు వినిపించుకోరేం? ఖచ్చితంగా చెబు తున్నాను—ఇతనిక్కడ ఉండడానికి వీల్లేదు.'

'ఏం?'

'నేనతనికి చెయ్యను గనుక!' వ్యవహారం హద్దు మీరి తీవ్రంగా చేయి దాటింది.

'నాకు చెయ్యగలవా?'

'మీకూ అతనికీ పోటి ఏమిటి? మీరు నా భర్త. అతనెవరో...' ఎందుకో పూర్తి చేయలేదు రాజ్యం. కానీ నాకాభావం తెలుసు.

'అడ్డమైన వెధవ!'

'కాదు రాజ్యం; మనకు చేసిందే, అత నికీ ఓరవ్వ పెడితేసరి—ఇందులో అధికంగా కష్టపడడం అంటూ ఏమిటి?'

'ఏమో — నాకు ఇష్టం లేదు.' చాల నిష్కర్షగా చెప్పింది రాజ్యం.

ఇందుకే నాకు రాజ్యం అంటే ఇష్టం! ముఖంమీద ఒకటి, మనసులో ఒకటి లేవు— కానీ మనసులో ఉన్నదే నాకు నచ్చటం లేదు.

వారం రోజులు ఇట్టే గడిచాయి.

తర్వాత కూడ ఒకసారి రాజ్యానికీ నాకూ ఇదే విషయంలో ఘర్షణ జరిగింది.

ఇది...నా ధర్మం. నేను చేసేది తప్పు కాదు. పైగా అది నా బాధ్యత!

* * *

'పరీక్షలు జరగటం, రాము పరీక్షలో పాసవటం జరిగింది.

స్కూళ్ళు తెరిచారు — అప్పుడూ రాజ్యంతో ఈ విషయంలోనే గొడవయింది.

'మీరతనికి వారాలయినా ఏర్పాటు చేయండి!'

'ఎందుకు??'

'ఇంక నేను చేయను—వారానికి ఒక్క రోజంటే, ఏదో సరు కోగలను'

కానీ నేనంగీకరించలేక పోయాను — రాజ్యం వైఖరిలో తేడా వచ్చింది గనుక చాల సంతోషించాను. ఇంక కొన్నాళ్ళు జరిగితే...ఫర్వాలేదు.

మర్నాడు స్కూలు నుంచి తిరిగి వచ్చే సరికి కాగితం ఎగురుతూ టేబిల్ మీద కనిపించింది—ఆత్రుతగ తీసి చూశాను.

'నేను వెళ్ళి పోతున్నాను—రావటానికి వేరే ఏర్పాటు చేయగనే తెలియపర్చండి. వెంటనే వచ్చేస్తాను.'

'అల్టిమేటమ్!'

అయినా లొంగి పోలేను నేను.

అంతే! — తర్వాత రాజ్యానికి, నాకూ ఉత్తరాలు కూడ లేవు.

మొదట్లో చాల బాధ పడేవాణ్ణి — కానీ...

కానీ నేనేం చేయను?

ఈ నైతిక బంధాన్ని ఎలా తెంచుకోను? అది నాకు వలను గాని పని.

* * *

అంతా విన్నాడు ప్రకాశం.

'కానీ...నీదే తప్పు రా!'

ప్రకాశం అలా అనేసరికి ఆశ్చర్య పోయాను.

తప్పు నాదా?

'కాదురా ప్రకాశం! రామానికి చేసి నంత మాత్రంలో ఏ మునిగిపోతుంది?'

'ఏమో మరి! ఆవిడకు ఆ పట్టుదల ఉంటే, మనం తల ఒగ్గడం మంచిది. కొందరికి, తన వాళ్ళకు తప్ప ఇతరులకు చేయడం ఇష్టం ఉండదు. అది మనమూ గ్రహించాలి.'

ఇక తప్పదు—ఎవరికీ చెప్పనిది ఇతనికి చెప్పాలి!

'కానీ, ప్రకాశం! అందరమూ అలానే ఎవరికివారే అనుకుంటే ఏమవుతాడు అతను?'

'ఏమో!'

'అంతేరా!—అందరూ అలానే అనుకుంటె నేనుకూడ ఇలా ఉండగలిగేవాణ్ణి కాదు. వెంకట్రామయ్యగారు నా తండ్రి కాదురా!'

ప్రకాశం నోరు తెరిచాడు ఆశ్చర్యంతో.

'...లోకంలో ఎవరికీ, ఆఖరికీ రాజ్యా నికి కూడ తెలియదురా!— నాకూ మొన్ననే వెంకట్రామయ్యగారు చెప్పాకనే తెలిసింది! నేను ఇలా చదువుకున్నవాడినే! ... నేను ఏ కులంలో పుట్టానో నాకే తెలియదు. బ్రాహ్మలకుర్రాడిగ, వెంకట్రామయ్యగారి అబ్బాయిగనే చలామణీ అయ్యాను. ఈ విషయం రాజ్యానికి ఎలా చెప్పనురా?'

ప్రకాశంవద్దనుంచీ నేనేమీ జవాబు ఆశించలేదు. ●

## డెహ్రాడూన్ ఆంధ్రసమితి

డెహ్రాడూన్ ఆంధ్రసమితి అధ్వర్యమున శ్రీ మంగళంపల్లి బాల మురళీకృష్ణగారి గానకచేరి మార్చి 25వ తేదీన జరుపబడినది.

## ప్రకృతి నాటకకళాపరిషత్తు

సూళ్ళూరుపేటలో— 'ప్రకృతి నాటక కళా పరిషత్' సాంస్కృతిక కళోత్సవములను, 69 జూన్ మాసంలో అఖిల భారత స్థాయిలో భారీ యెత్తున జరుపుటకు సర్వ సన్నాహాలు చేస్తున్నారు. పోటీలలో తెలుగు నాటక సమాజములు, తెలుగు కళాకారులందరూ పాల్గొన వచ్చును.

నిబంధనావళి, దరఖాస్తు ఫారములకు— ప్రధాన కార్యదర్శి 'ప్రకృతి నాటక కళాపరిషత్' సూళ్ళూరుపేట., నెల్లూరు జిల్లా.

*　　*　　*

సౌమ్య సంవత్సరాది సందర్భంగా కోయంబత్తూరు తెలుగు సాంస్కృతిక సమితి క్రీడా, వినోద కార్యక్రమాలని ఏర్పాటు చేసింది. స్థానిక కళాశాలల విద్యార్థులు, పురప్రముఖులు పాల్గొని ఈ కార్యక్రమాలని జయప్రదం గావించారు.

(ఒ. వి.)

*　　*　　*

స్థానిక నిజాం షుగర్ ఫ్యాక్టరీ జంట్స్ క్లబ్ వారి ఆవరణలో ప్రత్యేకంగా నిర్మింపబడిన రంగస్థలంపై మార్చి 2 వ తేదీ మొదలు 8 వ తేదీ వరకు సాంస్కృతికోత్సవాలు తెలుగు, ఉర్దూ భాషలలో వైభవోపేతంగా జరిగాయి.

*　　*　　*

కొత్తఢిల్లీలోని దక్షిణభారత నటీనట సమాఖ్య మార్చి 12వ తేదీన స్థానిక మవలంకర్ థియేటర్ కుమారి రత్నపాప, కుమారి సీతల భారతనాట్యం, కూచిపూడినృత్యాలను నిర్వహించింది. మార్చి 29వతేదీన సమాఖ్య స్థానిక వై. ఎం. సి. ఎ. హాలులో ప్రపంచ రంగస్థల దినోత్సవాన్ని పాటించింది సభకు శ్రీ దామోదరం సంజీవయ్య అధ్యక్షత వహించారు. శ్రీ కొర్రపాటి గంగాధరరావు రచించిన 'వాబాబు' నాటికను ప్రదర్శించరు. (ఒ. వి)

*　　*　　*

సౌమ్య ఉగాది సందర్భంగా శ్రీకాకుళం యువభారతి సాహిత్య, సాంస్కృతిక సంస్థ సాహిత్య సమావేశం జరుపుకున్నది ఈ సమావేశానికి జిల్లా కేంద్ర గ్రంథాలయాధ్యక్షులు శ్రీ చల్లా నరసింహంనాయుడు అధ్యక్షత వహించారు (ఒ. వి)

## వి వా హం

'ఆంధ్ర సోదరీమణు'లలో ఒకరైన చి. సౌ విజయలక్ష్మి వివాహం ఇటీవల బందరులో చి. రామకృష్ణప్రసాద్‌తో వైభవంగా జరిగినది. వరుడు చి. రామకృష్ణప్రసాద్ బొంబాయి హిందూస్థాన్ మిల్స్‌లో కాస్టింగ్ అఫీసరుగా వున్నారు.



పద్మశ్రీ నేదురుమల్లి బాలకృష్ణారెడ్డి వాకాడులో 17 విద్యాసంస్థలు స్థాపించారు. 3 వేల మంది విద్యార్థులకు ఉచిత భోజన, విద్యాసౌకర్యాలు కల్పించారు. ఇటీవల ఆయనకి శ్రీ ఎన్. టి. రామారావు సన్మానం చేస్తున్న దృశ్యం.



'విచిత్రకుటుంబం'లో జ్యోతిలక్ష్మి, విజయరాణి.

# సినిమా

'శ్రీ కృష్ణావతారం' చిత్రం ద్వారా తనకొక ప్రత్యేకతను సంపాదించుకున్న పుండరీకాక్షయ్య యిపుడు 'భలేతమ్ముడు' అనే సాంఘికాన్ని నిర్మిస్తున్నారు. మొదటి చిత్రంలో శ్రీ కృష్ణుడిగా మీ మనస్సును దోచుకున్న రామారావు యీ చిత్రంలో తన్నడే రెండు విభిన్న పాత్రలద్వారా మరోసారి పాత్రలకు గల వ్యత్యాసాన్ని తన నటన ద్వారా ప్రస్ఫుట పరిచారు. అఖిలభారత ప్రశంసల నందుకున్న మధుర గాయకుడు మహమ్మద్‌రఫీచే 'భలేతమ్ముడు' చిత్రంలోని అన్ని పాటలను పాడించారు నిర్మాత. ఒక ముఖ్యపాత్ర నిర్వహణకు ప్రముఖనటి కాంచన చెల్లెలిని పరిచయంచేసి ఆమెకు చలనచిత్ర రంగంలో ఉజ్వల భవిష్యత్తు యేర్పడేందుకు కారణభూతులయిన పుండరీకాక్షయ్య యీ సాంఘికాన్ని భారీయెత్తున నిర్మిస్తున్నారు. విజయపిక్చర్స్ ద్వారా విడుదల కానున్న యీ చిత్రానికి బి. విఠ్ఠల్ సుబ్బారావు దర్శకుడు; కె. ఆర్. విజయ, రాజనాల, ప్రభాకరరెడ్డి, శ్రీరంజని యితర ముఖ్యపాత్రలను ధరిస్తున్న యీ చిత్రం యొక్క ఛాయాగ్రహణాన్ని ఎస్. ఎస్. లాల్, సంగీతాన్ని టి. వి. రాజు నిర్వహించారు.

## హైదరాబాద్ పరిసరాలలో నాగేశ్వరరావు, వాణిశ్రీ ఆటపాటలు

'హిప్ హిప్ హురే
ఓహో బలే
చేంయా చేంయా కలిగలవు

నీదీ—నాదీ — తొలి గెలుపు' అంటూ వాణిశ్రీ, అక్కినేని హైదరాబాదు పరిసర ప్రాంతాల్లో ఆడుతూ పాడడాన్ని శ్రీవిజయ భట్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న 'భలే రంగడు' చిత్రానికిగాను దర్శకుడు తాతినేని రామారావు యిటీవల చిత్రీకరించినట్లు భగీరథమాన్షన్ వీధిలోని వారి ఆఫీసులో కలసినప్పుడు వెల్లడించారు. అక్కినేని నాగేశ్వరరావు 'భలేరంగడు'లో ఒక కొత్త తరహా పాత్రను పోషించినట్లు నిర్మాత భట్ వెల్లడించారు. పిక్చరు యిప్పటికి సదిరీళ్లు తయారయినట్లు, యీ నెల జరుగనున్న షెడ్యూల్లుతో షూటింగు పూర్తి కానున్నట్లు, జూన్ మాసంలో చిత్రాన్ని విడుదల చెయ్యాలనుకుంటున్నట్లు భట్ వివరించారు. ఈ చిత్రానికి కె. వి. మహదేవన్ సంగీతాన్ని వినిపించారు. ఆర్ట్, సంభాషణలు, కెమెరా, కూర్పు శాఖలను వరుసగా జి. వి. సుబ్బారావు; ముళ్లపూడి మరియు గొల్లపూడి మారుతీరావు, కె. ఎస్. రామకృష్ణ, క్రిష్ణస్వామి నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం యొక్క నిర్మాణ కార్య కలాపాలను పి. ఎస్. రావు, కృష్ణమూర్తి నిర్వహిస్తున్నారు.

## నాగేశ్వరరావు కె. ఆర్. విజయలకు ఎడబాటు

అది వాహిని స్టుడియోలోని ఏడవ ఫ్లోరు. నేను వెళ్లిన సమయానికి శ్రీ నాగేశ్వరరావు దీర్ఘాలోచనాపరుడై ఆకాశా



చిత్రకల్పనవారి సాంఘిక చిత్రంలో విజయనిర్మల, నాగేశ్వరరావు

కిసి చూస్తున్నారు; ఆయన అలా వుండ డానికి కారణమేమిటని దర్శకుడు శ్రీ శేష గిరిరావును అడిగాను. ఆయన యిచ్చిన సమాధానాన్ని మీరూ తెలుసుకోండి. కె. ఆర్. విజయ, నాగేశ్వరరావులు అన్యోన్య దాంపత్యాన్ని గడుపుతుండేవారట; ఏదో దుస్సంఘటన ఫలితంగా నాగేశ్వరరావు చని పోయారని విజయకు ఆమె తండ్రి మిక్కిలి నేని చెప్పారట. ఆమె తన భర్త స్వర్గస్థు లయ్యారనేడి విషయాన్ని నమ్మిందట. కానీ నాగేశ్వరరావు విధివ్రాత ప్రకారం మరొక స్థలానికి చేరుకున్నారట. తన భార్యతో గడిపిన మధురక్షణాలను సింహావ లోకనం చేసుకోవడం చేత అక్కినేని అలా వున్నారు అని శేషగిరిరావు వివరించారు; తన భర్త చనిపోయారని నిర్ణయించుకున్న విజయ గతేమిటి? భార్యాభర్తలు కలుసు కునే అవకాశం యేర్పడుతుందా? అనేడి ప్రశ్నలకు సురేష్ మూవీస్ నిర్మిస్తున్న చిత్రమే సమాధానం యివ్వగలదు. ఈ సాంఘికంలో నాగేశ్వరరావు విభిన్న స్వరూప స్వభావాలు గల్గిన రెండు పాత్రలను వైవిధ్యమయిన నటనా నైపుణ్యంతో నిర్వ హిస్తున్నారు. శ్రీ తురయూర్‌మూర్తి కథకు, శ్రీ భమిడిపాటి సంభాషణలను సమకూరుస్తున్న యీ చిత్రంలో జగ్గయ్య, రాజబాబు, సత్యనారాయణ, మిక్కిలినేని, విజయలక్ష్మి, పండరీబాయి ముఖ్య పాత్ర లను పోషిస్తున్నారు. శ్రీ రామానాయుడు నిర్మిస్తున్న యీ చిత్రాన్ని నవయుగా పిక్చర్స్ విడుదల చేస్తారు.

**వనితల వలలో**

## చిక్కుకున్న రామారావు

ఏడవ ఫ్లోరునుండి నాల్గవ ఫ్లోరుకు వచ్చాను. అక్కడ శ్రీ ఎన్.టి. రామారావు రాజసం వుట్టిపడే తన గంభీరమయిన నడ కతో బయల్దేరి వస్తుంటే, ఆయన అంద చందాలకు ఏనమండుగురు ముగ్ధమోహన కాంతలు దాసోహమంటూ ఆయన్ను వెంబ డించారు; ఆయన్ను చూడగానే ఆ కాంతల నోటంట కమ్మటిపాట తనంతట తానే వచ్చేసింది. వాళ్ళు పాడినపాట యెలా వుందని మీకు తెలుసుకోవాలనివుంటుందికదా.

'సరిసరి మగసిరి నీ అందము,
మరిమరి మనసుకు ఆనందము,
తకఝుణత
తకధిమిత
రారా రతిరాజా.'—అంటూ పాడారు;

ఆ దృశ్యాన్ని చూస్తుంటే నాకు ఆశ్చర్య మేసింది. ప్రక్కనేవున్న దర్శకుడు శ్రీ బి వి శ్రీనివాస్‌ను పైపాటను గురించి అడిగాను. ఆయనిచ్చిన సమాధానాన్ని సావ ధానంగా చదవండి. శ్రీ రామారావు తన తండ్రి మిక్కిలినేని కంటిచూపును గుణ పర్చగల దివ్యమణిని సాధించేందుకై ప్రయాణం చేస్తున్న సమయంలో యీ వని తలు ఆయన్ను వరించి, ఒక రహస్యమంది రానికి తీసికెళ్తారట,ఆ వనితలవలలో చిక్కు కున్న రామారావు యెలా బయటపడ్డారు? తాను ఆ దివ్యమణిని సాధించారా? తన తండ్రికి కంటిచూపును తెప్పించారా? అనేడి సందేహాలు తీరాలంటే విఠల్ కంబైన్స్ నిర్మిస్తున్న జానపదచిత్రం చూడాల్సిందే. శ్రీ బి. వి. శ్రీనివాస్ దర్శకత్వం నెరపు తున్న యీచిత్రానికి జి. కె. మూర్తి కథ కుడు; జయలలిత, రాజేశ్వరి, యడవల్లి రమ, రామకృష్ణ, మిక్కిలినేని ముఖ్యపాత్ర లను పోషిస్తున్న యీ చిత్రానికి విజయా కృష్ణమూర్తి సంగీత దర్శకుడు, వేణు ఛాయాగ్రాహకుడు, నాగరాజన్ కళాదర్శ కుడు భారీఎత్తున నిర్మింపబడుతున్న యీ చిత్రాన్ని విజయా పిక్చర్స్ విడుదల చేస్తారు.

## నాట్య సుందరీమణులను సృష్టించిన రాజనాల

పై రెండు షూటింగులను చూచే సరికి మధ్యాహ్నం ఒంటి గంటయింది. అందరూ భోజనాలకు వెళ్ళారు. మధ్యా హ్నం రెండు గంటలా అయిదు నిమిషాలకు మూడవ ఫ్లోర్‌లోకి ప్రవేశించాను. అక్కడ మాంత్రిక శిఖామణి వేషంలో భయంక రంగా రాజనాల నిలబడి వున్నారు. ఆయన చేతిలో వున్న మంత్రదండాన్ని మూడు సార్లు వూపేసరికి అప్సరసల్లాంటి రాజశ్రీ,



'ఆత్మీయులు'లో విజయనిర్మల, నాగేశ్వరరావు,

విజయశ్రీలు తకధిమి అంటూ నాట్యం చేస్తూ ప్రత్యక్షమయ్యారు. వాళ్ళు నాట్యం చేస్తుంటే, రాజనాల కళ్ళు వాళ్ళమీద పడ్డాయి. 'కట్' అన్నారు దర్శకుడు విశ్వనాథం. ఈ సన్నివేశం నవ భారత్ కంబైన్సు నిర్మిస్తున్న 'ఉక్కు పిడుగు' చిత్రంలో కనిపిస్తుంది. శ్రీయు తులు ప్రకాశరావు, రెడ్డి నిర్మించే ఈ చిత్రానికి వీటూరి రచయిత. కోదండపాణి సంగీతకర్త అని మీకు యిదివరకే తెలి సాను ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను కాంతారావు, రాజనాల, సత్యనారాయణ,



'ఆత్మీయులు'లో పద్మనాభం, విజయనిర్మల, నాగేశ్వరరావు.

## సినివహా

ప్రభాకరరెడ్డి, దూళిపాళ, రాజబాబు, రాజశ్రీ, విజయశ్రీ, విజయలలిత పోషిస్తున్నారు.

*  *  *

పై పాట కాగానే లైటింగు మార్పు కోసమని వచ్చింది: ఆ గ్యాపులో రాజనాల ఆరుబయటకు వెళ్ళారు ఆయన్ని వెంబడించాను, 'సారీ సార్, మీ సహధర్మచారిణి దివంగతు లయ్యారని విన్నాను' అన్నానో లేదో రాజనాల కళ్ళంట నీళ్ళు ధారాప్రవాహంగా రాసాగాయి. ఆయన ఒక క్షణం తటిలో సంబాళించుకొని తన భార్యపై ఆయనకు గల ప్రేమాభిమానాన్ని వెల్లడించినప్పుడు నాకు కూడ కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి 'నాకు ఆమె భార్య మాత్రమే కాదు నాకు తల్లి, స్నేహితురాలు, పాపాయిలాగా వుండేది. ప్రతిరోజు ఆమెచేతులతో ముద్ద కలిపిపెట్టే ది. మేమిద్దరం సరదాగా, ఆహ్లాదంగా కాలాన్ని వెళ్ళబుచ్చే వాళ్ళం, యిప్పుడు ఆమె ప్రతిబింబమే ప్రతి వస్తువులో కనిపిస్తూంది. అందుకే సరోజినీ వీధి నుండి గోకులం కాలనీకి (కొంతయినా మనశ్శాంతి యేర్పడుతుందేమోనని) మకాం మార్చాను' అన్నారు రాజనాల.

**కృష్ణకి వాణిశ్రీ సహాయం!**

ఆ రోజు నా కార్యక్రమం వాహినితో ప్రారంభమైంది. రెండవరోజు శారదాకు వెళ్ళాను. అది సస్పెన్సుఫ్లోరు. నేను లోపలికి వెళ్ళినప్పుడు కృష్ణ పరధ్యానంగా యెక్కడో చూస్తూ నిలబడి వున్నారు, ఆ సమయానికే వాణిశ్రీ కాఫీ కప్పుతో కృష్ణ దగ్గరగా వచ్చి మూడు సార్లు పిలిచింది కృష్ణ మూడవ పిలుపుకు వెనుదిరిగి చూచారు ఆయన ముఖం దిగులుగా స్పష్టమనిపించింది వాణిశ్రీకి. 'ఏమిటండీ అలా వున్నారు?' అని ప్రశ్నించింది వాణిశ్రీ, 'మరేం లేదు. నా తల్లిని ఆ భయంకర్ బారి నుండి తప్పించే వరకు నాకు మనశ్శాంతి వుండదు నాకు మీ సహాయం చాలా అవసరం? చెయ్యగలరా చెప్పండి' అని కృష్ణ అడిగారు 'మీరు "అండి" అని పిలిస్తే నా మీద ఒట్టు! మీరు ఆజ్ఞాపిస్తే చాలు, యేం కావాలన్నా చేస్తాను' అని మాట యిచ్చింది వాణిశ్రీ. 'కట్' అన్నారు దర్శకుడు అయ్యర్ మూర్తి; కృష్ణ తల్లి యెవరు? ఆమెను భయంకర్ యెందుకు బంధించాడు? వాణిశ్రీ కృష్ణకేమవుతుంది? అనే ప్రశ్నలకు సమాధానం దొరకాలంటే ఫల్గుణా పిక్చర్స్ నిర్మిస్తున్న 'జగత్కిలాడీలు' చూడాల్సిందే. శ్రీయుతులు ఏకామ్రేశ్వరరావు, రఘువ నిర్మిస్తున్న యీ చిత్రంలోని ముఖ్యపాత్రలను రంగారావు, గుమ్మడి, రాజబాబు, ప్రభాకరరెడ్డి, జి వరలక్ష్మి, విజయలలిత, మాలతి ధరిస్తున్నారు. ఈచిత్రంలోని భయంకర్ పాత్రను ఒక పుత్తమస్టేజినటుడు అత్యుత్తమంగా పోషిస్తున్నారు. 'జగత్కిలాడీలు' చిత్రాన్ని లక్ష్మి ఫిలింస్ ఆధిత్వరలో విడుదల చేసేందుకు ప్రయత్నిస్తున్నారు.

*  *  *

శారదానుండి యెదురుగా వున్న భరణీకి వెళ్ళాను. నేను వెళ్ళిన సమయంలో విజేతా



'పంచకళ్యాణి—దొంగలరాణి'లో త్యాగరాజు, సురేఖ.

పిక్చర్స్ 'జరిగినకథ' షూటింగు జరుగుతూ వుండింది ఈ చిత్రాన్ని ఆర్టు డైరెక్టరు ప్రభాకర్ నిర్మిస్తున్నారు; వారి తమ్ముడు బాబూరావు డైరెక్టు చేస్తున్నారు. ఆరోజు నేను చూచిన షూటింగును మీకు యిక్కడ తెలియ చేస్తాను.

**విజయలలిత నృత్యాలతో**
**విసుగెత్తిన జగ్గయ్య**

శ్రీ జగ్గయ్య నృత్య కళాకేంద్రాన్ని నడుపుతున్నారు. అక్కడ విజయలలిత నాట్యకర్త్రిగా వుంటుంది. ఆమె ప్రదర్శనలతో విసుగెత్తిపోయిన జగ్గయ్య తన తమ్ముడు కృష్ణతో మరొక కొత్త అమ్మాయిచేత నృత్యప్రదర్శనలు యిప్పించడం మంచిదని సలహా యిస్తారు. తన అన్నయ్య చెప్పినప్రకారం కృష్ణ మరొక నూతన నాట్యకర్త్రిచే నృత్యప్రదర్శన చేయిస్తారు. ఆమె కళా వైదుష్యానికి వూరంతా ముగ్ధులవుతారు. తన తమ్ముడు యింత గట్టివాడు అయినందుకు జగ్గయ్య అమితానందభరితులయ్యారు. ఆ నాట్యకర్త్రి ఎవరో మీకు తెలియాలిగ. ఆమె మరెవ్వరో కాదు—మీ అభిమాన తార కాంచనయే. జగ్గయ్యగారి కళాకేంద్రానికి కాంచన రావలసిన కారణమేమి? అసలామెది ఏ వూరు? ఆమె తల్లిదండ్రులెవరు? ఆమెను కృష్ణ యెలా కలుసుకున్నారు? అనేడి అంశాలను 'జరిగినకథ' చిత్రం తెల్పుతుంది. మే మాసంలో విడుదల కానున్న ఈ సాంఘిక చిత్రం మహిళాలోకానికి ఆదర్శప్రాయంగా వుండగలదని వూహించబస్తుంది.

**విడిపోయిన విజయనిర్మల.**

**కృష్ణలని కలపటానికి**
**ప్రభాకరరెడ్డి ప్రయత్నం?**

భరణినుండి గోల్డెన్‌కు దారి తీసాను. అక్కడికి వెళ్ళగానే 'కృష్ణ, విజయనిర్మల విడిపోయారు' అనేడి వార్త నాకు షాక్ తగిలినట్టయింది. ఈ మధ్యనేగా పెళ్ళి చేసుకున్నారు? ఇంతలోనే ఈ అవాంతరమా? అని విస్తుపోయాను. వీళ్ళిద్దర్నీ కలపడానికి ప్రభాకరరెడ్డి ప్రయత్నిస్తున్నట్టు కూడా తెలిసింది. ఇది నిజమా, కట్టుకథా అనిపించింది. నాకేమిటి? మీకూ అనిపిస్తుందిగా ఇది నిజంగా జరిగిందనుకునేరు సుమా: ఇలాంటి సంఘటన మిత్రా ప్రొడక్షన్సు తెలుగులో నిర్మిస్తున్న జీవనాంశం' చిత్రంలో వస్తుంది. శ్రీ సూర్యనారాయణ నిర్మిస్తున్న ఈ చిత్రానికి శ్రీ సి. ఎస్. రావు దర్శకులు. శ్రీ ఆరుద్ర రచన చేసిన ఈ చిత్రంలో కృష్ణ, కృష్ణంరాజు, ప్రభాకరరెడ్డి, రేలంగి, రాజబాబు, విజయనిర్మల, అనిత, ఉదయచంద్రిక, సూర్యకాంతం ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు. జి. కె. రాము కెమేరాను, మహదేవన్ సంగీతాన్ని, నారాయణరావు దుస్తుల శాఖను నిర్వహిస్తున్న ఈ చిత్రం జ్యోతి పిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది.

**రామారావుకి ప్రమోషన్**

గోల్డెన్‌తో పని పూర్తికాగానే, అక్కడి నుండి ప్రసాద్‌కు వచ్చాను శ్రీమతి సావిత్రి కెమెరా ముందు నిలబడి, రామారావుగారికి పొజిషన్ చెప్తూ వున్నారు. రామారావుగారు ఆనంద పరవశంతో యింట్లోకి అడుగు పెట్టారు. ఆయన సరాసరి బేబిరాణి దగ్గరికెళ్ళి, ఆ పాప చేతుల్లో బిస్కెట్టు పొట్లాన్ని పెట్టారు ఆ పాపాయి 'నాకు బిస్కెట్టు వద్దు టపాకాయలు కావాలి' అని నసుగుతుంది 'నే కొని పెడతాగా' అంటారు ఎన్. టి



నటి కాంతి

ఫోటో: ప్రభాకర్

## సినిమా

ఆరో: 'ఏమో, నేను నమ్మను. మీరు అబద్ధాలు చెప్తారటగ' అంది రాణి; 'అలాగా, ఎవరు చెప్పారేమిటి'? 'అమ్మగారు చెప్పారు. 'అంది రాణి' 'అదా సంగతి మీ అమ్మ పని నేను పడ్తానుగ' అంటారు రామారావు. 'కట్' అన్నారు దర్శకులు సావిత్రి; రామారావు ఆనందపరవశంతో వచ్చారు అని వ్రాసాను; దానికి కారణం ఆయనకు వుద్యోగంలో ప్రమోషన్ రావడమే. ఈ సన్నివేశం పూర్ణా ఆర్టు పిక్చర్సు నిర్మిస్తున్న 'మాతృ దేవత' చిత్రంలో కనిపిస్తుంది. సావిత్రి, రామారావు, చంద్రకళ, శోభన్ బాబు, నాగభూషణం, ప్రభాకరరెడ్డి, రేలంగి, హేమలత, బేబిరాణి ముఖ్య పాత్రలను పోషిస్తున్న యీ సాంఘిక చిత్రానికి మద్దిపట్ల సూరి సంభాషణలను వ్రాసారు. స్క్రీన్‌ప్లేను సత్యగాత్మ, సంగీతాన్ని మహదేవన్, ఛాయాగ్రహణాన్ని శేఖర్ సింగు నిర్వహిస్తున్న యీ సాంఘిక చిత్రం ఆంధ్రాలో పూర్ణా పిక్చర్సు ద్వారా విడుదలౌతుందని నిర్మాత అట్లూరి పూర్ణచంద్రరావు వెల్లడించారు.



'టక్కరిదొంగ—చక్కనిచుక్క'లో విజయనిర్మల.

### ఆధునిక సమాజంపై నాగేశ్వరరావు పాట

ప్రసాద్ స్టుడియో నుండి విజయా గార్డెన్స్‌కు వెళ్లాను. నా అదృష్టం కొద్దీ ఆ రోజు విజయభట్ ప్రొడక్షన్స్ 'భలే రంగడు' రికార్డింగు వుండింది; నేను విన్న పాట చిత్రంలో యెవరు, యెందుకు పాడ్తారో వివరిస్తాను.

'పైసా పైసా పైసా,
హైలేసా ఓ లేసా,
లేకుంటే కలికి చేదు,
కలిగుంటే గవరనేరు'—

యీపాటను శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రారు; శ్రీ ఘంటసాల పాడారు; చిత్రంలో నాగేశ్వరరావు నోటివెంట మీరు వింటారు; కవిగారు వ్రాసిన పై పాట నేటి సమాజంలో జరుగుతున్న వ్యవహారాలకు సమంజసంగా వుంది; న్యాయధర్మాలు, యుక్తాయుక్తవిచక్షణకు నేటి సమాజంలో విలువ లేదనే అనుకోవాలి; డబ్బున్నవారే గొప్పవాళ్లు అనెడి భావం నేటిసంఘంలో పాతుకు పోయినట్టనిపిస్తుంది. ఈ భావాన్ని కవిగారు అందరికి అర్థమయ్యే విధంగా

## మీకు తెలుసా?

శ్రీ జగ్గయ్య వుత్తమ నటుడు వుత్తమ వక్త మాత్రమే కాదు, ఆయన చక్కటి కథకుడుకూడా.

కుమారి జయలలిత ఏకసంధాగ్రాహి ఒకపేజి డైలాగులనుకూడ ఒకసారి చదివితే చాలు; ఆమెకు వెంటనే వచ్చేస్తుంది.

శ్రీ ఎన్. టి. రామారావు, శ్రీ ఎం. జి. రామచంద్రన్ ప్రాణస్నేహితులట; అట్లాగే శ్రీ నాగేశ్వరరావు, శ్రీ శివాజీగణేశన్ ఆప్తమిత్రులట.

ప్రముఖనటుడు. దర్శకుడు. నిర్మాత శ్రీ రాజకపూర్‌కు తంజావూరు బియ్యం అంటే చాలా యిష్టమట; ఆయనకు దక్షిణాదివారంటే ప్రత్యేక గౌరవమట.

తప్పక చూడవలసిన
ఆంధ్రా జేమ్సుబాండ్ చిత్రం!

సాగర్ ఫిలింస్ సమర్పించు

# గోవా సి.ఐ.డి. 999





'ఆత్మీయులు'లో నాగేశ్వరరావు, చంద్రకళ.

వ్రాసారు. సారథిస్టూడియోలో 'భలేరంగడు' షూటింగు జరగడంవల్ల, యీపాట అక్కడే చిత్రీకరించబడుతుంది. నాగేశ్వరరావు, గుమ్మడి, నాగభూషణం, సత్యనారాయణ,

## సినిమా

పద్మనాభం, ధూళిపాళ, వాణిశ్రీ, విజయ లలిత, సూర్యకాంతం ముఖ్యపాత్రలను పోషి



'గండికోట రహస్యం'లో జయలలిత, రామారావు.

స్తున్నారు. శ్రీయుతులు ముళ్లపూడి, గొల్లపూడి మారుతీరావులు సంభాషణలను వ్రాసిన యీ చిత్రానికి రామకృష్ణరావు ఛాయాగ్రాహకుడిగ, మహదేవన్ సంగీత దర్శకుడిగ, జి. వి. సుబ్బారావు కళాదర్శకుడిగ పనిచేస్తున్నారు. శ్రీ భట్ నిర్మిస్తున్న యీచిత్రంయొక్క షూటింగు మే మొదటి



'జన్మభూమి'లో కళ్యాణి.

వారంలో పూర్తవుతుందని దర్శకుడు శ్రీ తాతినేని రామారావు గార్డెన్స్‌లో కలిసినప్పుడు వెల్లడించారు.

### కొత్త యింట్లోకి వెళ్తున్న విజయలలిత

ఇటీవల నటి విజయలలితను కలిసినప్పుడు 'నేను, యీ నెలాఖరుకు మాంబళంలో కొన్న కొత్త యింట్లోకి వెళ్తున్నాను' అంది; 'గృహప్రవేశానికి చిత్రసీమకు చెందిన వ్యక్తులను ఆహ్వానిస్తు

న్నారా?' అని ప్రశ్నించాను. 'అదేం లేదండీ. సింపుల్‌గానే చేస్తున్నాను. రెండు వందలమంది బీదలకు అన్నం పెడుతున్నాను. ఆ తర్వాత సత్యనారాయణవ్రతం చేస్తాను' 'బాగానేవుంది' అని చెప్పివచ్చేసాను.

## నిర్మాత, కథకుడు అయిన నటుడు

క్యారెక్టరు నటుడు శ్రీ ప్రభాకరరెడ్డి చిత్ర నిర్మాత అయ్యారు అని మీకు కొద్దు నెలల క్రితం తెల్పి వున్నాను. ఆ



'శభాష్ సత్యం'లో రాజశ్రీ.

తర్వాత యేం జరిగిందో మీకు తెలపాలిగ.

ప్రభాకరరెడ్డి నటుడే కాదు, చక్కటి కథకుడు అని మీరే అంటారు చిత్రం విడుదలయిన తర్వాత. ఆయన స్థాపించిన సంస్థకు జయప్రద పిక్చర్స్ అని నామకరణం చేసారు. కథ ఆయనే వ్రాసారు. సంభాషణలను మద్దిపట్ల సూరి వ్రాస్తున్నారు. 'ఒక ప్రముఖ దర్శకుడిచే యీ చిత్రాన్ని డైరెక్టు చేయించడమా లేక ఒక కొత్త దర్శకుడికి అవకాశం యిచ్చి అతని భవిష్యత్తును తీర్చి దిద్దడమా అనేది



"అమ్మాయిలూ జాగ్రత్త"లో విజయశ్రీ.



"రాజసింహ"లో జ్యోతిలక్ష్మి, సత్యనారాయణ.

# సినిమా డైరీ

● శ్రీ ఎ. ఎల్. శ్రీనివాసన్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించదలచిన తెలుగు చిత్రానికి భమిడిపాటి రాధాకృష్ణ రచన సాగిస్తున్నారు.

● సురేష్ మూవీస్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రం యొక్క షూటింగులో శ్రీ నాగేశ్వరరావు ఏప్రిల్ 1 నుండి 18 వరకు పాల్గొన్నారు.

● శ్రీ నాగిరెడ్డి తమిళంలో నిర్మిస్తున్న "నమ్‌నాడు" కలర్ చిత్రం యొక్క షూటింగు ఏప్రిల్ 16 న ప్రారంభమయింది. శ్రీ ఎన్. టి. రామారావు స్విచ్ ఆన్ చేసిన యీ చిత్రానికి జంబూ దర్శకుడు. తమిళంలో కుమారి జయలలిత కథానాయిక పాత్రను ధరిస్తోంది.

● శ్రీ టి. ఆర్. రామన్న కలర్‌లో నిర్మిస్తున్న "స్వర్గం" తమిళ చిత్రం షూటింగ్ ఏప్రిల్ 16 న ఎ. వి. ఎం. స్టుడియోలో ప్రారంభించబడింది. శ్రీ శివాజిగణేశన్, శ్రీమతి విజయ ప్రధాన పాత్రధారులు.

● డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న "గండికోట రహస్యం" షూటింగు ఏప్రిల్ 15 తో పూర్తయింది. మే 1 న విజయ పిక్చర్స్ ద్వారా విడుదల కానున్న యీ చిత్రంలో శ్రీ రామారావు ద్విపాత్రాభినయం చేశారు.

● ఏప్రిల్ 18 వరకు సురేష్ షూటింగులో (మద్రాసులో) పాల్గొన్న శ్రీ అక్కినేని ఏప్రిల్ 19 నుండి 28 వరకు శ్రీ విజయభట్ ప్రొడక్షన్స్ షూటింగులో (హైదరాబాదులో) పాల్గొంటారు. ఈ చిత్రానికి శ్రీ తాతినేని రామారావు దర్శకుడు.

● నిర్మాత శ్రీ జి. గోపీనాథ్ 'హరీష్ పిక్చర్స్' బ్యానర్‌మీద 'జాలి మనసులు' చిత్రాన్ని నిర్మిస్తున్నారు. శ్రీ మానాపురం అప్పారావు దర్శకత్వం నెరపే ఈ చిత్రానికి ప్రముఖ రచయిత్రి లత రచన చేస్తున్నారు. కథ బి. విజయరత్నం. నిర్వహణ శ్రీ యస్. హెచ్. మదీనా.

మీమాంసలో పడ్డాను' అన్నారు ప్రభాకరరెడ్డి. చిత్రంలోని ప్రధాన పాత్రలను వాణిశ్రీ, గీతాంజలి, సూర్యకాంతం, కృష్ణ, గుమ్మడి, నాగభూషణం, ధూళిపాళ, రాజబాబు పోషించడానికి అంగీకరించినట్లు వివరించారు 'మీరు నటించడం లేదా?' అని ప్రశ్నించాను. 'నాకు తగిన పాత్ర ఈ చిత్రంలో లేదు. అదీగాక నిర్మాతగా వుంటూ రంగు వేస్తే యేదయినా అర్జెంటు పని వస్తే రంగుతో పరుగెత్తగలమా చెప్పండి అందుకే వేషం వెయ్యడం లేదు' అన్నారు ఆయన నిర్మిస్తున్న చిత్రానికి 'మూడు ముళ్ళు' అని పేరు పెట్టారు. షూటింగు సెప్టెంబరులో ప్రారంభమవుతుంది సంక్రాంతికి మీ ముందు వుంటుంది. ఈ చిత్రానికి కోదండపాణి సంగీతాన్ని, బి ఎస్. కృష్ణ ఆర్టును, మార్తాండ్ ఎడిటింగును నిర్వహిస్తారు

## నిర్మాతఅయిన రూపశిల్పి

చిత్రరంగంలో రెండు దశాబ్దాలుగ మేకప్ వెయ్యడంలో సిద్ధహస్తుడు అనిపించుకుంటున్న శ్రీ భద్రయ్య తన మిత్రులయిన శ్రీ వరప్రసాదరావుతో కలిసి మమతా పిక్చర్స్ అనెడి చిత్రనిర్మాణ సంస్థను స్థాపించి ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మించడానికి నిశ్చయించారు శ్రీ సి ఎస్. రావు శ్రీ వేదాంతం రాఘవయ్యలవద్ద సహకార దర్శకుడిగ పనిచేసిన శ్రీ మాణిక్యాలరావును తన చిత్రానికి దర్శకుడిగా నియమించి సాటి టెక్నీషియన్ల ప్రగతికి కారకులు కాగల్గారు; నిర్మాత భద్రయ్య, దర్శకుడు మాణిక్యాలరావులు శ్రీ రామారావును కలిసి తమ చిత్రంలో నటించమని కోరగా ఆయన తన అంగీకారాన్ని తెల్పారు శ్రీ రామారావు ద్విపాత్రాభినయం చెయ్యనున్న యీ చిత్రంలో దేవిక, వాణిశ్రీ, ప్రభాకరరెడ్డి, రాజబాబు ముఖ్యపాత్రలను పోషిస్తారు.

— శ్రీనివాస్

# పుస్తకాలు

## సాహిత్య రత్నావళి

రచయితలు: శ్రీ పన్నాల వేంకటాద్రిభట్టశర్మ, శ్రీ పోచిరాజు శేషగిరిరావు, శ్రీ కఱ్ఱా చంద్రశేఖర శాస్త్రి. డెమ్మీ 60 పుటలు. వెల: రు. 1-50 ప్రతులకు: శ్రీ మైలవరపు రంగారావు, కార్యదర్శి, విజ్ఞానమండలి, శ్యామల్‌కోట, కాకినాడ తాలూకా, తూర్పు గోదావరి జిల్లా.

శ్యామల్‌కోటలోని విజ్ఞానమండలి వారు 'ప్రముఖులైన వక్తల చేత ఉపన్యాసాలిప్పించి, సారస్వత తాత్విక ప్రియులైన అసంఖ్యాక ఆంధ్రప్రజానీకానికి కూడా అక్షర రూపంలో అందివ్వవలెననే సంకల్పం'తో దీన్ని ప్రచురించారు.

మండలి పక్షాన ఉపన్యాసాలిచ్చిన ముగ్గురు విద్వాంసుల వ్యాసాలిందులో ఉన్నవి. మొదటిది 'ఆంధ్ర కవితారీతులు' అనేది. దీని రచయిత శ్రీ పన్నాలవారు. విషయం బృహత్తరమయింది. దీన్ని గురించి ఎంతైనా చెప్పవచ్చు. వారు చాలా సంగ్రహంగానే చెప్పినా పుస్తకంలో సగం పుటల (32 పుటలు) కు పైగా ఇది ఆక్రమించింది. ఆంధ్రభాషా ప్రాశస్త్య వివరణతో ప్రారంభించి శ్రీ శ్రీ వరకూ వెలసిన వివిధ కవితారీతుల వైశిష్ట్యం ఈ వ్యాసంలో వివరింపబడింది. ఆయా రీతుల్లో ప్రముఖులనూ, వారి గ్రంథాలను గురించిన వివరాలున్నవి. సులభంగా, సంగ్రహంగా ఆంధ్రకవితా రీతులను తెలుసుకొనుటకు ఈ వ్యాసం బాగా ఉపయోగిస్తుంది.

రెండవ వ్యాసం 'రసపరిప్లుతంగా రామకథ పల్కిన కమనీయ కవికోకిల వాల్మీకి' అనేది. శీర్షిక దీర్ఘంగా వున్నా వ్యాసం 11 పుటల్లో, హ్రస్వంగానే ముగించబడింది. ఇది హ్రస్వంగా ఉన్నా సాహితీకళను గురించీ, కవిత్వాన్ని గురించీ, ఆదికావ్యాన్ని గురించీ మంచి విషయాలను సోదాహరణంగా వివరిస్తూ ఉన్నది. విద్వాంసులున్నూ మెచ్చదగిన అంశాలు చక్కగా తెల్పబడి ఉన్నవి. రచయిత శ్రీ పోచిరాజు శేషగిరిరావుగారు.

మూడో వ్యాసం శ్రీ కఱ్ఱా చంద్రశేఖరశాస్త్రి గారిది. సంస్కృతంలో సుభాషిత త్రిశతిని రచించిన భర్తృహరిని గూర్చిన 13 పుటల వ్యాసం. వ్యాసకర్త మహాకవి వ్యక్తిత్వానికీ, కాలానికీ సంబంధించిన విషయాలను గూర్చి చర్చించక 'దిజ్మాత్రంగా భర్తృహరి ప్రదర్శించిన నిశిత లోకపరిశీలనా దృక్పథాన్నీ మానవాళిలో గల మనస్తత్వ వైవిధ్యాన్నీ చూపుటకు ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో శ్రీ శాస్త్రిగారు కృతార్థులైనారనే చెప్పవలసి ఉంది. విషయ వివరణంలో నీతికి మొదటి స్థానం యిచ్చి, తర్వాత వైరాగ్యాన్ని ఎత్తుకొని, చివరకు శృంగారశతక విషయాన్ని గ్రహించడమూ, అందులోనూ నీతి మార్గానికే ప్రాధాన్యం ఇవ్వడమట చాలా ఉచితంగా ఉన్నది.

వ్యాసకర్తలు ముగ్గురూ ప్రాచ్యకళాశాలల్లో గురుకుల వాసం చేసి చక్కని పాండిత్యం సంపాదించిన వారే! అందువల్ల వారు చెప్పే విషయాల్లో అనుచితమైన విషయం గోచరించదు.

మండలివారు రచయితల జీవితచరిత్ర సంగ్రహాన్ని ఛాయాచిత్రాలతో కూడా ప్రకటించడం, ప్రశంసనీయం.

'లోకంలో ఆధ్యాత్మికమైన విషయాల వంక ఆసక్తి సన్నగిల్లుతున్న ఈ రోజులలో యథాశక్తి ఆధ్యాత్మిక విద్యావ్యాప్తికి కృషి చేయవలెననే సంకల్పం విజ్ఞానమండలికి ఉన్నందున ఆధ్యాత్మిక విషయాలను గూర్చిన వ్యాసాలను కూడా సులభ పద్ధతిలో తయారు చేయించి, యీ మాదిరిగానే గ్రంథ రూపంగా ప్రకటించడం మంచిది.

—అంగీరస

## ప్రాణాంతక ప్రణయం

రచన: శ్రీ వి. ఎస్. అవధాని. ఎమెస్కో పాకెట్ సైజు 208పేజీలు. వెల: రు. 2. ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో, మద్రాసు, సికింద్రాబాదు, మచిలీపట్నం.

మనదేశంలో—మనభాషలో పుట్టి, జనప్రియమయిన ప్రణయ కావ్యం 'చిత్రాంగి'. వయసులో వున్న చిత్రాంగి సారంగధరుడంటే మనసుపడటం సహజమే. అయితే—వరుసా వావీ తెలిసిన సారంగధరుడు 'సై' అనటానికి సాహసించ లేకపోయాడు. అతని మనో సంఘర్షణ తనకూ సవతి తల్లికీ మధ్యని ఘర్షణకు కారకమయింది.

సరిగా ఇలాగే, చిత్రమైన ఒక వ్యూహాన్ని మనసులో పెట్టుకుని 'ప్రాణాంతక ప్రణయం' నవల రచించారు శ్రీ అవధాని.

అక్కడ చిత్రాంగికీ సారంగధరుడికీ మధ్య పొరబాటు జరక్కపోయినా అగ్గి పుట్టింది. ఈ నవలలో అన్నపూర్ణా నారాయణుల మధ్య ఒకే ఒక్కసారి ఒకే ఒక చిన్న పొరపాటు జరిగినా, అది ఆ ఇద్దరి మధ్యనే దాగిపోయింది.

ఆ గాథలో చిత్రాంగికి సవతికొడుక్కీ— రభస పడ్డ తరవాత పోత్తే లేదు. అందుకే గుట్టు రట్టయింది. ఈ నవలలో అన్నపూర్ణకీ సవతికొడుక్కీ 'పెరపెర' తరవాత కావలసినంత పొత్తు. కనుకనే వాళ్ళ వీధిన పడలేదు.

ఇందులో మనకి లొరసపడే అన్నపూర్ణా నారాయణా కలిసి చేసిన తప్పు ఒకే ఒక్కటి. అది అంతటితో పోతే బాగుండును. అన్నపూర్ణ నారాయణను దోవలో పెట్టలేకపోవటం రెండోది. అతడు ఆత్మహత్యకు పాల్పడటం మూడవది. ముక్తసరిగా ఇదే ముఖ్యమయిన కథ.

ఈ వలపు గాథలో వివిధ పాత్రల తర్కవితర్కాలనూ, వాదోపవాదాలనూ అవధానిగారు అతి సమర్థతతో చిత్రించారు. అందుకనే, కథ పరిమితిని పాటించకుండా ఉత్సాహంతో చివరికంట చదువుకు పోగలం.

—శివకుమారి



బ్రిటన్‌లోని బ్రయిటెన్‌లో జరిగిన ఆటవస్తువుల సంతలో పిన్నలు, పెద్దలు పార్టీలలో, కారి వాల్స్‌లో పెట్టుకునే వివిధరకాల టోపీలని ప్రదర్శించారు. వీటిని డబ్ల్యు. ఆర్. డేవీస్ (షరాన్‌లీ) లిమిటెడ్, ఇంగ్లండు వారు తయారు చేశారు.

### [illegible]

నాటిక. రచన శ్రీ నిట్టల శత్రుఘ్నరావు, 40 పేజీలు. 1.25 పైసలు. ఉదయసాహితీ పబ్లికేషన్స్, మహంతీపురం, విజయవాడ—1.

### దేశదిమ్మరి

నాటిక. రచన శ్రీ పొట్లూరి నాగేశ్వరరావు. 30 పేజీలు. 1.25 పైసలు. ఉదయ సాహితీ పబ్లికేషన్స్, మహంతీపురం, విజయవాడ—1.

### జీ వి తా లు

నాటిక. రచన శ్రీ కారెపు అప్పలస్వామి. 48 పేజీలు, 1.50 పైసలు. ఉదయసాహితీ పబ్లికేషన్సు, మహంతీపురం, విజయవాడ—1.

### శ్రీ హనుమాన్ స్తోత్రమంజరి

స్తోత్రపద్యాలు. సేకరణ శ్రీ హరనాథ్ శంకర్. 24 పేజీలు. 60 పైసలు. శంకర్ పబ్లికేషన్సు, సూర్యారావుపేట, విజయవాడ—2.

### పృ థ్వీ శా ఖ

నాటకం. రచన శ్రీ కె. రాజమల్లాచారి. 72 పేజీలు. 1.50 పైసలు. భగవాన్ బుక్‌సోర్స్ నంద్యాల,

### వ రా ల మూ ట

గేయశతకం. కృతికర్త శ్రీ దమ్మ తాతయ్య. 52 పేజీలు. 1.50 పైసలు. మణిమాల పబ్లికేషన్సు, ఈశ్వరీనిలయం, 1—9—129/6, రాంనగర్, హైదరాబాదు—20.

### సి ద్ధ చ క్ర

నాటిక. రచయిత శ్రీ చల్లా రామగణపతి ప్రసాద శాస్త్రి. 36 పేజీలు. వెల 15 పైసలు. ప్రచురణ జైన్ ఆధ్యాత్మిక కేంద్రము, గుండువారివీధి, రాజమండ్రి—1.

### ఆంధ్రమేఘదూతము

పద్య కావ్యము. రచయిత శ్రీ సోమంచి సూర్యనారాయణ శర్మ. 26 పేజీలు. 1.50 పైసలు. ఎస్. ఎ. పద్మనాభశాస్త్రి, సూర్యారావుపేట, కాకినాడ—1.

### వెయిటింగ్ రూమ్

నాటిక. రచన శ్రీ సత్యశ్రీధర్. 38 పేజీలు. ఒక రూపాయి. జయశ్రీ పబ్లికేషన్స్, కొత్తపేట, విజయవాడ—1.

### పల్నాటియుద్ధము

నాటకము. రచన డాక్టరు కె. బసవలింగదేవర 100 పేజీలు. రెండు రూపాయిలు. ప్రచురణ శ్రీ శైవభారతీ గ్రంథమాల, మాచర్ల.

### శ్రీ ని వా స

పద్యకావ్యం. రచయిత శ్రీ యన్. మదనయ్య. వెల రూపాయి. గీతాప్రచురణలు, ఆసిఫాబాద్, జిల్లా ఆదిలాబాద్.

## పుస్తకాలు

### గీతాపఠనప్రయోజనములు

రచయిత శ్రీ జయదయాల్ గోయందగా. అను, వాదకులు శ్రీ మల్లంపాటి వెంకటసుబ్బారావు, ఎలవర్రు. తెనాలి తాలూకా. 75 పైసలు. 25 పేజీలు.

### అగ్నివేశరామాయణము

ఆంధ్ర వ్యాఖ్యాత శ్రీ పురాణపండ రామమూర్తి. 80 పేజీలు. 1.50 పైసలు. పి. రాధాకృష్ణమూర్తి, కార్యదర్శి. ఆధ్యాత్మ ప్రచారకసంఘం, రాజమండ్రి—1. ●



యువచిత్రకారుడు మనోహన్‌దత్ బొమ్మ అని మార్చి 17వ తేదీన హైదరాబాదు ఆర్ట్స్ సొసైటీవారి ప్రదర్శించారు. ఆ చిత్రాలలో ఒకటి.

## న్యూఢిల్లీ లేఖ

( 7వ పేజీ తరువాయి )

యిష్టాలకు తావిచ్చే సమస్యకాదు. జాతీయ సమస్య. ఆమె తీసుకున్న నిర్ణయాలపైనే భారతదేశం భవిష్యత్తు ఆధారపడివుంటుంది. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీమీద దాడి మన పురోగమనాన్ని సూచిస్తుందా? ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ అంటే దేశం రక్షణశాఖలో ఒక భాగం. వాటికే దిక్కులేకపోతే తక్కిన వ్యవహారాల్లో క్రమశిక్షణ, శాంతి భద్రతలు ఎలా వుంటాయనుకోవాలి? మొత్తం భారతదేశం రక్షణ ఆమెమీద పెట్టుకున్నప్పుడు ఒక దారి చూపించకపోతే ఎలా?

ఆర్డినెన్స్ ఫ్యాక్టరీమీద దాడి రకాన్ని చవి చూసింది. కేంద్రం కలగజేసుకోక పోలేదు. జుడిషియల్ ఎంక్వయిరీ వేసింది. గోటితో పోయేదానికి గొడ్డలి! బెంగాల్‌కి ఇలాంటి పద్ధతులంటే గిట్టదు. 'శాంతి భద్రతలు రాష్ట్రానికి సంబంధించిన విషయమైతే, కేంద్రం ఎలా కలగజేసుకుంటుంది?'—అని జ్యోతిబాసుగారు ముఖం మీద అనేశారు.

నిజమే శాంతిభద్రతలు రాష్ట్రసంబంధమైన విషయమే. ఇరిగేషన్, విద్య, ఆరోగ్యం, ఆహారం, వ్యవసాయంకూడా అంతే. మరి వాటి సహాయానికి కేంద్రం అసహాయతని ప్రకటించినప్పుడు బెంగాల్‌లో ఉద్యమం ఎందుకు తేవాలి? కేంద్రాన్ని బెదిరించడమెందుకు? 'మాకు కేంద్రం సహాయం చెయ్యకపోతే ఎదురుతిరుగుతాం' అని ఆయన నోరులేని టీచర్లని రెచ్చగొట్టారు!

ఢిల్లీకి వస్తున్న బెంగాల్ మంత్రులు వస్తూవస్తూ—కేంద్రాన్ని లోబరుచుకోడానికి ఉద్యమాలపేరిట కొన్ని ఆయుధాల్ని తెచ్చుకుంటున్నారు. జయప్రకాశ్‌నారాయణ్‌గారు పటుత్వమైన ప్రభుత్వం కావాలో అంటున్నారు. ప్రభుత్వానికి ఎన్నో అధికారాలున్నాయి. ఒకటేలోటు. అదే, సంఘీభావం! అదిలేదు. చాంబర్‌లేన్‌లాగ శ్రీమతి గాంధీగారు కూడా కమ్యూనిస్టు బెంగాల్‌కి లొంగిపోవచ్చు. కాని, చాంబర్‌లేన్‌లానే కమ్యూనిస్టులకు లొంగిపోవడంద్వారా భారతదేశాన్ని నాశనం చేస్తున్నారన్నమాట! కొన్ని వారాల్లో దేశం భవిష్యత్తు నిర్ణయమై పోవచ్చు! ●

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd. No. 4479, ANDHRA SACHITRA VARA PATRIKA



# ఆంధ్రసచిత్రవారపత్రిక

మే 1969

| ఆది | సోమ | మం | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |